# తెలుగు వైతాళికులు

I

( ఉపన్యాసాల సంపుటము )






ప్రచురణ

ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ

కళాభవన్, సైఫాబాద్, హైదరాబాద్-500 004.

# తొలి పలుకు

గడచిన శతాబ్దములో జన్మించి ఈ శతాబ్ది ఆరంభములో చరిత్ర నిర్మాణము గావించిన మహనీయులు చాలా మంది మనదేశములో వివిధ ప్రాంతాలలో ఉన్నారు. తెలుగు సాహిత్యరంగంలో ఒక నూతన చైతన్యమును తీసికొని వచ్చి మార్గదర్శకులైన సాహితీమూర్తులను, సంస్కృతీపరులను, యీ శ్రేణిలో చేర్చవచ్చును. ఇటువంటి వారిని గూర్చి యీ తరానికి వివరాలు పూర్తిగా తెలియక పోవచ్చును అందుచేత వీరిని సంస్మరించి వీరు చేసిన భాషాసేవ యీనాటి తరానికి, రాబోవు తరాలకు పరిచయము చేయవలెనని ఆంధ్రప్రదేశ సాహిత్య అకాడమీ ఉద్దేశించినది.

ఈ ఉద్దేశానికి అనుగుణంగా తెలుగు సాహిత్యము, తెలుగు సంస్కృతి రంగాలలో వైతాళికులైన కొందరిని గూర్చి ఉపన్యాసములు, సాహిత్య అకాడమీ పక్షాన ఏర్పాటు చేయనైనది. ఇటువంటి ఉపన్యాసాలు ప్రతి సంవత్సరము కొన్ని చేయించవలెనని సాహిత్య అకాడమి ఉద్దేశము. ప్రముఖులైన విద్వాంసుల చేత యీ వైతాళికులను గూర్చి ఉపన్యాసములు చేయించనైనది. ఆంధ్రప్రదేశ సాహిత్య అకాడమి అనుసరిస్తున్న సంప్రదాయము ప్రకారము యీ ఉపన్యాసాలు గ్రంథరూపములో వెలువరించనైనది.

ఈ గ్రంథములో చేర్చిన ఉపన్యాసాలు నాలుగు. ఈ నాలుగు ఉపన్యాసాలు 1975 సంవత్సరమున ఆగస్టు 2, అక్టోబరు 26, నవంబరు 24, 1976 సంవత్సరమున జనవరి 19 తేదీలలో జరిగినవి. ఇప్పటి వరకు ప్రచురితమైన ఉపన్యాసాల సంపుటాలను ఆదరించినట్లే యీ సంపుటాన్ని గూడ ఆంధ్ర పాఠకలోకము ఆదరించగలదని విశ్వసిస్తున్నాను.

హైదరాబాదు
31-3-76

దేవులపల్లి రామానుజరావు
కార్యదర్శి

## వి ష య సూ చి క

# కొమర్రాజు లక్ష్మణరావు జీవితం

— శ్రీ కె. కె. రంగనాథాచార్యులు

ఇరవయ్యవ శతాబ్ది మొదటిపాదం ఆంధ్రదేశ చరిత్రలో మహాయుగం. మూఢాచార సంప్రదాయ భావాలతో నిద్రాణంగా ఉన్న తెలుగు దేశాన్ని మేలు కొల్పి సంస్కరించిన యుగపురుషుడు కందుకూరి వీరేశలింగం, ఆధునికాంధ్ర కవిత్వానికి వైతాళికగానం చేసి కోమల కవిత్వపు సౌరులను చూపిన గురజాడ అప్పారావు, ఆధునిక విజ్ఞానం ఎక్కువ మందికి అందాలంటే ప్రజలకు సన్ని హితమైన వ్యవహారిక భాషే వాహనం కావాలని నడుంకట్టి ప్రకటించిన గిడుగు రామమూర్తి ఈకాలంలో ఉద్యమాలు నడిపిన వాళ్ళే. ఒకవైపు దేశస్వాతంత్ర్యో ద్యమం తీవ్రరూపం ధరిస్తుంటే భారతదేశం గత చరిత్ర వైభవాన్ని గానం చేస్తూ స్వదేశీయోద్యమాన్ని మరింత ముందుకు నడిపించే నూతనకవిత్వో ద్యమం ఈ కాలంలోనే మొదలైంది. తెలుగువారికి చరిత్ర పరిశోధనలు పరి చయం చేసి తెలుగులో చరిత్ర వైజ్ఞానిక గ్రంథాలు లేని కొరతను తీర్చడానికి మహోద్యమాన్ని ప్రారంభించి నడిపిన ఉత్తమ విజ్ఞానవేత్త, ఆంధ్ర చరిత్ర పరిశోధక పితామహుడు కొమర్రాజు లక్ష్మణరావు ఈకాలం వాడే.

కొమర్రాజు లక్ష్మణరావు పంతులుగారు కృష్ణాజిల్లా, నందిగామ తాలూకా, పెనుగంచిప్రోలులో 18-5-1876 నాడు జన్మించారు. లక్ష్మణరావు గారి వంశానికి మూలపురుషుడు కొమర్రాజు, లక్ష్మణరావుగారికి పన్నెండు తరాల వెనుకటివాడు. లక్ష్మణరావుగారి తండ్రి కొమర్రాజు వెంకటప్పయ్య గారు; తల్లి గంగమ్మ వేంకటప్పయ్యగారికి ద్వితీయ కళత్రం. మొదటి సంతా నం అచ్చమాంబ. పెనుగంచిప్రోలు గ్రామ కరణీకాలలో ఒక కరణీకం కొమ ర్రాజు వారిది. వేంకటప్పయ్యగారు మునగాల జమీందారు దగ్గర దివానుగా పని చేశారు.

లక్ష్మణరావుగారి మూడవయేటనే వేంకటప్పయ్యగారు మరణించారు. అప్పట్నుంచి తల్లి గంగమ్మ ఆధ్యాత్మిక చింతనలో మునిగిపోయింది. రోజూ స్నానంచేసి మడిబట్టలు కట్టుకొని ప్రాణాయామంచేస్తూ అడుగు ఎత్తుకులేచే

దని అంటారు. తండ్రి చనిపోయిన ఈదశలో లక్ష్మణరావుగారు సవతి అన్న శంకరరావు పోషణ కింద భువనగిరిలో చిన్నతనాన్ని గడిపారు. అక్కడే తెలుగు అక్షరాలు దిదుకున్నాడు.

లక్ష్మణరావుగారి మేనమామ భండారు మాధవరావుగారు నాగపూరులో P.W.D. శాఖలో సబ్ డివిజనల్ ఆఫీసరుగా ఉద్యోగం చేసేవారు. వీరి మొదటి భార్య చనిపోతే లక్ష్మణరావుగారి అక్కగారైన అచ్చమాంబను వివాహమాడారు. అందువల్ల గంగమ్మ లక్ష్మణరావుగారితో పాటు నాగపూరు వెళ్ళి స్థిరపడ్డారు. కాబట్టి లక్ష్మణరావుగారి విద్యాభ్యాసం అంతా ఆనాటి మధ్య ప్రదేశ్‌లోని భాగమైన మహారాష్ట్ర ప్రాంతంలో జరిగింది. చిన్నతరగతుల నుంచే వీరి మొదటి భాష మరాఠీ. దీనితోపాటు హిందీ, సంస్కృత భాషలలో కూడ పాండిత్యాన్ని సంపాదించారు. తరువాత బెంగాలీ, గుజరాతీ, కన్నడ భాషలతో కూడ పరిచయం సంపాదించారు. అంతేకాకుండా మహారాష్ట్రుల జీవిత సంప్రదాయాలు, ఆచార వ్యవహారాలు వీరిలో పూర్తిగా జీర్ణించుకొని పోయాయి.

లక్ష్మణరావుగారు నాగపూరులో మారిసు కాలేజిలో F.A.,B.A. పరీక్షలు చదివారు. 1900 సంవత్సరంలో తత్త్వశాస్త్రం, సంస్కృతం ప్రధాన విషయాలుగా B. A. Honours పరీక్షలలో ఉత్తీర్ణులయ్యారు. వీరిని గురించి కళాశాల ప్రిన్సిపాల్ "లక్ష్మణరావు చాల మేధావంతుడు. ఇతని భాషా పాండిత్యం సాహిత్య విజ్ఞానం అసాధారణమైంది. మహారాష్ట్ర పత్రికలలో ఇతని గద్య పద్య రచనలు చాల ప్రసిద్ధి కెక్కాయి. ఇతని సద్వర్తన, వినయ సంపద ఎన్నతగ్గవి" అని ప్రశంసాపత్ర మిచ్చారట. 1901లో ప్రైవేటుగా కలకత్తా విశ్వవిద్యాలయం నుంచి M. A. డిగ్రీ తీసుకున్నారు, లక్ష్మణరావు గారు. తరువాత మద్రాసులో Law చదివి F. L. మాత్రం పూర్తి చేయ గలిగారు.

విద్యార్థిదశలో ఉండగనే లక్ష్మణరావుగారు మరాఠీ భాషలో అనేక వ్యాసాలు, భావగీతాలు, సాంఘిక ప్రహసనాలు వ్రాశారు. మెట్రిక్యులేషన్ చదువుతుండగానే మేనమామ మాధవరావుగారి కుటుంబానికి సన్నిహితుడైన ఒక ముసలి డాక్టరు చిన్నపిల్లను పెండ్లాడిన విషయాన్ని తీసికొని వ్రాసిన

ప్రహసనం మహారాష్ట్ర దేశంలో సంచలనాన్ని కలిగించింది. ఆయన F. A. క్లాసులో ఉండగా భార్యా వియోగాన్ని గురించి "వియోగగీతి" అనే గీతాన్ని రాశాడట. అందులో ఉండే కవి అనుభూతి సహజంగా ఉండటం వల్ల అంత చిన్నతనంలో భార్యా వియోగం కలిగినందుకు ఆయనను ఓదార్చడానికి వచ్చారట చాలామంది. కొంతమంది సానుభూతి తెలుపుతూ ఉత్తరాలు వ్రాశారట. నిజానికి అప్పటికి లక్ష్మణరావుగారి వివాహం కాలేదు. తెలుగులో చరిత్ర పరిశోధనకు తెలుగువారిలో విజ్ఞాన వ్యాప్తికి మాత్రమే ప్రధానంగా తన జీవితాన్ని అంకితం చేసిన పంతులుగారు ఆ తరువాత తెలుగులోగాని, మరాఠీలోగాని కవిత్వం వ్రాసినట్లు కన్పించదు.

మహారాష్ట్రదేశంలో ఉండగానే లక్ష్మణరావుగారు 'సమాచార్', 'వివిధ విజ్ఞాన విస్తార్' అనే పత్రికలకు సంపాదకత్వాన్ని వహించడమే కాకుండా 'కేసరి', 'మహారాష్ట్ర' మొదలైన పత్రికలలో వ్యాసాలు కూడా వ్రాసేవారు. మరాఠీపత్రికలలో వచ్చే అనేక వాదోపవాదాలలో, చర్చలలో కూడా వీరు పాల్గొన్నారు. రామాయణంలోని పర్ణశాల 'నాసికాత్ర్యంబక' మని వాదించిన బాల గంగాధర తిలక్ లాంటి వారిని ఎదుర్కొని భద్రాచలం పర్ణశాలే రామాయణంలోని పర్ణశాలని తర్కబద్ధంగా నిరూపించారు పంతులుగారు. ప్రాచీన మహారాష్ట్రకవి "మోరోపంత్" రచించిన భారతాన్ని పరిశోధించి సరిదిద్ది శుద్ధప్రతిని తయారుచేసి కర్ణపర్వాన్ని ప్రకటించారు. ఇది వారు సంపాదకత్వం వహించిన మొదటి గ్రంథం. ఇట్లా తాము విద్యాభ్యాసం చేసిన మరాఠీ భాషలోనే ప్రారంభమైంది వారి పరిశోధనా వ్యాసంగం.

బాల్యం విద్యాభ్యాసం మహారాష్ట్రలోనే గడచినా ఆంధ్రభాషతోగాని ఆంధ్రదేశ వ్యవహారాలతోగాని లక్ష్మణరావుగారు సంపర్కాన్ని కోల్పోలేదు. మాతృభాషను మరచిపోలేదు. ఇంట్లో తీరిక వేళలలో లక్ష్మణరావుగారు సోదరి అచ్చమాంబగారు తెలుగు పుస్తకాలను, వార్తాపత్రికలను తెప్పించుకొని చదువుతుండేవారు. తెలుగు పత్రికలకు ఇద్దరూ వ్యాసాలు వ్రాస్తుండేవారు. అదే రోజులలో బెజవాడలో క్రైస్తవ మత పాఠశాలలో ఉపాధ్యాయులుగా ఉంటూ ఉండిన రాయసం వేంకట శివుడుగారు స్త్రీ విద్యావ్యాప్తి కోసం 'తెలుగు జనానా' అనే పత్రికను నడిపేవారు. అచ్చమాంబగారు, లక్ష్మణరావుగారు ఆపత్రికకు వ్రాస్తుండేవారు. 1898 సంవత్సరంలోనే పంతులుగారు

తెలుగు జనానా పత్రికకు 'విశ్వం యొక్క విరాట్ స్వరూపం' అనే శీర్షికతో తండ్రీ కూతుళ్ళ సంభాషణా రూపంలో ఉండే ఒక చిన్న వ్యాసాన్ని వ్రాశారు. 'విశ్వంయొక్క బాల్య స్వరూపం' అనే సంభాషణారూప వ్యాసం కూడా అదే పత్రికలో ప్రచురితమైంది. ఈవిధంగా మొదలైంది ఆధునిక విజ్ఞానాన్ని తెలుగువారికి అందించాలన్న వారి ఉద్యమం.

అచ్చమాంబ, లక్ష్మణరావుగార్ల అన్యోన్యానురాగం ఆరోజుల్లో అందరినీ ఆకర్షించేది. తమ్ముని విద్యాభివృద్ధికి అక్కగారు పాటుపడితే అక్కగారి విజ్ఞానాభివృద్ధికి తమ్ముడు దోహదం చేస్తుండేవాడు. అచ్చమాంబగారికి పుత్ర వియోగం కలుగగా లక్ష్మణరావుగారు అక్కగారిని ఓదార్చి దుఃఖోపశమనం కోసం ఆమెతోపాటు తాను చరిత్రగ్రంథాలు పరిశోధించి అనేక భాషలలోని ఉత్తమ గ్రంథాలను సేకరించి అక్కగారిని విదుషీమణిని చేయటానికి దోహదం చేయటమే కాకుండా 'అబలా సచ్చరిత్ర రత్నమాల' అనే గ్రంథాన్ని వ్రాయడానికి తోడ్పడ్డారు. ఈ గ్రంథాన్ని కందుకూరి వీరేశలింగంగారు తమ చింతామణి ముద్రణాలయంలో ప్రచురించారు. ఇందులో సుమారు 1000 సంవత్సరాల కాలంలో ప్రసిద్ధికెక్కిన భారత స్త్రీల కథలున్నాయి. ఇది మాధవరావుగారి కంకితం. అచ్చమాంబ 18-1-1905 లో మరణించారు.

నాగపూరులో ఉన్నప్పుడే పంతులుగారికి తెలుగులో చరిత్రగ్రంథాలు లేకపోవడం అనే వెలితిని పూరించాలనే అభిప్రాయం కలిగింది. వారి మొదటి చరిత్రగ్రంథం 'శివాజీ చరిత్ర', తెలుగు దేశానికి రాకముందు వ్రాసిందే. ఆ గ్రంథం పీఠికలో వారిలా వ్రాశారు. "ఆంధ్రభాషయందు చరిత్ర గ్రంథంబు లత్యల్పంబుగ నున్నవి. కాన చేతనైనంత వరకు మాతృభాషాసేవ చేయవలె ననిన నిచ్ఛతో నీ చరిత్రగ్రంథంబు వ్రాసినాడ. శక్తి వంచనలేక ఇకముందును నిటులనే భాషా సేవ చేయవలయుననిన నిచ్ఛగలవాడను—" పీఠిక చివర తన పేరు కాకుండా 'ఆంధ్రభాషా సేవకుడు' అని పంతులుగారు వ్రాసుకున్నారు.

"దేశభాషలను వృద్ధిచేయవలసిన భార మింగ్లీషుభాషల నభ్యసించిన ప్రతివారు...వహించి దేశభాషాభివృద్ధికి తోడుపడని పక్షమున దేశముయొక్క హీనదశకు వా రుత్తరవాదులుగా నుందురు. కాబట్టి ఇకనైన సర్వ కళాశాలల

యందు బట్ట పరీక్షల నిచ్చి మెప్పొందినవారు తాము లౌక్యాధికారముల యందు ప్రవేశించి భార్యా పుత్రాదుల కాభరణములు చేయించి పెట్టుటతోనే కృతార్థుల మైతి మనుకోక దేశభాషావధూటికి గూడ సద్గ్రంథాభరణములను వృద్ధి పరుప ప్రయత్నింతురని నమ్ముచున్నాను" అన్న కందుకూరివారి పిలుపును అక్షరాలా ఆచరణలో పెట్టినవారు లక్ష్మణరావు పంతులుగారు. విజ్ఞాన వ్యాప్తిద్వారా తెలుగు దేశాన్ని మేల్కొలుప దలచిన పంతులుగారు M. A. పట్టం పుచ్చుకున్నా ప్రభుత్వోద్యోగాన్ని ఆశించలేదు.

కళాశాల విద్య పూర్తయిన తరువాత లక్ష్మణరావుగారి కార్యరంగం తెలుగుదేశానికి మారింది. వారికి, తల్లి సలహా ప్రకారం B. A. పాస్ కాగానే మునగాల జమీందారు దగ్గర దివానుగా పనిచేయాలను కోరిక ఉండేది. B. A. చదువుతుండగానే లక్ష్మణరావుగారు తెలుగు దేశానికి వచ్చినప్పుడల్లా బందర్‌లో మునగాల జమీందారు దగ్గరనే ఉండేవారు. అదే రోజుల్లో కంకిపాడు కరణం కానూరు మల్లికార్జునరావుగారి కూతురు కోటమాంబతో ఆయనకు వివాహం జరిగింది. 1900 సంవత్సరంలో మునగాల ఎస్టేటులో దివానుగా చేరారు పంతులుగారు. అయితే ఈ ఉద్యోగం లక్ష్మణరావుగారి పరిశోధనా కృషికిగాని, భాషాసేవకుగాని అడ్డం రాలేదు. మునగాల జమీందారు నాయని వెంకట రంగారావుగారు పంతులుగారి కృషికి అవసరమైన విశ్రాంతి నిచ్చి ఆర్థికంగా సహాయంకూడా చేసి అన్నివిధాలా అండదండ లిచ్చారు.

తెలుగు దేశంలో లక్ష్మణరావుగారు చేసిన మొదటి మహాకార్యం హైదరాబాదులో "శ్రీకృష్ణదేవరాయాంధ్రభాషా నిలయ" స్థాపన. నాయని వెంకట రంగారావుగారికి ఆనాటి నిజాం రాష్ట్రంతో సంబంధా లుండేవి. వారితోపాటు లక్ష్మణరావుగారికి కూడ సంబంధం ఏర్పడింది. వీరిద్దరూ, హైదరాభాదులో ఉండే రావిచెట్టు రంగారావుగారు, ఆదిపూడి సోమనాథరావుగారు, మైలవరపు నరసింహశాస్త్రిగారు మొదలైనవారు కలసి హైదరాబాదులోని అప్పటి రెసిడెన్సీ బజారులో, రావిచెట్టు రంగారావుగారి స్వగృహంలో ఈ గ్రంథాలయాన్ని 1-9-1901 నాడు స్థాపించారు. తెలంగాణలో తెలుగు భాషా స్థితిని మెరుగు పరచడమే ఈ గ్రంథాలయ స్థాపన ప్రధానోద్దేశ్యం. మొత్తం తెలుగుదేశంలో అధునాతన పద్ధతులలో ప్రారంభమైన మొదటి గ్రంథాలయం

ఇదే. ఆదిరాజు వీరభద్రరావు వంటి మహనీయులు ఈ గ్రంథాలయానికి కార్య కర్తలుగా పని చేశారు.

తెలుగు దేశం నిరక్షరాస్యతతో, ఆధునిక విజ్ఞాన దారిద్ర్యంతో కొట్టు మిట్టాడటం లక్ష్మణరావుగారిని ఎప్పుడూ బాధిస్తూ ఉండేది. ఆధునిక విజానంలో అభివృద్ధిని సాధించడం వల్లనే పాశ్చాత్య దేశాలు తక్కిన దేశాల కంటే ముందంజలో ఉన్నాయని గుర్తించిన లక్ష్మణరావు పంతులుగారు, నాయని వేంకటరంగారావు, గాడిచర్ల హరి సర్వోత్తమరావు, అయ్యదేవర కాళేశ్వరరావు, రావిచెట్టు రంగారావు మొదలైన వాళ్ళతో కలసి 'విజ్ఞాన చంద్రికా గ్రంథమండలి' అనే సంస్థను స్థాపించడానికి ప్రణాళిక వేశారు. అంతకు ముందు తెలుగు దేశంలో గ్రంథమాలలు లేవు. మహారాష్ట్రలో ఉండే గ్రంథమాలను చూచిన పంతులుగారు తెలుగుదేశంలో కూడ దాన్ని ప్రవేశ పెట్టారు. ఈ గ్రంథమండలి యొక్క ప్రధానోద్దేశ్యం ఈవిధంగా ఉండేది: "స్వరాజ్యం కొరకు ఆంధ్రదేశంలోను, యావద్భారతంలోనూ కూడ గాఢ వాంఛ ప్రబలియున్నది. కులమత భేదాలు లేక యుక్తవయసు వచ్చిన ప్రతి పురుషునికిని, స్త్రీకిని ఓటు గలిగిన స్వరాజ్యమే మన గమ్యస్థానం. భారత దేశంలో ఆరుకోట్ల జన సంఖ్యగల పంచముల అస్పృశ్యత రూపుమాపనిది స్వరాజ్యము రానేరదు. వచ్చినను నిలువ నేరదు. కనుక అస్పృశ్యతా నివా రణకు గట్టి కృషి చేయవలసి యున్నది. స్త్రీలయొక్క విద్య, అభ్యున్నతి, హక్కుల కొరకు గూడ బాగుగా కృషిసలువ వలసి యున్నది. నవీన ప్రపం చంలో భారతదేశం ఒక స్వతంత్ర ప్రజారాజ్యంగా నిర్మాణ మగుటకు యావద్భారత ప్రజలకు ఆంధ్ర ప్రజలకు నవీన ప్రపంచంలో అత్యంతముగా వృద్ధి యైన ప్రకృతిశాస్త్ర, చారిత్రక, రాజకీయార్థిక విజ్ఞానమునిచ్చుట ఆవశ్యకము". ఇంతటి మహాధ్యేయంతో ప్రారంభమైంది విజ్ఞానచంద్రికామండలి. ఈ మండలి స్థాపన 1906లో హైదరాబాదులోనే జరిగింది. మండలికి అయ్యదేవర కాళేశ్వర రావు, గాడిచర్ల హరిసర్వోత్తమరావు కార్యదర్శులు. లక్ష్మణరావు ప్రధానసంపా దకులు. లక్ష్మణరావు పంతులుగారు మునగాల జమీందారు వ్యవహారం కోసం మద్రాసులోనే ఉండిపోవలసి వచ్చినందునా, ఇతర రాజకీయ కారణాలవల్ల 1908లో విజ్ఞాన చంద్రికామండలి మద్రాసుకు మారింది. అందులో పనిచేస్తున్న ఆదిరాజు వీరభద్రరావువంటివారు కూడ తమనివాసాన్ని మద్రాసుకు మార్చారు. మండలి స్థాపన లక్ష్మణరావుగారి జీవితంలో రెండవ ప్రధాన ఘట్టం.

తెలుగులో మొదట్నుంచీ కవిత్వ వాఙ్మయం, ప్రబంధాలు ఎక్కువగా వెలువడ్డాయి. అవి ఆధ్యాత్మికనైతిక విషయాలకు వినోదానికి ఉపయోగించేవే గాని ఆంధ్రజాతిని ఆధునిక నాగరిక జాతిగా తీర్చి దిద్దడానికి పనికివచ్చేవి గావు. పురాణయుగం నుంచీ ప్రకృతిశాస్త్ర ఆర్థిక రాజకీయ యుగానికి తెలుగు వాళ్ళను తీసుక పోవలసి ఉంది. తెలుగులో పాతకాలం నుంచీ ప్రధానంగా పద్యకావ్యాలు తప్పితే వేదాంతగ్రంథాలుగానీ, శాస్త్రగ్రంథాలు – ప్రధానంగా ప్రకృతి శాస్త్రగ్రంథాలుగానీ తక్కువ. ఆంగ్ల విద్యావ్యాప్తి జరిగిన తరువాత కూడ విజ్ఞాన శాస్త్రాలను అధ్యయనం చేసినవారు ఇంగ్లీషులోనే చదవటం, వ్రాయటం అలవాటు చేసుకొన్నందువల్ల తెలుగు వాళ్ళకు వైజ్ఞానిక విషయాలు తెలియడం లేదు. ప్రాచీన శాస్త్రగ్రంథాలు సంస్కృతంలోనే ఉన్నాయి. వాటికి వ్యాఖ్యానం టీకా తాత్పర్యం మొదలైనవి కూడా సంస్కృతంలోనే ఉన్నాయి. ఆధునిక విజ్ఞానాన్ని ఎక్కువమంది కందించటం ఆధునిక నాగరికతాధర్మాలలో ఒకటిగా పంతులుగారు భావించారు. ఇంగ్లీషు తెలియని వారికి కూడా ఆధునిక విజ్ఞాన శాస్త్రం అందుబాటులో ఉండాలనీ, తెలుగులోనే నూతన పరిశోధనా, శాస్త్రగ్రంథాల రచన జరగాలనీ పంతులుగారు అభిప్రాయ పడేవారు. మొదట లక్ష్మణరావుగారికి, 100 పేజీల పత్రిక ఒకదానిని ప్రచురించి, విజ్ఞాన ప్రచారం చేయాలని కోరిక ఉండేది. కాని, అది కుదురక పోవడం వల్లనే, అది విజ్ఞానచంద్రికా మండలి రూపం పొందింది.

విజ్ఞాన చంద్రికామండలి తెలుగుదేశానికి అందించిన మొదటి గ్రంథం గాడిచర్ల హరిసర్వోత్తమరావు గారి 'అబ్రాహం లింకన్'. దీనికి ప్రూఫులు దిద్దడం మొదలుకొని తొలిపలుకులు వ్రాయడంవరకు కార్యభారం అంతా లక్ష్మణరావుగారే స్వయంగా వహించారు. రావిచెట్టు రంగారావుగారు గ్రంథాల నన్నింటిని హైదరాబాదుకు తీసుకవెళ్ళి అడ్రసులు వ్రాయడం, స్టాంపు లతికించి పోస్టులో వేయడం వరకూ స్వయంగా చేశారు. ఈ గ్రంథానికి పంతులుగారు రాసిన పీఠిక మాడపాటి హనుమంతరావుగారివంటి వారిని కదలించింది. విజ్ఞాన చంద్రికామండలి లక్ష్యం సాహిత్య గ్రంథాల ప్రచురణగాదు; శాస్త్ర విజ్ఞానానికి చరిత్రకు సంబంధించిన గ్రంథాలను ప్రచురించడమే. దేశచరిత్ర, జీవితచరిత్ర, పదార్థవిజ్ఞాన శాస్త్రం, రసాయన శాస్త్రం, అర్థశాస్త్రం, జంతు శాస్త్రం, భూగర్భశాస్త్రం-మొదలైన వాటికి సంబంధించిన గ్రంథాలను మండలి

ప్రకటించింది. పై విషయాలలో ప్రఖ్యాతి పొందిన తెలుగువారు మండలిద్వారా దేశానికి పరిచితులైనవారే.

మండలి ప్రకటించిన ముఖ్యగ్రంథాలలో లక్ష్మణరావుగారు స్వయంగా రాసిన 'హిందూమహాయుగం' 'మహమ్మదీయ మహాయుగం', డాక్టరు ఆచంట లక్ష్మీపతిగారి 'జీవశాస్త్రం', 'కలరా', 'మలేరియా', మంత్రిప్రగడ సాంబశివ రావుగారి 'పదార్థవిజ్ఞాన శాస్త్రం', వేమూరి విశ్వనాథశర్మగారి 'రసాయన శాస్త్రం', చిలుకూరి వీరభద్రరావుగారి 'ఆంధ్రుల చరిత్ర 1-2 భాగాలు', మైనంపాటి నరసింహంగారి 'భౌతిక శాస్త్రం', కట్టమంచి రామలింగారెడ్డిగారి 'అర్థశాస్త్రం', దుగ్గిరాల రామచంద్రయ చౌధరి 'విజయనగర సామ్రాజ్యం', వేలాల సుబ్బారావుగారి 'రాణీ సంయుక్త', భోగరాజు నారాయణమూర్తిగారి 'విమలాదేవి' మొదలైనవి చెప్పుకోదగ్గవి. 1906 మొదలు 1916 వరకు గల పదేళ్ళకాలంలో మండలి చురుకుగా పనిచేసి 30 పుస్తకాలను ప్రచురించింది. వీటిలో ఆచంట లక్ష్మీపతిగారి 'జీవశాస్త్రం' అనతి కాలంలో 3,000 ప్రతులు, 'కలరా' 'మలేరియా' అనే గ్రంథాలు 8,000 ప్రతులు అమ్ముడు పోయాయట. మండలి ప్రచురించిన గ్రంథాలన్నింటిలో సంపాదకులుగా లక్ష్మణరావుగారి హస్తం సోకని దేదీ లేదంటారు. కందుకూరి వీరేశలింగం స్వీయచరిత్రను ప్రచురించిన గౌరవం కూడ విజ్ఞాన చంద్రికా గ్రంథమండలికే దక్కింది.

1912లో విజ్ఞాన చంద్రికా గ్రంథమండలికి అనుబంధంగా గ్రంథ పఠనాభిరుచిని పెంపొందించటానికి 'విజ్ఞాన చంద్రికా పరిషత్తు' ను స్థాపించారు లక్ష్మణరావుగారు. ఈ పరిషత్తు ఆంధ్రదేశంలో అనేక కేంద్రాలలో ఏటేటా సాహిత్యం, చరిత్ర, ప్రకృతి శాస్త్ర రంగాలలో పోటీలు పెట్టి అందులో ప్రథములుగా ఉత్తీర్ణులైన వారికి పతకాలు, సర్టిఫికెట్లు ఇచ్చేవారు. శ్రీమతి కాంచనపల్లి కనకాంబ వంటివారు ఈపరీక్షలలో బహుమతు లందుకున్నారు. కందుకూరి వీరేశలింగం, కట్టమంచి రామలింగారెడ్డి లాంటి మహామహులు పరీక్షకులుగా ఉండేవారు.

లక్ష్మణరావుగారి జీవితంలో మూడవ ప్రధాన ఘట్టం సాహసోపేతమైన ఆంధ్రవిజ్ఞాన సర్వస్వ నిర్మాణం. ఇంగ్లీషులోని 'బ్రిటిష్ ఎన్‌సైక్లోపీడియా' పద్ధతిలో ఆంధ్ర విజ్ఞాన సర్వస్వాలను వెలువరించాలనే ఆశయం వారికి

విజ్ఞాన చంద్రికా మండలి స్థాపనకు ముందు నుంచీ ఉండేది. మొదట అకారాదిగా నెలకు నూరుపేజీల చొప్పున దీనిని వెలువరించారు. లక్ష్మణరావుగారి 'నూరుపేజీల మాసపత్రిక' కల ఈ విధంగా రూపం ధరించింది. నెలకు నూరు రూపాయల వంతున ఉపకార వేతన మిస్తూ 20 మందిని చేర్చుకొని విజ్ఞాన సర్వస్వాన్ని కొనసాగిద్దామని గాడిచర్ల హరి సర్వోత్తమరావుగారు అనుకున్నారట. ఆయనపై ద్రవ్య ప్రయాస పెట్టటం ఇష్టంలేక అచంట లక్ష్మీపతిగారు, హరి సర్వోత్తమరావుగారు తాము విజ్ఞాన సర్వస్వాన్ని స్వకార్యంగా ప్రయత్నించారు. విజ్ఞాన సర్వస్వం మొత్తం మూడు భాగాలుగా రెండువేల పేజీలలో వెలువడింది. 'అ'కు సంబంధించిన 100 వ్యాసాలు అందులో వచ్చాయి. వాటిలో లక్ష్మణరావుగారివే 35 వ్యాసాలున్నాయి.

లక్ష్మణరావుగారి జీవితంలో చాలాభాగం విజ్ఞాన సరస్వ నిర్మాణంలోనే గడిచింది. దానికోసం లక్ష్మణరావు గారు చేసిన పరిశ్రమ, ఓపిక మిత్రులను ఆశ్యర్యపరచేవి. ఆ రోజులో మద్రాసులో ఉన్న పెద్ద గ్రంథాలయం కన్నెమెరా గ్రంథాలయం. రోజు తప్పకుండా హరిసర్వోత్తమరావుగారు, లక్ష్మణరావుగారు అగ్రంథాలయంలో ప్రత్యక్ష్యమయ్యేవారట. టేబుల్ దగ్గర కూర్చొని గ్రంథాలు కుప్పలుగా పడవేసుకొని గ్రంథాలయం మూసివేసేవరకు కూర్చొనేవారట. లక్ష్మణరావుగారు కొత్తపుస్తకంగాని, బొమ్మగాని కనబడటమే ఆలస్యం గుర్తురాసుకొనేవారట. ఎప్పుడూ విజ్ఞాన సర్వస్వం గురించే ఆలోచించేవారట. ఉబ్బసం వ్యాధితో బాధపడుతూకూడ పిల్లలను సంసారాన్ని మరచి రాత్రిళ్ళు చాపమీద బోర్లగిలపడి చుట్టూ గ్రంథాలను పరచుకొని వ్రాస్తుండేవారట.

ఆరోజుల్లో విజ్ఞానసర్వస్వం అంత చక్కని ముద్రణ, అంత చక్కని కాగితం, అంతచక్కని చిత్రాలు, పటాలు ఏప్రచురిత గ్రంథంలోనూ కనిపించలేదట. చేసిన ప్రతి పనిని పరిపూర్ణంగా చేయడం కొమర్రాజుగారి అలవాటు. విజ్ఞాన సర్వస్వంలో ఆయన పరిశోధన చేయకుండా రాసిన ఒక్క వ్యాసమూ లేదు. ఇతర భాషా విజ్ఞాన కోశాలలో ఉండే విషయాలను కేవలం అనువదించి నకిలీ విజ్ఞాన సర్వస్వం ప్రకటించడం ఆయన ఉద్దేశంగాదు. విషయాన్ని ఆయన స్వయంగా మూలమట్టంగా పరిశోధించి స్వతంత్ర వ్యాసంగా రూపొందించే వరకు వారికి నిద్ర పట్టేది కాదట. పరిమితమైన ఆర్థిక వనరులతో, అంగ

బలంతో మహాసాహసోపేతమైన ఈ కార్యానికి పూనుకొని అకారంతో మూడు సంపుటాలను పూర్తి చేశారు పంతులుగారు.

1916లో కొవ్వూరులో ఆంధ్ర సారస్వత పరిషత్తును స్థాపించిన వారిలో కొమర్రాజుగారొకరు. 1919లో మద్రాసులో వారి అధ్యక్షతన జరిగిన పరిషత్తు నాల్గవ వార్షిక సభలో ఆంధ్రరత్న దుగ్గిరాల గోపాలకృష్ణయ్యవంటి వారు ప్రసంగించారు. ఆసభలో వారు చేసిన అధ్యక్షోపన్యాసం వారి మేధస్సంపత్తికి నిదర్శనం. అనంతపుర మండల రాజకీయ మహాసభలో, కృష్ణామండల సాంఘిక సభలో, పిఠాపురంలోని తాళీదళ సంపుట ప్రకర పరిశీలనా సంస్థ వార్షిక సభలో వారిచ్చిన ఉపన్యాసాలు వారి ఆలోచనలకు ప్రతిబింబాలు. ఆంధ్ర సారస్వత పరిషత్తు ప్రారంభం నుండి యావజ్జీవ సభ్యులుగా ఉండటమే కాకుండా కొంతకాలం దానికి కార్యదర్శిగా ఉన్నారు పంతులుగారు. మాసపత్రిక నడపాలని మొదట్నుంచీ అభిలాషపడిన లక్ష్మణరావుగారు 'జనరంజని' అనే పత్రికను కొంతకాలం నడిపారు.

లక్ష్మణరావు పంతులుగారికి అభిమానపాత్రమైన సంస్థలలో హైదరాబాదులోని ఆంధ్ర పరిశోధక మండలి ఒకటి. దీనిని 27-12-1922 నాడు ఆదిరాజు వీరభద్రరావు మొదలైన వారితో కలసి పంతులుగారు స్థాపించారు. చరిత్ర పరిశోధన, శాసన గ్రంథాలను ప్రకటించడం, అముద్రిత గ్రంథాలను ప్రచురించటం ఇవి ఈ సంస్థ ప్రధాన ధ్యేయాలు. లక్ష్మణరావుగారి మరణానంతరం ఇదే లక్ష్మణరాయ పరిశోధక మండలిగా మారింది. తెలంగాణా శాసనాలు, షితాబుఖాను చరిత్ర మొదలైన గ్రంథాలను ఈసంస్థ ప్రచురించింది. ఈసంస్థ ప్రస్తుతం నామమాత్రావశిష్టమై హైదరాబాదులోని ఆంధ్ర సారస్వత పరిషత్తు కార్యాలయంలో ఉంది.

లక్ష్మణరావుగారు స్వయంగా దేశస్వాతంత్రోద్యమంలో పాల్గొని జైలుకు పోలేదుగాని, స్వాతంత్ర్యోద్యమానికి అన్నివిధాలా సహాయ సహకారాలందజేశారు. ప్రాచీన భారతదేశ చరిత్ర గ్రంథాలను ప్రకటించడం ద్వారా ప్రజల్లో దేశాభిమానాన్ని కల్గించడమే కాకుండా ఆంధ్రదేశ చరిత్ర రచనకు ప్రోత్సహించి కూడ ఆంధ్రోద్యమానికి వారు దోహదం చేశారు. 1906లో కలకత్తాలో దాదాభాయి నౌరోజీ అధ్యక్షతన సంపూర్ణ స్వాతంత్ర్య నినాదంతో జరిగిన

కాంగ్రెస్ మహాసభయందు నాయని వేంకటరంగారావు, హరిసర్వోత్తమరావు గార్లతోపాటు తాను స్వయంగా పాల్గొన్నారు పంతులుగారు. 1907లో నంది గామలో జరిగిన కృష్ణాజిల్లా కాంగ్రెసు మహాసభలో సాంఘికసభ ఆహ్వాన కార్య దర్శిగా ప్రధాన పాత్ర వహించారు. ఈ సభలో లాలా లజపతిరాయ్ మొద లైన నాయకులను అరెస్టుచేసి ప్రవాసానికి పంపటాన్ని తీవ్రంగా ఖండిస్తూ ఉపన్యాసా లిచ్చారు. ఇదే సందర్భంలో దేశంలోని వివిధ ప్రాంతాలు సంచ రిస్తూ బెజవాడకు వచ్చిన బిపిన్ చంద్ర పాలుకు స్వాగత మిచ్చిన వారిలో లక్ష్మణరావుగారొకరు. 1908 మే, 3వతేదీన మద్రాసులో మహారాష్ట్ర సంఘం వారు ఏర్పరచిన 'శివాజీ వర్ధంతి' సభకు లక్ష్మణరావుగారు స్వయంగా అధ్య క్షత వహించి మరాఠీలో ప్రసంగించారు. 1908 జులైలో లక్ష్మణరావుగారి ముఖ్యసహచరులు గాడిచర్ల హరిసర్వోత్తమరావుగారు అరెస్టయ్యారు. వారికి మూడేళ్ళ శిక్ష పడింది. అప్పుడు వారి కుటుంబాన్ని లక్ష్మణరావుగారు స్వయంగా ఆదుకున్నారు.

లక్ష్మణరావు నిజమైన ప్రజాస్వామ్యవాది. ఒకరి తృప్తికోసం కార్య కర్తల స్వాతంత్ర్యంలోగాని, రచయితల స్వాతంత్ర్యంలోగాని జోక్యం కలుగ జేసుకోటం లక్ష్మణరావుగారికి ఇష్టం ఉండేదిగాదు. చిలుకూరి వీరభద్రరావుగారి ఆంధ్రుల చరిత్ర రెండోభాగం ప్రచురణమంతా గాడిచర్లవారు నిర్వహించారు. లక్ష్మణరావుగారు పూర్తిగా ఆ విషయాన్ని గాడిచర్లవారి మీదే వదిలిపెట్టారు. సహాయ సంపాదకుల పేరులో గాడిచర్లవారే ఆ గ్రంథానికి ఉపోద్ఘాతం వ్రాశారు. ఆ గ్రంథంలో వెలమదొరలు చాపకూడు తిన్నారన్న ప్రసక్తి ఉంది. అభిప్రాయ భేదమున్నా అసభ్యత ఏమీ లేక పోవడంవల్ల గాడిచర్లవారు దానిని దిద్దలేదు. మార్చలేదు. విజ్ఞాన చంద్రికా మండలికి పిఠాపురం, బొబ్బిలి, మునగాల జమీందారులు పోషకులు. వారిపేర్లు మండలి గ్రంథము లన్నిట్లో ప్రకటింపబడేవి. ఈ గ్రంథ ప్రచురణతో బొబ్బిలి, పిఠాపురం జమీందారు లకు ఆగ్రహం కలిగింది. తాము పోషకత్వం నుండి విరమిస్తున్నామని లక్ష్మణరావుగారికి తెలియజేశారు. ఆరోజునుంచి వారిద్దరుపేర్లు విజ్ఞాన చంద్రికా మండలి గ్రంథాలనుండి అదృశ్యమయ్యాయి. అంతేకాని గాడిచర్ల వారిని గాని, చిలుకూరి వారిని గాని వారేమి ఇబ్బంది పెట్టలేదు. ఆ తరు వాత అనేక కారణాలవల్ల చిలుకూరివారికి, లక్ష్మణరావుగారికి పొత్తు

కుదురక పోవడంవల్ల ఆంధ్రుల చరిత్ర 3 వ భాగాన్ని చిలుకూరి వారే స్వయంగా ప్రకటించుకున్నారు.

కందుకూరి వీరేశలింగం పంతులుగారికి లక్ష్మణరావుగారు నిజమైన వారసులు. కందుకూరివారి ఆదర్శాన్ని ఆలోచనలను దృష్టిలో పెట్టుకొని ఆంధ్రభాషాభివృద్ధికి త్రికరణ శుద్ధిగా పాటుపడ్డారు. మహారాష్ట్ర దేశంలో గొప్ప విద్వాంసుడై ప్రభుత్వోద్యోగాలకు ఆశించకుండా నెలకు ఇరవై రూపాయలు మాత్రమే ఆదాయం వచ్చే పూర్వార్జితంతో జీవనం గడుపుతూ వివాహం కూడా చేసుకోకుండా మహారాష్ట్ర దేశ పరిశోధనకు కృషి చేసిన విశ్వనాథ కాశీనాథ రాజవాడే చరిత్ర పరిశోధనా విషయంలో లక్ష్మణరావుగారికి ఆదర్శం. వీరేశలింగం గారు తెలుగులో నవల, ప్రహసనం, వ్యాసం, సాహిత్య చరిత్ర మొదలైన అనేక సాహితీ ప్రక్రియలను ప్రవర్తింపజేశారు. తక్కిన బాధ్యతలైన చరిత్ర పరిశోధనా కార్యక్రమాన్ని తెలుగు శాస్త్ర విజ్ఞాన గ్రంథాలను ప్రచురించడం ద్వారా కందుకూరివారు ప్రారంభించిన మహోద్యమాన్ని కొమర్రాజువారు పూరించారు. ఇద్దరిదీ ఒక్కటే ఆశయం. ఆంధ్రులలోని అజ్ఞానావరణాన్ని ఛేదించడం. 1919లో కందుకూరి వీరేశలింగంగారు ఆంధ్ర కవుల చరిత్ర 2వ భాగాన్ని సవరించి వ్రాసింది మద్రాసు ఎగ్మూరులో కొమర్రాజుగారి నివాస గృహమైన వేదవిలాసులో. వీరేశలింగంగారు ఇదే ఇంటిలో నిర్యాణం చెందారు.

లక్ష్మణరావుగారు సంఘ సంస్కరణాభిప్రాయాలు గలవారు. కందుకూరి వీరేశలింగంగారి లాగా ఆ ఉద్యమంలో ప్రధాన పాత్ర వహించక పోయినా ఆయన సంఘ సంస్కరణ కార్యకలాపాలకు దోహదం చేసేవారు. మెట్రిక్యులేషన్ చదువుతున్నప్పుడే, చిన్నపిల్లను పెళ్ళి చేసుకున్న ముసలి డాక్టరుకు సంబంధించి, మరాఠీలో వీరు వ్రాసిన ప్రహసనం వీరి సంఘ సంస్కరణాభిలాషకు నిదర్శనం. ఆ రోజుల్లో తమ కుమార్తెకు ఉన్నత విద్యను చెప్పించడమే కాకుండా ఆమెకు బాల్యవివాహం చేయటానికి కూడ వారు నిరాకరించారు. తమ సోదరి అచ్చమాంబను ప్రోత్సహించి రచనలు చేయడం ద్వారా స్త్రీవిద్యా వ్యాప్తికి దోహదం చేశారు. మద్రాసులో ఎస్. శ్రీనివాసయ్యంగారి అధ్యక్షతన నడుస్తుండిన దక్షిణ హిందూదేశ సంఘ సంస్కరణ సంఘంలో లక్ష్మణరావుగారు సభ్యులు. రాత్రిళ్ళు హరిజనులకు

చదువు చెప్పే కార్యక్రమాన్ని కాశేశ్వరరావుగారితో పాటు లక్ష్మణరావుగారు నిర్వహించారు. 1907లో నందిగామలో జరిగిన కృష్ణాజిల్లా సంఘసంస్కరణ సభలో వితంతు వివాహం, రజస్వరానంతరవివాహం, సముద్రయానం, భోగం మేళాల నిషేధం, అస్పృశ్యతానివారణం, అంతశ్శాఖా వివాహాలు మొదలైన విషయాలపై తీర్మానాలు ప్రవేశపెట్టడంలో లక్ష్మణరావుగారు ప్రధానపాత్ర వహించారు. అదే సభాసందర్భంలో వితంతు వివాహాలు చేసుకున్నవారితో కలసి సహపంక్తి భోజనాలను వారు నిర్వహించారు. తన రెండవ మేనమామ గారైన భండారు దండపాణిగారు వితంతు వివాహం చేసుకోడాన్ని స్వయంగా ప్రోత్సహించారు.

తెలుగు వాళ్ళలో విజ్ఞాన వ్యాప్తిని కలిగించడానికి, వైజ్ఞానిక దృక్పథాన్ని అందించడానికి జీవితాన్ని ధారపోసిన లక్ష్మణరావు పంతులుగారు భాషా విషయకంగా శాస్త్రీయ దృష్టిని ప్రదర్శింపలేక పోయారు. శాస్త్ర విజ్ఞానాన్ని ఎక్కువమందికి అందజేయటానికి వ్యావహారిక భాష ప్రధాన సాధనమని వారు గుర్తించలేదు. మద్రాసు విశ్వవిద్యాలయంవారు పరీక్షలలో అభ్యర్థులు తెలుగు వ్యాసాలను వ్యావహారిక భాషలో వ్రాయ వచ్చునని ప్రకటించిన సమయంలో దానిని ప్రతిఘటిస్తూ మద్రాసు గవర్నరు దగ్గరికి రాయబారం వెళ్ళిన వారిలో కొమర్రాజువారు ముఖ్యులు. 'A memorandum on Telugu Prose' అనే వ్యాసంలో వారు గ్రాంథికవాదం చేశారు. గురజాడ అప్పారావుగారు విజ్ఞాన చంద్రికకు కళింగదేశ చరిత్రను వ్రాసి ఇస్తానని వాగ్దానం చేశారు. రాబోవు గ్రంథాల జాబితాలో ఆ పుస్తకం పేరునుకూడ ప్రకటించారు. అప్పారావుగారు ఆగ్రంథాన్ని వ్యావహారిక భాషలో వ్రాసి ఇస్తానంటె లక్ష్మణరావుగారు అందుకు నిరాకరించారు. ఆకారణంగా ఆగ్రంథం వెలుగు చూడలేదు. ఎంతటి శాస్త్రీయ దృక్పథం కలవారికైనా కొన్ని విషయాలలో వ్యక్తిగతదృష్టి dominate చేస్తుందనటానికి ఇదొక ప్రధాన నిదర్శనం. భాషా విషయంలో కొమర్రాజువారి అభిప్రాయాలు ఇట్లా ఉండేవి. "మనము చేయవలసిన కార్యము లింకను పెక్కు గలవు. అందు ఆంధ్ర భాషకు సమగ్రమైన వ్యాకరణము సిద్ధము చేయుట ఒక పని. ఈ వ్యాకరణము గ్రాంథిక భాష కొకటియు, వ్యావహారిక భాషకొకటియు పుట్టవలెను.

గ్రాంథిక భాషకుఁ జిన్నయసూరిచే రచింపబడిన లక్షణ గ్రంథమునకై మనమెప్పుడు వారికిఁ గృతజ్ఞులమై యుండవలె ననుటకు సందేహము లేదు. కాని, అందలి లక్షణములకు లోబడని లక్ష్యములుఁ బెక్కులు గలవు. అట్లే అందు గణముల పట్టికలు పూర్తిగాలేవు. తెనుగు భాషయందలి ముప్ఫయైదు వేల శబ్దములును వ్యాకరణ రూపములనుబట్టి గణములుగ విభజింపబడవలెను. అట్లయినగాని భాషకు నియమ మేర్పడిన దనుటకు వీలులేదు. సంస్కృత వ్యాకరణము నందలి గణపాఠమును ఎత్తివేసిన వ్యాకరణ మేముండును ?—"
హేతువాదానికి కట్టుబడే లక్ష్మణరావు పంతులుగారు, ఇంకా కొంతకాలం బ్రతికి ఉండిఉంటే, వ్యావహారిక భాషావశ్యకతను గుర్తించి ఉండేవారేమో!

మహారాష్ట్ర దేశంలో బాల్యం, విద్యాభ్యాసం గడిపిన లక్ష్మణరావు పంతులుగారికి పూర్తిగా మహారాష్ట్ర స్వభావాలు అలవడ్డాయి. మహారాష్ట్రుల పట్టుదల, వీరావేశం, కఠోర దేశాభిమానం వారి జీవితంలోనూ, రచనల్లోనూ, ప్రతిబింబిస్తాయి. ఇదే విషయాన్ని మాడపాటి హనుమంతరావుగారు ఒక వ్యాసంలో ఈ విధంగా వివరించారు: "లక్ష్మణరావుగారికి మహారాష్ట్రులపైనా, వారి సాహిత్యంపైనా అభిమానం ఎక్కువగా ఉండేదేమో అని నాకు తోస్తుంది. వారి వేషం నేను చూచిన దాన్ని పట్టిన్ని మహారాష్ట్రి పద్ధతిగానే ఉండెనని నా అభిప్రాయం. ఆ తలగుడ్డ, ఆ పొడుగు కోటు, ఆ ఉత్తరీయం వేసుకొనే విధానం అట్లాగే ఉండేవి. వీరు కుమారుని పేరు వినాయకరావు అని పెట్టారు. ఈ పేరు మహారాష్ట్రి దేశంలో ఎక్కువగా వాడుకలో ఉండేది. ఇటు వంటిది తెలుగుదేశంలో, అందున్ను వీరి స్వస్థానమైన కృష్ణాజిల్లాలో, గణపతిరావు అని, గణేశరావు అని, వినాయకరావు అని పేర్లుఉన్నట్లు నాకు కాన్పించలేదు... ...... లక్ష్మణరావు గారు వ్రాసిన మొట్టమొదటి తెలుగుగ్రంథం శివాజీ మహారాజు చరిత్ర అని తెలిసింది. 17వ శతాబ్దంలో జన్మించి యవక్ర పరాక్రమమును ప్రదర్శించి ఛత్రపతి బిరుధాంకితుడైన శ్రీ శివాజీమహారాజును ఇతర ప్రాంతాల హిందువులకంటె మహారాష్ట్రులు ఎక్కువ భక్తితో దైవావతారమని భావించి పూజ్యభావమును ప్రదర్శిస్తారన్న సంగతి అందరికి తెలిసినదే

కదా!–". లక్ష్మణరావుగారు "ఈ మరాఠి వారెప్పుడును ఇట్టి పట్టుదలయు స్వదేశాభిమానము గలవారు. హిందూదేశ మంతయు గెలచిన ఔరంగజేబు చక్రవర్తి మరాఠారాజగు శివాజీని గెలువలేక పోయెనని చదువరులు ముందు చూడగలరు" అని హిందూ మహాయుగంలో ప్రకటించడమే కాకుండా విజయనగర సామ్రాజ్యాన్ని గురించో, ఆంధ్రదేశ చరిత్రకు సంబంధించిన మరొక ఘట్టాన్నో కాకుండా మహారాష్ట్ర చరిత్రను ప్రత్యేకంగా మహమ్మదీయ యుగం తరువాత మూడవ భాగంగా ప్రకటించడానికి నిశ్చయించుకోవడం వారికి మహారాష్ట్రదేశంపైనా, చరిత్రపైనా ఉండే అభిమానాన్ని చాటుతుంది.

లక్ష్మణరావుగారు ఎన్నో కొత్త పరిభాషాపదాలను తెలుగులో వాడారు. వాటిలో చాలవరకు ఆకాలంలో మరాఠీలో వాడుకలో ఉన్నాయి. యూనివర్శిటీ అనే అర్థంలో అంతకు ముందు తెలుగులో వ్యాప్తిలో ఉన్న 'సర్వకళాశాల' అనే పదం స్థానంలో 'విశ్వవిద్యాలయం' అనే పదాన్ని, ఎడిటర్ అనే పదానికి సమానార్థకంగా ఉన్న 'పత్రికాధిపతి'కి బదులుగా 'సంపాదకుడు' అనే పదాన్ని పంతులుగారు వాడుకలోనికి తెచ్చారు. అవే తరువాత తెలుగులో స్థిరపడ్డాయి. అట్లాగే ఎడ్యుకేషన్ అనడానికి విద్యకు బదులుగా 'శిక్షణ' అని, నేషనల్ అనే పదానికి సమానార్థకంగా జాతీయకు బదులుగా 'రాష్ట్రీయ' అని, ఫలానీ అనటానికి 'అముక్' అని, ప్రసంగం అనే శబ్దాన్ని 'సందర్భం' అనే అర్థంలోనూ లక్ష్మణరావుగారు వాడుతుండేవారు. అయితే ఈ పదాలేవీ తెలుగులో స్థిరపడినట్టు కనిపించవు.

లక్ష్మణరావు పంతులుగారికి తెలంగాణా ప్రాంతం అంటే మొదటినుంచి ప్రత్యేకమైన అభిమానం ఉండేది. ఆయన తెలుగుదేశంలో ప్రారంభించిన మొదటి మహాకార్యం శ్రీకృష్ణదేవరాయాంధ్ర భాషానిలయ స్థాపన. విజ్ఞానచంద్రికా గ్రంథమండలి ప్రారంభం, ఆంధ్రపరిశోధక మండలి స్థాపన హైదరాబాదులోనే జరిగాయి. "దాని వలనను (శ్రీకృష్ణదేవరాయాంధ్ర భాషానిలయ స్థాపన) విజ్ఞాన చంద్రికామండలి యొక్క కార్యస్థానము హైదరాబాదులో స్థాపింప

బడుట వలనను వైజ్ఞానికముగా విశాలాంధ్ర స్థాపన జరిగినదని చెప్పనొప్పును.” అని అయ్యదేవర కాళేశ్వరరావుగారు తన జీవిత కథలో వ్రాశారు. ఆరోజుల్లో తెలంగాణా వారంటే సోదరాంధ్రులలో కొన్ని అపోహలుండెడివి. విద్యా వైజ్ఞానిక రంగాల్లో వీరు వెనుకబడిన వారనే భావం వారి కుండేది. ఈ అభిప్రాయాలను లక్ష్మణరావుగారు తొలగించే ప్రయత్నం చేశారు. పోతన పేర్కొన్న ఏకశిలానగరం కడప జిల్లాలోని ఒంటిమిట్ట అని కొంతమంది వాదం ప్రారంభించగా దాన్ని సయుక్తికంగా ఖండించి పోతన ఆంధ్ర భాగవతాన్ని వ్రాసిన ఏకాశిలానగరం వరంగల్లే అని సప్రమాణంగా నిరూపించారు. తెలుగు దేశపు త్రిలింగాలలో ద్రాక్షారామ శ్రీశైలాలతోపాటు మూడోలింగం శ్రీకాళహస్తి కాదని మంతెన దగ్గర కాళేశ్వరమని మొదటిసారి చెప్పినవారు కొమర్రాజువారే. “ఆంధ్రదేశమును గురించియు, ఆంధ్రరాజులను గురించియు, ఆంధ్రవాఙ్మయమును గురించియు నెక్కుడు పరిశోధనలు చేసి క్రొత్త వింతలను కనుగొనదలచిన వారికి హైదరాబాదు రాజ్యమందలి తెలుగు భాగ మొక బంగారపు గనివంటిది.” అని ఒకానొక సందర్భంలో లక్ష్మణరావుగారు పేర్కొన్నారు.

లక్ష్మణరావుగారు సాధారణంగా పత్రికలో వచ్చే వాదోపవాదాలకు దిగేవారు కారు. ఆ వాదాలలో జిజ్ఞాన కంటె పరస్పర దూషణే ఎక్కువగా ఉంటుందని వారి అభిప్రాయం. అయితే ఒకసారిమాత్రం వారు నిగ్రహాన్ని కోల్పోయారు. టేకుమళ్ళ రాజగోపాలరావుగారి సంపాదకత్వంతో వెలువడే శశిరేఖ అనే పత్రికలో నన్నయభట్టు ప్రథమాంధ్రకవి అవునా, కాదా? అనే వాదం ప్రారంభమైంది. రాజగోపాలరావుగారే ఆదికవి విషయాన్ని తేల్చుదామని నన్నయభట్టు విషయాన్ని చర్చలోనికి దింపారు. మారుపేరుతో నన్నయ ప్రథమ మహాకవి అని సమర్థిస్తూ వారే వ్యాసం రాశారు. మరుసటి సంచికలో తమ పేరుతో నన్నయ ఆదికవికాదని వారు వాదించారు. ఇట్లా నాలుగైదు సంచికల వరకు తామే ఉభయపక్షాన్ని వహించి వాదాన్ని పెంచారు. దానితో పండితులకు చిచ్చు అంటుకుంది. హేమాహేమీ లందరు రంగంలోకి దూకారు. జయంతి రామయ్య పంతులు, కాశీభట్ల బ్రహ్మయ్యశాస్త్రి మొదలగువారు ప్రథమకవి వాదులైతే చిలుకూరి వీరభద్రరావుగారు, లక్ష్మణరావుగారు ప్రథమకవి కాదనే వర్గానికి చెందినవారు. అయితే ఈవ్యాసాలు లక్ష్మణరావుగారి పేరుతో కాకుండా మరొక పేరుతో వచ్చాయి. ఇదే కాకుండా మారు

పేరుతో వీరు కొన్ని రచనలు చేశారు. ఆంధ్రపత్రిక మొదటి ఉగాది సంచికలో 'ఏబదివేల బేరము' అనే ఒక కథను రామానుజరావు అనే పేరుతో వ్రాశారు.

లక్ష్మణరావుగారికి అనేక శాస్త్ర విషయాలతో పరిచయం ఉండేది. స్వయంగా ప్రకృతిశాస్త్రం, రాజకీయశాస్త్రం, తర్కశాస్త్రం, గణితం, ధర్మ శాస్త్రం, జ్యోతిష్యం మొదలైన విషయాలలో వ్యాసాలు వ్రాయడమే కాకుండా విజ్ఞాన చంద్రిక ప్రచురించిన అనేక శాస్త్ర గ్రంథ రచనల్లో సంపాదకుడుగా వీరి ప్రచ్ఛన్న హస్తం ఉండేది. ఆయుర్వేదం మీద వీరికి ప్రత్యేకమైన ఆసక్తి. గణనాథసేన్ వ్రాసిన 'ప్రత్యక్ష శారీరం' అనే పుస్తకంలోని కొంత భాగాన్ని 'అస్థిపంజరం' అనే పేరిట వీరు తెలిగించారు. వీరివల్లనే డాక్టరు ఆచంట లక్ష్మీపతిగారు అలోపతిక్ వైద్యం నుంచి ఆయుర్వేద వైద్యంపైకి తమదృష్టిని మళ్ళించారు. భిషగ్రత్న శ్రీపండిత దీవి గోపాలచార్యులుగారు వీరికి ఆప్తులు. అన్నిటికంటే ముఖ్యంగా భాషాశాస్త్రంలో ద్రావిడ భాషా తుల నాత్మక పరిశోధనా రంగంలో సమకాలంలో వస్తున్న సాహిత్యంతో వారికి పరిచయముండటం గమనార్హం. 'ద్రావిడ భాషలలోని ఉత్తమ పురుష సర్వ నామములు' అనే వ్యాసం కె. వి. సుబ్బయ్యగారి Dravidic Studies వ్యాసాలను పంతులుగారు సమగ్రంగా పరిశీలించారనే విషయాన్ని చెపుతుంది. 'దేశభాషలలో శాస్త్ర పఠనం' అన్న వ్యాసం ఆనాటి పరిస్థితులకెంత సరి పోతుందో ఈనాటి పరిస్థితులకూ అంతే. మాతృభాషలో శాస్త్రాలు బోధించ వలసిన అవసరాన్ని వివరిస్తూ వారిట్లా అంటారు. "అన్యభాష మొదట నేర్చు కొని పిదప నాభాషయందు శాస్త్రములఁ గళలఁ జదువుకొనుట ద్రావిడ ప్రాణా యామము వంటిది. కాని యట్టి ప్రాణాయామమే మనదేశమునందు ప్రస్తుతము జరుగుచున్నది...తర్క వేదాంతాది పూర్వశాస్త్రముల నేర్చుకొనవలెనన్న సంస్కృతము నేర్చుకొనవలెను. రసాయన పదార్థవిజ్ఞానాది శాస్త్రముల నభ్య సింపవలెనన్న నింగ్లీషు నేర్చుకొనవలెను. ఈ భాషల నభ్యసించుటకుఁ గొంత కాలము వ్యయపరుపవలెను." శాస్త్ర పఠనానికి కొన్ని భాషలు మాత్రమే అర్హ మైనవన్న వాదాన్ని తీవ్రంగా ఖండిస్తూ "జ్ఞాన మొక భాషయొక్క యబ్బసొమ్ము కాదు" అని అంటారు. సంస్కృతాన్ని రాష్ట్రభాష చెయ్యాలని ఈరోజులో కూడ భావిస్తున్న కొంతమందికి సంస్కృతాన్ని గురించి లక్ష్మణరావుగారి అభిప్రాయాలు గమనార్హాలు. "ఇది దేవభాష యని మనకు భక్తియున్నను

దేశము నందెందరు సంస్కృత పండితులుకలరు? సంస్కృతము దేశభాషాభి వృద్ధికి సాయముగా నుండవలసినదేగాని మరల నది దేశభాషయగు నన్నమాట కలలోని వార్త. సంస్కృతముగాని, ఇంగ్లీషుగాని దేశభాషాస్థానము నాక్ర మించుకొన నేరవు".

లక్ష్మణరావు పంతులుగారు Herbert Spencer తత్త్వం అజ్ఞేయ వాదా (Agnosticism)న్ని నమ్మినవారు. Spencer 1820 నుంచి 1903 వరకు జీవించిన బ్రిటిష్ తత్త్వవేత్త. ఆయన సిద్ధాంతం పరిణామవాదంపై ఆధారపడింది. "దేవుడున్నాడో లేదో తెలుసుకోవడం సాధ్యంకాదని, కాబట్టి దాన్ని గురించి ఆలోచించి నందువల్లగాని ఆధ్యాత్మిక విశ్వాసం కలిగినందు వల్లగాని ప్రయోజనంలే"దని అజ్ఞేయవాద సారాంశం. అయినా లక్ష్మణరావు పంతులుగారు ఇతరుల మతవిశ్వాసాలను ద్వేషించేవారు కాదు. "ఒకరి మతము లొకరికి అసమ్మతములగుట స్వాభావికము. ఇంత మాత్రముచే నొకరినొకరు నిందింపకూడదు. మైసమ్మను బూజసేయు వారిలో సజ్జనులు లేరా? అందర కును మతద్వేషాభావంబు ఉండవలయును." అని ఒకచోట వారు అభిప్రాయం వెలిబుచ్చారు.

"గతాన్ని త్రవ్వి చరిత్ర బయటికి తీయటం గతంలోకి వెళ్ళటానికి కాదు." అన్న సత్యాన్ని గుర్తించినవారు పంతులుగారు. హైందవవీరుల వీరగాథలను వర్ణించి మహమ్మదీయుల నెదుర్కొన్న శివాజీని ప్రత్యేకంగా అభిమానించిన లక్ష్మణరావు పంతులుగారు హిందూ మహమ్మదీయుల సమైక్యతనే కోరేవారు. "పూర్వమొకప్పుడు హిందూ ముసల్మానులు పోరాడుచుండిరి గనుక వారెప్పు డును స్నేహితులు గానేరరనుట లోకానుభవము లేనివారు చెప్పవలసిన మాట...ముసల్మాను లీ దేశవాసులైనందున ప్రస్తుతమున్న హిందూ ముస ల్మాను లన్నదమ్ములు. పూర్వమందు మరాఠావారు బంగాళమును దోచుకొని రని ప్రస్తుత కాలమందలి బంగాళీవారు మరాఠీవారిని ద్వేషించుట ఎంత హాస్యా స్పదమో, పూర్వ మౌరంగజేబు హిందువులను బాధపెట్టె ననియు, అళియ రామరాజు తురుష్కులను బాధపెట్టెననియు నిప్పటి హిందూ ముసల్మానులు పోరాడుట ఎంతేని హాస్యాస్పదము" అని ఒకచోట లక్ష్మణరావుగా రంటారు.

'అ' కారంతో విజ్ఞాన సర్వస్వం పూర్తి చేసినపంతులుగారు తరువాత 'ఆంధ్ర' సంపుట ప్రకటన కోసం పూనుకొన్నారు. తెలుగువారిని గురించి

అంతకు ముందు చాలా తక్కువగా పరిశోధన జరిగింది. తెలుగువాళ్ళను గురించి వ్రాయాలంటే కొత్తగా పరిశోధన చేయవలసిందే. ఆంధ్ర సంపుటం కోసం పంతులుగారు రాత్రింబవళ్ళు పరిశోధన చేస్తూ శిలా తామ్ర శాసనాలు పరిశీలిస్తూ విశ్రాంతి లేకుండా పనిచేయడం వల్ల వారి ఆరోగ్యం పూర్తిగా చెడి పోయింది. వారనుకున్న మహారాష్ట్ర మహాయుగాన్ని పూర్తి చేయలేక పోయారు. అంతకు ముందు 'అ' కార సంపుటాన్ని ప్రకటించడానికే వారనేక విధమైన ఇబ్బందులు ఎదుర్కొన్నారు. అలంకార శాస్త్రాన్ని గురించి వ్యాసం వ్రాస్తానని వాగ్దానం చేసిన ఓ పండితుడు నాలుగైదు సంవత్సరాలు ఎన్ని విజ్ఞప్తులు పంపినా ఆవ్యాసాన్ని వ్రాసి ఇవ్వలేదు. చివరికి విజ్ఞాన సర్వస్వ ముద్రణ దానికోసము ఆపటం ఇష్టంలేక పంతులుగారే సంస్కృతం, హిందీ, మరాఠీ, ఇంగ్లీషు మొదలైన భాషలలో అలంకార శాస్త్రానికి సంబంధించిన గ్రంథాలు పరిశీలించి ఆ వ్యాసాన్ని వ్రాయవలసి వచ్చింది. అట్లాగే విజ్ఞాన చంద్రికా గ్రంథమండలికి ఓ పుస్తకం వ్రాస్తానని ఓ పండితుడు 300 రూపాయలు అడ్వాన్సుగా తీసుకున్నాడట. కాని ఆయన పుస్తకం వ్రాసి ఇవ్వలేదు. చివరికి "మహానుభావుడు ఆ భాషాసేవకుని హృదయంలో ఒక తృణం మన ద్రవ్యంపడి ధన్యమైంది. కాని ఆమహనీయుని గ్రంథరాజం చదువుకొని ఆనందం పొందే అదృష్టం మన తెలుగువారికి లేకపోయింది కదా! అని విచారం" అని నిట్టూర్చారట. ఈ సంఘటనలు, విజ్ఞాన సర్వస్వ, విజ్ఞాన చంద్రికా గ్రంథ మండలుల నిర్వహణలలో పంతులుగారెదుర్కొన్న ఇబ్బందులకు నిదర్శనాలు.

ఆంధ్రసంపుటం ప్రచురణ కార్యక్రమంలో మునిగి ఉండగానే లక్ష్మణ రావుగారి ఉబ్బసం వ్యాధి ప్రకోపించింది. డాక్టరు ఆచంట లక్ష్మీపతి మొదలైన వైద్యులు వారిని పరీక్షించి విశ్రాంతి తీసుకోమన్నారు. 1923 మే లో మదనపల్లి హార్స్లీ కొండలలో పంతులుగారు కొన్నిరోజు లున్నారు, అయినా విశ్రాంతి దొరకక మద్రాసు తిరిగి వచ్చారు. ఆంధ్ర సంపుటం వ్రాయటానికి శాసనాలు పరిశీలిస్తూనే 1923 జులై 12, రాత్రి 12-00 గంటలకు 46 ఏండ్ల వయసులో, కందుకూరివారు మరణించిన ఇంటిలో, అదే గదిలో, లక్ష్మణరావు గారు కీర్తి శేషులైనారు.

స్వర్గీయ కురుగంటి సీతారామయ్యగారన్నట్లు లక్ష్మణరావు పంతులు గారు ఒక వ్యక్తికాదు ఒక సంస్థ. ఆంధ్రదేశంలో ప్రసిద్ధులైన చారిత్రకులు,

వివిధ శాస్త్రవేత్తలు ఆయన ద్వారా ఆకర్షితులై విజ్ఞాన చంద్రికా గ్రంథమండలి ద్వారా దేశానికి పరిచితమైనవారే. ప్రథమాంధ్రచరిత్ర నిర్మాత చిలుకూరి వీరభద్రరావు, రసాయన శాస్త్రవేత్త మంత్రిప్రగడ నరసింహారావు, జీవజంతు వైద్య శాస్త్రాల్లో నిష్ణాతులై ఆయుర్వేదానికి అఖిల భారత ప్రచారం కలుగ జేసిన వారిలో ఒకరైన ఆచంట లక్ష్మీపతి, లక్ష్మణరావుచేత ప్రోత్సాహితులైన వారే. మొదట రాజకీయోద్యమాలలోను, తరువాత గ్రంథాలయోద్యమంలోనూ జీవితాన్నర్పించిన గాడిచర్ల హరిసర్వోత్తమరావు, ప్రముఖ ఆంధ్ర రాజకీయ నాయకుడు, సంఘ సంస్కర్త, బహుగ్రంథ రచయిత అయ్యదేవర కాళేశ్వరరావు; తెలంగాణా ఏకైక నాయకుడు, ఆంధ్రపితామహ మాడపాటి హనుమంతరావు; అనేక సాహితీ సాంస్కృతిక సంస్థలకు సేవచేసిన రావిచెట్టు రంగారావు మొదలైన వాళ్ళు లక్ష్మణరావుగారి సహచరులు. లక్ష్మణరాయ పరిశోధక మండలి కార్యదర్శిగా తెలంగాణంలో చరిత్ర పరిశోధన కొనసాగించిన ఆదిరాజు వీరభద్రరావుగారు లక్ష్మణరావుగారి దగ్గర శిక్షణపొందిన వారే. ఆర్థికశాస్త్రవేత్తగా కట్టమంచి రామలింగారెడ్డిగారు విజ్ఞాన చంద్రికా గ్రంథమండలి ద్వారా తెలుగుదేశానికి పరిచయ మయ్యారు. అందరికంటే ముఖ్యంగా తెలుగు దేశంలోని సుప్రసిద్ధ చారిత్రకులు మల్లంపల్లి సోమశేఖర శర్మగారు విజ్ఞాన సర్వస్వం ద్వారా వెలుగులోనికి వచ్చారు. విజ్ఞాన సర్వస్వ నిర్మాణంలో లక్ష్మణరావుగారికి సహాయకుడుగా ఉండిన రాయప్రోలు సుబ్బారావుగారు ఉస్మానియా విశ్వవిద్యాలయం తెలుగుశాఖకు ప్రప్రథమాచార్యులుగా పనిచేశారు.

అర్ధశతాబ్దిక్రితం నిద్రాణమైవున్న ఆంధ్రజాతిని మేల్కొల్పిన మహాపురులలో లక్ష్మణరావుగారొకరు...తెలుగువారికి, తమ చరిత్రను తాము తెలుసుకొనే, దారిని చూపారు లక్ష్మణరావు గారు. కాని ఇంతవరకు మనం తెలుసుకున్నది రాజులచరిత్ర మాత్రమే. ఇతిహాసపు చీకటికోణం అట్టడుగున పడి కాన్పించని సామాన్యుల జీవన విధానపు చరిత్రను పరిశోధించాల్సి ఉంది. అప్పుడే లక్ష్మణరావుగారివంటి వారు ప్రారంభించిన ఉద్యమాలు సఫలం అయినట్టు.

---

# కొమర్రాజు లక్ష్మణరావు భాషాసేవ

- విద్వాన్ విశ్వం

ఏడు నిలువులెత్తు ఎదిగి ఏ మూలనుంచి చూచినా కానవచ్చే మహా మూర్తులు కొందరే జన్మిస్తారు. వారు ఏ కాలంలో ఉన్నా, ఏ దేశంలో ఉన్నా ఎల్లకాలం అలా మనస్సులో మెదలుతూనే ఉండే పనులేవో చేస్తారు. ఎల్లరి అభిమానాన్నీ చూఱగొంటారు.

అలాంటి మహాపురుషులలో తెనుగువాడి ఎదలో అనుదినం మెదలవల సినవాడు కొమర్రాజు లక్ష్మణరావు. మహామేధావి అన్నా, మహా పరిశోధకు డన్నా, గొప్ప చరిత్రకారుడన్నా, గొప్ప సాహిత్య ప్రచారకుడన్నా, ఏమన్నా ఏ విశేషణంకూడా ఎంత గొప్పదైనా ఆయన చేసిన భాషాసేవను పూర్తిగా వివరింపలేదు. అందువల్లనే ఏ బిరుదమూ, ఏ వివరమూ లేకుండా కొమర్రాజు వెంకట లక్ష్మణరావుగారు అంటేనే చాలు మనముందుకు ఆ మహామూర్తి సాక్షాత్కరిస్తుంది. ఆ పేరుకు ముందో వెనకో ఒకమాట చేర్చడం దాని విశ్వ రూపతను సంకుచిత పరచడమే అవుతుంది.

ఆయన పట్టుమని పదికాలాల పాటు మనుగడ సాగించలేదు-ఆయన 1877లో పుట్టి 1923లో తనువు చాలించాడు. ఆ నలభై ఆరేళ్ళలోనే ఆయన చేసిన పరిశోధనాదులను పరిశీలిస్తే, ఇహమఱి కొన్నేళ్ళు జీవించే ఉంటే, ఆయన ఆరంభించిన పనులను పూర్తి చేసే ఉంటే తెనుగునేటికంటే ఎంత పరి పుష్టమై, పటిష్ఠమై, సంతః ప్రదీప్తమై ఉండేదో అనిపించక మానదు. కానీ అంతటి అదృష్టం ఆంధ్రులకు పట్టలేదు. అయినా జరుగని దానితో వగవడంకన్నా, జరిగినదానికి సంతోషింతాం, సంతృప్తి చెందుదాం—అదే మంచిదేమో!

ఆయన పుట్టిన రోజులు దేశభవితవ్యం దిద్ది తీర్చబడుతున్న రోజులు; మన చరిత్ర ఒక మలుపు తిరుగుతున్న నాళ్ళవి.

ఏ జాతి చరిత్రలోనైనా ఏటా బంగారు పూలు పూయవు. ఏటా జన జీవనరంగాలలో వసంతం వెల్లి విరియదు. ఏదో ఒక కాలం ఆ జాతి చరిత్రను ప్రపుల్లం చేస్తుంది.

మనదేశంలో ఆంగ్ల సాంస్కృతీ ప్రభావం మూడు పూవులు ఆరు కాయలుగా వికసించిన కాలమది. పరప్రభుత్వ పాదుకొని దేశీయమైన పరిపాలన పునాదులు క్రక్కదలి పోతున్నా, వారి సంస్కృతిలోని బలం, వారి సాహిత్యంలోని బలం, వారి సుశిక్షిత ఆలోచనా క్రమంలోని నైశిత్యం ఇవన్నీ మన నిలిచిన నీళ్ళలో తొలుకేసి కదిపి వేసినవి.

తమ పీటను పదిలపఱచుకొనడం కోసమే అయినా అటునుంచి వచ్చిన దొరలలో కొందఱు మన భాషను నేర్చుకోవడం, మన సాహిత్యంలోని విశిష్టతలను గమనించడం, మనవారిలో వారికి చెందిన చదువు సాముల నియమ నిబంధనలు అమలుపరచడం-అలా కొంత మన ఆలోచనా సరళిని వారు ప్రభావితం చేయసాగినారు.

సర్ సి. పి. బ్రౌన్‌దొర (1798-1884) ఆనాళ్ళలోనే ఆంధ్ర భాషాభివృద్ధికై చేసిన అపార కృపిని పర్యాలోచిస్తే ఆశ్చర్యం కలుగుతుంది.

అటుకమీద నిద్రపోతున్న తాటాకు ప్రతులను బూజు దులిపి నిద్రలేపిన మహానుభావు డాయన. ఒకే కావ్యానికో ప్రబంధానికో పలుప్రతులను సంపాదించి శుద్ధమైన ప్రామాణిక ప్రతులను తయారు చేయించడం, కొన్నిటికి పీఠికలు వ్రాయడం, కొన్నిటిని అనువదించడం, ఒక గొప్ప నిఘంటువును తయారు చేయడం ఇలాంటి పనుల నెన్నింటినో చేశాడు బ్రౌన్.

కాంబెల్‌లాంటి వారు ఆరంభించిన వ్యాకరణాదుల ఆంగ్ల రచనలు, తులనాత్మక పరిశీలనలు ఒక కొత్త చూపును ప్రసాదించినవి.

బ్రౌన్ ఉద్యోగజీవితం సాహిత్య సేవనంగా నూటికి నూరుపాళ్లు గడచినదేమో అనిపిస్తుంది.

మరి ఆకోవలోనే, ఆయనచే ప్రభావితులై అనేకులు మన పండితులు తమ బాసను తాము పెంపొందించుకొనే ప్రయత్నం చేశారు.

అప్పుడే మన తెనుగు పునర్వికసన మహాయుగం ఆరంభమైనది.

చిన్నయసూరివంటివారు వ్యవహారభాషా రచనలను అడుగున పడవేసి గ్రాంథికానికి పట్టం కట్టడంలో ఎంత పొరపడినా నిఘంటు నిర్మాణంలోగాని, వ్యాకరణ నిర్మితిలోగాని, విద్యాబోధనారీతులను కట్టుదిట్టం చేయడంలోగాని చూపిన అనన్యప్రతిభా సంపత్తిని మనం కాదనలేము.

ఏమైనా అన్నిరంగాలలో ఒక్క ఊపుఊపి సాంస్కృతిక పునరుజ్జీవనం రెండుచేతులా పెంపొందించిన మహానుభావులు ముగ్గురు వెనువెంటనే రావడం మన మహాభాగ్యం

వారు పదితరాలలో, పదివందల మందితో జరిగేపనిని ఒక్క తరంలో ఒక్క చేతిమీదుగా నడుపగలిగినారు.

ఒకరు కందుకూరి వీరేశలింగంపంతులుగారు (1848-1919). ఆయన తెనుగు దృక్పథంలోనే ఓ వినూత్నమైన మార్పు తేగలిగారు. బ్రహ్మసమాజ స్థాపనద్వారా సాంఘిక సంస్కరణలకు బీజావాపనం చేశారు. అనేక మూఢాచారాలను వెక్కిరించి వేళాకోళంచేసి తప్పుకొనకుండా వాటి సమూల నిర్మూలనంకోసం ఎంతకైనా తెగించి పోరాడినాడు. తొలి నవల వ్రాశాడు. తొలి కవులచరిత్ర, తొలినాటకం, తొలి ఆత్మకథ ఒకటేమిటి చాల ప్రక్రియలలో తొలిసారి కలంపట్టిన అదృష్టం ఆయనకే దక్కినది. అయన సహస్రశీర్షుడూ సహస్ర బాహూరు పాదుడుగా మనకు కానవస్తాడు.

అలాగే సృజనాత్మక సాహిత్యంలో ఒక వినూత్నప్రయోగంచేసి చిన్న కథకు ప్రాణంపోసి, వచన వ్యావహారిక నాటకానికి ప్రాణప్రతిష్ఠచేసి, దేశమును ప్రేమించుమనీ, మంచిని పెంచుమనీ ప్రబోధించి అజరామరుడైన గురజాడ అప్పారావు (1861–1915) రెండవవారు.

ఇక తెనుగు వ్రాతలోనే విప్లవంతెచ్చి, అంతకుముందుదాకా పండితులూ వారూ వాడుతూవచ్చి, చిన్నయసూరి తర్వాత అడుగున పడిపోయిన వ్యావహారిక భాషకి సాహిత్యంలో పట్టంకట్టి వచనం విస్తరింఛేందుకు కృషిచేసి తన జీవితంలోనే తన ఉద్యమసార్థక్యంచూచి సంతృప్తుడై ఉండి పోయిన గిడుగు రామమూర్తిపంతులు (1877-1923) మూడవవారు.

ఇలా అంత మహోన్నతులైన మహాపురుషులు అందఱు పుట్టి అనుపమాన ప్రతిభాసంపత్తితో, అనన్య సామాన్య నిరంతరకృషితో తెనుగు మాగాణంలో మణులను పండిస్తున్న రోజులలోనే జన్మించి అంతఎత్తూ ఎదిగిన మహనీయుడు లక్ష్మణరావుగారు.

ఆయన చేసిన బహుముఖకృషిని నాలుగుస్థూలరేఖలతో మీముందుంచే ప్రయత్నం చేయడమే ఇప్పటి నా ప్రసంగలక్ష్యం.

మిగతవారిలో ఒకొక్కరు ఒక్కొక్క రంగాన్ని, లేదా కొన్నిరంగాలను ఎన్నుకొని కృషిచేశారు. ఈయనకూడా అలాగే తానూ ఒక అపూర్వ సాహిత్యవ్యాసంగ రంగంలో గజ్జకట్టి దిగినాడు.

అయన జీవితంగూర్చి మరొకరు ప్రసంగించడంతో నేనాయన భాషా సేవాదులనే పేర్కొని వివరించే ప్రయత్నం చేస్తాను.

ప్రధానంగా ఒక్కొక్కరి బాల్యం, వారి అప్పటి పరిసరాలూ, విద్యాభ్యానం ఇత్యాదులు వారివారి తర్వాత కార్యసరళికి పునాదులువేస్తాయి.

లక్ష్మణరావుగారి పుట్టుక కృష్ణాజిల్లా పెనుగంచిప్రోలులో. తొలుత విద్యాభ్యాసం భువనగిరిలో, తర్వాత ఉన్నత విద్యార్జనం నాగపూరులో.

ఇదంతా ఆయనకొక విస్తృత విజ్ఞాన భూమిలోనికి ప్రవేశ మిప్పించినది. ఇటు ఆంధ్రం, అటు తెలంగాణాలలో రెండిటా సంబంధం-అందు నా సన్నిహిత సంబంధం ఉన్నవారు మనకు ఆట్టే లేరు. ఆనాడు మఱింతగా ఎవరికి వారుగా ఉన్నారు.

ఆ రోజులలో ఆయనకు తెలంగాణాతో ఏర్పడిన బాంధవ్యం తర్వాత అక్కడి మహానేతలలో కలిసి అక్కడి సాంస్కృతిక పునరుజ్జీవనంలో గొప్పగా పనిచేసే అవకాశం కల్పించినది.

అలాగే నాగపూరులో విద్యాభ్యాసం మహారాష్ట్రం, సంస్కృతం,హిందీ మొదలైన భాషలలో పాండిత్య ప్రాగల్భ్యసముపార్జనకు దారితీసి తర్వాత అయన వ్యాసంగంలో అపూర్వ సముద్దీప్తికి మూలభూతమైనది.

మహారాష్ట్రంలో పాండిత్యమంటే గీర్వాణంలో పాండిత్యంకూడా అని

వేరే చెప్పనవసరంలేదు. అప్పటికే ఆ భాషలో సజీవ సంచలనం బయలుదేరి ఎన్నెన్ని చర్చలకో, పరిశోధనలకో దారితీస్తూఉండగా రావుగారు అందులో తలమున్కలుగా దిగినారు.

ఎప్పటికైనా ఇతరభాషలతోడి పరిచయం, పాండిత్యం, సాన్నిహిత్యం ఏ భాషలో పనిచేసేవారినైనా ప్రభావితులను చేస్తుంది. వారి కృషికొక ఊపునూ తూగునూ ప్రసాదస్తుంది.

ఆంగ్లం మొత్తంమీద భారత జీవన సరణిలోనే కొత్తతీవెలెన్నింటినో పూయించి, కొత్తవలపుల నెన్నింటినో గుబాళింపజేయగా, ఇలా పలుభాషలతోడి సంపర్కం రావుగారి దృక్పథవైశాల్యానికి ఎంతైనా తోడ్పడిందని వేరే చెప్ప వలసిన పనిలేదు.

అప్పడి మరాఠీ పత్రికలలో ఆయన ఎన్నెన్ని వ్యాసాలో వ్రాశారు; కొన్ని పద్యాలనుకూడా వ్రాశారు. అప్పటి సాహిత్య సంవాద వివాదాలలో పాల్గొన్నారు. రామాయణంలోని పంచవటి ఏది అని ఆనాడు మరాఠీలో జరుగుతున్న చర్చలలో ఆయన పాల్గొని ఆ పంచవటి తెనుగునాటిలోనిదే నని నిరూపించేందుకు శతథా ప్రయత్నించారు.

అంతే అనాటి పరిశోధనలో ప్రధానమైనది, ఇంగ్లీషు పండితులు ఒరవడి పెట్టినది; అనేకప్రతులను సంపాదించి, వాటిని పర్యాలోచించి, పరిశీలించి, తారతమ్య పరిశీలనంచేసి వాటిలో సాధుపాఠ నిర్ణయంచేసి ప్రామాణిక ప్రతులను ప్రచురించడం.

అలా ఆయన ఆనాడు మహారాష్ట్రంలోని మోరోపంతు కర్ణ పర్వాన్ని పరిశోధించి శుద్ధప్రతిని తయారుచేసి అక్కడివారి మన్ననలను అందుకొన్నాడు. అయితే ఆనాళ్ళలోనే ఆయన తెనుగు దేశానికి ఎంతదూరంలో ఉన్నా తన మాతృభాషను దూరం చేసుకోలేదు. అందులో తాను మున్ముందు చేయవలసిన కృషికి అంకురార్పణం ఆనాడే చేశారు. ఆయనా, ఆయన సోదరి భండారు అచ్చమాంబగారూ తెలుగు పత్రికలకు, ఇక్కడి వాటికి, వ్యాసాలు వ్రాస్తూ వచ్చారు. అతర్వాత ఆమె అబలా సచ్చరిత్ర రత్నమాల వ్రాసి ప్రచార పఱచటం తెనుగుదేశం బాగా ఎఱుగును.

అప్పటిలో 1898 లోనే రావుగారు "విశ్వముయొక్క విరాట్ స్వరూపము" అన్నదీ, "విశ్వముయొక్క బాల్యస్వరూపము" అన్నదీ రెండువ్యాసాలు వ్రాశారు.

ఈ వ్యాసాలతో ఆయన చేయదలచుకున్నదేమిటో చూచాయగా తేలిపోయింది. పాశ్చాత్య వైజ్ఞానిక ప్రకాండులు పరిశోధనలుచేసి సాధించి, ప్రచుర పరుస్తున్న విజ్ఞాన ప్రగతిని తెనుగువారికి అందివ్వాలి; తెనుగులలో ఆధునిక విజ్ఞానం వెదజల్లాలి.

ఇందుకు వాటితో శ్రీకారంచుట్టి ఆ తర్వాత అనేక రచనలలో ఆ పనిని విస్తరింపజేస్తూ వచ్చినాడాయన.

అలాగే గాసటబీసటగానున్న భారతచరిత్రను, ఆంధ్రులచరిత్రను కాస్త చిక్కుదీసి, సరిచేసి, ఒక నిర్దిష్ట, నిర్దుష్ట ప్రామాణిక చరిత్రగా రచించాలనే ఆశయం ఆయనకు అనన్యసామాన్యమూ, మౌలిక పరిశోధనా పూర్ణమూ అయిన రంగంలోనికి ప్రవేశింప జేసినది,

వీటన్నిటికి కావలసిన సాధనసంపత్తిని సంతరించుకొనడమే బ్రహ్మాండమైన పని. పైగా పరప్రభుత్వం పరిపాలిస్తున్న రోజులలో, వారి పండితులు ప్రాచ్యమంతా పాశ్చాత్య సంస్కృతి ముందు దిగదుడుపే అన్న నమ్మకంతో, ప్రాచ్యచరిత్ర అంతా ఇటీవలికి వీలైనంతగా లాగివేయాలన్న దురూహతో, ఇదంతా ఏదో ఆటవికదశలో నున్నదన్న దుర్ భావంతో కూడా, కొందఱు తప్పుదారి పట్టిస్తున్న రోజులలో సరైన చరిత్రరచనకు ఉపక్రమించడమే భగీరథ ప్రయత్నం.

సరిగా ఈ మహాకృషిని ఆరంభిస్తున్నప్పుడు ఆయనకు అనువైన తావునకు వెళ్ళే అవకాశం చిక్కింది. అయన మునగాలపరగణాకు దివాన్‌అయ్యారు. ఆ విధినిర్వహణలో మదరాసునకు తన నివాసం మార్చుకున్నారు. ఆరోజులలో చెన్నపట్నం తెనుగు పునర్వికాసానికి ఆటపట్టుగా ఉన్నది; అనేక పరిశోధనలకు, పండితులకు, గ్రంథాలయాలకు, ప్రదర్శనశాలలకు ఆలవాలంగా ఉన్నది.

తెనుగువారికి మఱొక నగరం అప్పటికి లేదు. ఇప్పటికీ ఉన్నదా అనేది

కమే. హైదరాబాదు ఇంకా అందుకు తగిన హంగులన్నీ సమ
కి ఉన్నది. అయితే అదొక వివిధభాషా సంగమం కావడం
ం.

కో మదరాసుకూడా అటు మళయాళం, కన్నడం, తెలుగు,
గమ స్థలంగా ఉన్నది. పైగా పాశ్చాత్య ప్రఖ్యాత తొలి
కావడంలో విభిన్న సంస్కృతుల పరస్పర ప్రభావవిలసితమై

ం బ్రౌను మొదలు తర్వాతి తర్వాతి వేటూరు ప్రభాకరశాస్త్రిగారి
చరిత్ర, సాహిత్యాది పరిశోధకుల కందరకూ ఆటపట్టయినది.
డ విశ్వవిద్యాలయం, చక్కటి ప్రాచీన వస్తుప్రదర్శనశాల,
స్తక భాండాగారం ఇవన్నీ అమరి ఉన్నవి.

ల్లనే వీరేశలింగంగారికీ, కాశీనాథుని నాగేశ్వరరావు పంతులు
గారికికూడా లక్ష్మణరావుగారికి వలెనే అది నిలువరము
నది. ఈనాటికీ అక్కడ కావలసినంత సామగ్రి, సంభారం
ఉన్నది.

హైదరాబాదు నగరంలో లక్ష్మణరావు పంతులుగారు గ్రంథా
పాదుకల్పిస్తూ ఉండిన పోలీసు కమిషనర్ వెంకటరామిరెడ్డి,
నాయని వెంకటరంగారావు వగైరాలతో కలిసి పనిచేస్తూ
రు రంగారావు, ఆదిపూడి సోమనాథరావు, మైలవరపు నరసింహ
టి హనుమంతరావు వగైరాలతో కలిసి శ్రీ కృష్ణదేవరాయాంధ్ర
స్థాపించడంలో తెలంగాణా సాంస్కృతిక పునరుజ్జీవనానికి

ల్లి రామానుజరావుగారు ఒకచోట పేర్కొన్నట్లు ఆయన అక్కడి
మంద్వారా రాజకీయ సాంఘిక సాహిత్య రంగాలన్నిట ఒక
కి ప్రేరకులైనారు.

ల్లనే ఏ ఇతర పండితునికీ ఆనాడు లేని ఒక విశిష్టత వీరికి
లాంధ్ర వైతాళికుడైనా డీయన.

మదరాసులో 1906లో ఆయన విజ్ఞానచంద్రికా గ్రంథమండలిని సంస్థాపించినారు. అనేక యువకిశోరాలను చేర్చుకున్నారు; అనేక సమస్కంధులను రాబట్టుకొన్నారు. అప్పటిలో గాడిచర్ల హరిసర్వోత్తమరావుగారు మొదలు, అయ్యదేవర కాళేశ్వరరావు మొదలు అపుడప్పుడే పరిశోధనలో దిగుతున్న మల్లంపల్లి సోమశేఖర శర గారివంటి ఉద్దండు లెందరెందరతోనో ఆ గ్రంథమాలకు సంబంధ బాంధవ్యాలు ఏర్పడినవి.

ఇప్పటికీ మనం తీర్చుకోలేకపోతున్న దేశభాషా బోధనాదుల సమస్యలను ఏనాడో ఆయన ఊహించినాడు. ఏ సంక్లిష్టవిజ్ఞానశాఖ అయినా ఏ విషయమయినా తమ మాతృభాషలో చెప్పవీలున్నదనీ, ఇలా చెప్పినప్పుడే అది సులువుగా పరివ్యాప్తమవుతుందనీ ఆయన ఆనాడే నమ్మినాడు. కాబట్టే అందుకు పూనుకున్నాడు.

రసాయనశాస్త్రం, భౌతికశాస్త్రం, జీవశాస్త్రం, వృక్షశాస్త్రం మొదలు అనేక విజ్ఞాన శాఖలపై పుస్తకాలను రచించి, రచింపజేసి అందులో క్రమంగా ప్రచురిస్తూవచ్చారు. ఆయా విషయాలలో నిష్ణాతులైన వారిని ప్రోత్సహించి వారివలన అసమానకృషి చేయించారు.

అలాగే చరిత్రరచనకు ప్రాణంపోసిన మహనీయత ఆయనకే దక్కినది. స్వయంగా హిందూ మహాయుగం, మహమ్మదీయ మహాయుగం ఆయన రచించి ప్రచురించిన ఉద్గ్రంథాలలో కొన్ని.

అప్పటికి మూలసామగ్రిలోనికి వెళ్ళి ప్రతిదీ అక్కడొక అంశమూ, ఇక్కడొక అంశమూగా నెమకి ఏరుకొని సేకరించుకోవలసే ఉన్నది. పైగా పాశ్చాత్య చరిత్ర రచయితలు కొందఱు చరిత్రను తలక్రిందులుచేసి మసిపూసి మారేడుకాయచేసిన పట్టులూ అనేకములు. కాళిదాసాదుల కాలాన్ని ఎంత దగ్గఱకు లాగితే అంత మంచిదన్నట్లు ప్రవర్తించిన పండితులను గురించి మనకు తెలుసును. అలాగే మఱి కొందఱిటు ఏ గాథలనో త్రవ్వి వారిని ఇంకా ఇంకా ఆవలికి ఉన్ననాటికంటే ఆవలికి కొనిపోయే ప్రయత్నం చేయడమూ మన మెఱుగుదుము.

ఈయన అలాకాక అథర్వవేదకాలం మొదలు దేనికి కాలం నిర్ణయం చేయదలచినా ఏవిధమైన జాత్యహంకారంకాని, విజాతీయనైచ్యభావంకాని లేకుండా

దొరికిన సాక్ష్యంతో శాస్త్రీయంగా నిర్ణయించేందుకు శతధా సహస్రధా ప్రయత్నించాడు. ఇదెంత కష్టసాధ్యమో ఈనాడే మనకు తెలుసు. ఇక ఆనాడెంత కష్టాతి కష్టతరమో మనం ఊహించుకొన వచ్చును.

ముఖ్యంగా చరిత్రకు శాసనాదుల అధారం అతిప్రధానాంశము. ఆనాడు శాసనాదులను సేకరించడం అవసరమైనది. అంతేకాదు, ఆ శాసనాలేనాటివో నిర్ణయించాలి. ఆ లిపిని చదవగలగాలి. అందలి విషయాన్ని ఆనాటి మాటలను అర్థంచేసుకొని గ్రహించ గలగాలి.

అలా అయన ఎన్నెన్ని శాసనాలను చదివారో, ఎంత మౌలిక పరిశోధన కావించారో అనుకుంటేనే ఆశ్చర్యచకితుల మయిపోతాము.

ఆనాటి స్వచరిత్రాది రచనకు మనకు లక్ష్యంకూడా ఉన్నది. పాశ్చాత్యులు మనలో కలిగించిన న్యూనతా భావాన్ని పారద్రోలాలంటే మన పూర్వ కాలం ఔన్నత్యం, మన ప్రాచీన సంస్కృతీ సభ్యతా నాగరకతాదులలోని ఉన్నతీ, అలనాటి శిల్ప చిత్ర కళాదులలోని అప్రతిమాన రసజ్ఞతా అవన్నీ తిరిగి కట్టుకొనివచ్చి తనవారిముందు నిల్పి వారిలో ఆత్మవిశ్వాసం కల్పించాలి. అట్లని అది దురహంకార దుర్విలసితం కారాదు.

ఈ కత్తిమీదసామును బహుచక్కగా నిర్వర్తించి అయన అటు హిందూ, మహమ్మదీయ మహాయుగములనేకాక, శివాజీచరిత్రలాంటి వాటిని రచించాడు. అలాగే అబ్రహాం లింకన్, అశోక చక్రవర్తి లాంటి వాటిని ప్రచురించాడు.

ఇంతచేసినా ఆయనకు సంతృప్తి కలుగలేదు. తాను రెండు చేతులా ప్రపంచ విజ్ఞానాన్ని తెనుగువారందరకూ పంచిపెట్టాలి. అది కేవలం పొడుగు చేతుల పందేరం కాకూడదు. సర్వజన సామాన్యం అందుబాటులోనికి అది రావాలి.

అందుకాయన ఎంతగా తపించిపోయినారో, తహతహపడినారో మనం ఊహించలేము. తుదకు ఆయనకు అందుకు తగిన పథకమొకటి తట్టినది. దానిని వెనువెంటనే ఆచరణలో పెట్టినాడు.

అదొక ఉద్యమం. అదే ఆయన ఆరంభించిన ఆంధ్ర విజ్ఞాన సర్వస్వ ప్రకటన సమారంభం.

1912–13లలో ఆయన అంతదాకా ప్రపంచ మానవ మహాజ్ఞాన భాండాగారాన్ని సమాలోచనంచేసి దాని సారసంగ్రహాన్ని అందఱకూ పంచాలని విజ్ఞాన సర్వస్వం ఆరంభించారు.

ఎన్‌సైక్లోపీడియా బ్రిటానికా ఆదర్శంగా దానిని సంసిద్ధపఱచ సాగినాడు. తాను ప్రధాన సంపాదకుడుగానే కాదు, ప్రధానవిషయసల్లేఖకుడుగాకూడా పని చేసినాడు. ఎందఱెందఱు సముజ్జ్వలులైన జగజెట్టీలో పనిచేసినా ఆయన వ్రాసినన్ని వ్యాసాలు అందులో ఇంకెవరు వ్రాసినట్లు కనిపించదు.

అంత బ్రహ్మాండమైన ప్రయత్నాన్ని ఆ నాడు ఏ అపార ధన సంచయమూ లేక, ఏ ప్రభుత్వ ఆదరాభిమానాలూ సహాయ సంపత్తీ లేకుండానే కొనసాగించిన ఆయన సాహసానికి మనం జేజేలు చెప్పాలి.

మఱొకటి. ఆయన తానే ఒక విజ్ఞాన సర్వస్వం – నడయాడు విజ్ఞాన సర్వస్వంగా మనకు కానవస్తాడు. అకారం వఱకే ముగిసిన ఆ విజ్ఞాన సర్వస్వంలో అథర్వవేదం, అద్వైతం, అభిజ్ఞాన శాకుంతలం, అలంకారాలు, అష్టాదశ మహాపురాణాలు, అష్టాధ్యాయి – ఇలాంటి విభిన్న మహాంశాల గూర్చి ఆయన వ్రాసిన వ్యాసపరంపరను మనం పరిశీలిస్తే ఆ విజ్ఞానఖని ఎంతలోతైనదో, ఎంత విస్తృతమైనదో, ఎంత సంపన్నమూ సమృద్ధమూ అయినదో బోధపడుతుంది. ఆ అపారజ్ఞాన సంపద మనకళ్ళకు మిఱుమిట్లు కొల్పుతుంది.

పోనీ అలాంటి విషయాలతోనే ఆయన సంతృప్తిపడినాడా లేదే: అట్టబైండు అన్న వ్యాసంచూస్తే, అది ఎంత సాంకేతికంగా, శాస్త్రీయంగా స్పష్టంగా, ఆచరణకు అనుకూలంగా వ్రాశాడో గమనిస్తే 'ఇదా విజ్ఞానమంటే' అని ముక్కున వ్రేలిడుకొని విస్తుపోయి ఓ నిశ్చయానికి వస్తాము.

ప్రధాన విషయమనీ, అప్రధాన విషయమనీ, సాహిత్యమనీ చట్టుబండలనీ లేదు, జనానికి అవసరమయ్యే సర్వవిషయ సామగ్రిలో దేనిమీదనైనా వారు వ్రాయగలరు; అందుకు తగిన సంభారాన్ని సంపాదించుకోగలరు. ఉచ్చిపచ్చిగా నాలుగవీ, నాలుగివీ కలిపి వ్రాసి ఏదో మొక్కుబడి తీర్చుకోవడం కాక ముకుబంటిగా విషయ సముద్రంలో మునిగి తేలి ముత్యాలను ఏరి తెచ్చి మనకు అందివ్వగల ఓరిమీ పేరిమీ కల వారాయన.

అయినా ఆ ఆంధ్ర విజ్ఞాన సర్వస్వం అప్పటిలో మూడు సంపుటాలలో అకారంతో ముగిసి అక్కడికే ఆగిపోయింది. ఆయన సజీవుడే అయి మరి కొన్నాళ్ళుంటే, అది పూర్తిగా ఆవిధంగానే పూర్తి అయి ఉంటే మనం సాహిత్య పరంగా ఇంకెంతో సంపన్నులం అయి ఉండేవారం. అందుకు ఆంధ్రులు నోచుకోలేదు. ఆయన 1923లోనే పరమపదించినారు. కాలమెంత క్రూర మైనదో!

దానినే తర్వాత కాశీనాథుని నాగేశ్వరరావు పంతులుగారు మరెంత మంది పండితుల సాయంతో, అంతదాకా తెలిసిన విజ్ఞానంతో తిరిగి ఆ అకార పరంపరనే రెండు ముచ్చటైన సంపుటాలలో ప్రకటించినారు. తిరిగి పంతులు గారి మృతితో ఆ పని కూడా కడముట్టకనే ఆగిపోయింది. ఆ తర్వాత తెలుగు భాషా సమితి ఏర్పడింది. డాక్టర్ గోపాలరెడ్డిగారే దాని అధ్యక్షులు. వీరు అలా అకారాదిక్రమంగా కాక, విషయానుక్రమంగా విడివిడి సంపు టాలుగా విభజించుకొని ప్రచురించ నారంభించారు; పన్నెండు సంపుటాల దాకా వచ్చినవి.

అలాగే ఒక విజ్ఞాన సర్వస్వం సంగ్రహంగా హైదరాబాదునుంచి వెలు వడినది.

ఇతః పూర్వమే ఉర్లాం జమీందారుగారు అయిదు సంపుటాలలో ఆంధ్ర విజ్ఞానం అని ప్రకటించినారు. ఇది 1938-41 మధ్య వెలువడినది.

ఏమయినా లక్ష్మణరావుగారు ఆరంభించిన పద్ధతిలో తెలుగులో అంత భారీఎత్తున విజ్ఞాన సర్వస్వం రాలేదు.

నిజానికి భారత భాషలలో విజ్ఞాన సర్వస్వం ఆరంభించింది తెలుగు లోనే అన్నది మనం జ్ఞాపకం ఉంచుకోవలసిన అంశం. తర్వాత 1915లో మరాఠీలో విజ్ఞాన సర్వస్వ ప్రకటన ఆరంభమై 21 సంపుటాలలో 1927 నాటికి పూర్తి అయింది. అలాగే బెంగాలీలో 'విశ్వకోశం' అనే పేరి విజ్ఞాన సర్వస్వం తర్వాత ప్రచురితమైనది. మిగత అనేక భాషలలో ఆ ప్రయత్నం అలా కొనసాగడానికి మున్ముందే లక్ష్మణరావుగారు ఆరంభించారు. ఆయన దూరదృష్టిని అభినందించక ఉండలేము.

ఇంతకూ ఆయన మాంచి వయసులో కాలానికి బలిఅయి పోయారు కానీ కాకపోతే ఇంకెన్ని చేసేవారో. నలభైఆరేళ్ళ వయసులోనే ఆయన మృతి చెందినా ఎంత అద్భుతమైన అపారకృషి చేశారో మనం తలచుకుంటేనే ఒడలు గగుర్పొడుస్తుంది.

ఇలా ఇంత కృషిచేసి గతించిన ఆ మహనీయుని సంస్మృతి మనలో ఏ యింత కార్యవ్యగ్రతను ప్రబుద్ధంచేసినా అదే పదివేలు. రానున్న 1977లో ఆయన శతజయంతినాటికి ఆయన రచనలన్నిటిని సమీకరించి, సముద్ధరించి, సంపాదించి, చక్కగా ముద్రించి ప్రచురించే మహాకార్యానికి ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీవారు బద్ధకంకణులు కాగలరని, కావలెనని ఆశిస్తున్నాను, విశ్వసిస్తున్నాను.

ఈనాలుగు మాటలలో ఆ మహావ్యక్తికి రూపుకట్టగల శక్తి నాకు లేదు. అయినా అందుకు పూనుకున్న నా సాహసాన్ని మన్నిస్తారని నమ్ముతున్నాను.

ఈ అవకాశం కల్పించిన అకాడమీ అధ్యక్షుడు గోపాలరెడ్డిగారికి, కార్యదర్శి రామానుజరావుగారికి ఇతర కార్యకర్తలకు నా కృతజ్ఞతను తెలియ జేసుకుంటున్నాను.

——

## ఉపయుక్త గ్రంథాలు, వ్యాసాలు,

1. కాశేశ్వరరావు, అయ్యదేవర. నా జీవితకథ - నవ్యాంధ్రము,
విజయవాడ: ఆదర్శ గ్రంథ మండలి, 1959.

2. వీరభద్రరావు, ఆదిరాజు, సర్వజ్ఞశేఖరుడు లక్ష్మణరావు.
లక్ష్మణరాయ వర్ధంతి సంచిక, సికింద్రాబాదు:
తెలుగు తల్లి కార్యాలయము, 1944.

3. వెంకట లక్ష్మణరావు, కొమఱ్ఱాజు. లక్ష్మణరాయ వ్యాసావళి.
మద్రాసు: లక్ష్మణరాయ పరిశోధక మండలి, 1923.

4. సీతారామయ్య, కురుగంటి, ఈయన ఒకవ్యక్తికాదు-ఒక సంస్థ అనవచ్చు
లక్ష్మణరాయవర్ధంతి సంచిక, సికింద్రాబాద్:
తెలుగుతల్లి కార్యాలయము, 1944.

5. సోమశేఖర శర్మ, మల్లంపల్లి. విజ్ఞాన సింధువు.
లక్ష్మణరాయ వర్ధంతి సంచిక, సికింద్రాబాద్:
తెలుగుతల్లి కార్యాలయము, 1944.

6. హరి సర్వోత్తమరావు, గాడిచర్ల. అన్నయ్య కొమఱ్ఱాజు లక్ష్మణరావు.
లక్ష్మణరాయ వర్ధంతి సంచిక, సికింద్రాబాద్:
తెలుగుతల్లి కార్యాలయము, 1944.

# శ్రీ రాజా నాయని వేంకట రంగారావు బహద్దరుగారు

— కేశవపంతుల నరసింహశాస్త్రి.

భారత స్వాతంత్ర్య లబ్ధికి పూర్వం మన ఆంధ్రప్రదేశ్‌లో కూడా ఎన్నో సంస్థానములు, జమీందారీలు, జాగీర్లు, మక్తా గ్రామములు, దేశముఖ్ దేశపాండ్యాల పరిపాలనా ప్రాభవం కల పల్లెలు పట్టణాలు ఉండినవి. వాటి అధిపతులైన వారిలో దేశం, దేశప్రజలు, సారస్వతం, సాహిత్యం, సంస్కృతి, అన్న విషయాలపై మక్కువ గలవారు కూడా ఉండిరి. కనుకనే ఈనాడు మనం కళాసాహిత్య సంస్కృతులకు సంబంధించిన యే నూతన కార్యమును తలపెట్టినప్పటికిని దానికి పునాదిగా, పూర్వరంగముగా కొంత ఆధారం లభిస్తున్నది.

మైసూరు, విజయనగరం, గద్వాల మొదలయిన సంస్థానముల అధిపతులు కళాసాహిత్య పోషణమును చేసి దేశమునకు, దేశీయులకు కొంత మేలును చేకూర్చినారు. దేవాలయ, విద్యాలయ చికిత్సాలయాదులను నెలకొల్పి దేశప్రజల కళా విజ్ఞానములకు, ఆరోగ్య భాగ్యములకు యథాశక్తిగా దోహదమును కలిగించినారు. శ్రీరాజా నాయని వేంకటరంగారావుగారు ఆ కోవకు చెందిన జమీందారులై యుండిరి. క్రి. శ. 1875లో వరంగల్లు జిల్లా, మానుకోట తాలూకాలోని నెల్లికుదురు గ్రామమునందు నాయని రాఘవరెడ్డిగారు శ్రీమతి. గోపమ్మగారు అను పుణ్యదంపతుల గర్భమున జన్మించిరి. నాయనివారు రెడ్డి కులంలోని మోటాటి శాఖకు చెందినట్టివారు. ఈ మోటాటి శాఖీయులైన రెడ్లలో చాలామంది సంస్థానాధీశులుగను, దేశముఖులుగను, జాగీర్దార్లుగను ఉన్నట్టివారు. సుమారు 200 సంవత్సరాలకు పూర్వం అలంపురం సంస్థానమును పరిపాలించిన బిజ్జులవారు, వనపర్తి, గోపాలపేటల ప్రభువులై యుండిన జనుంపల్లివారు, బాబాసాహెబ్‌పేట రెడ్రెడ్డివారు. వన్నాజిపేట మొదలయిన నగరములకు పాలకులైనవారు, మరికొందరు ప్రభువులుకూడ ఈ మోటాటి రెడ్డిశాఖకు చెందినట్టివారే. బహుశః కాకతీయుల పాలనంలో ప్రాముఖ్యమును వహించిన "మట్టెవాడ" గ్రామమున నివసించి, తరువాత

ఇతర ప్రాంతములకు వెళ్లుటచేత ఈ తెగకు చెందిన రెడ్లు "మటెవాడ, మోటి వాడ, మోటాటి" అను పదమును రెడ్డిజాతికి పూర్వ పదమునుగా స్వీకరించి యుందురు. అలంపూరునకు ప్రభువై యుండిన బిజ్జల తిమ్మభూపాలుడు తన అనర్ఘరాఘవ కావ్యమునందు, "మోటవాడ కులమునందు" అని పేర్కొని యున్నాడు. కనుక మోటాటివారు కాకతీయుల కాలమునుండియే క్షాత్రతేజము గల పాలకులై యుండిరనుట నిర్వివాదాంశము.

వరంగల్లు జిల్లాలోనిదేయైన మానుకోట తాలూకా తొర్రూరు ప్రభువు లలో వీరికి పెద్దతండ్రి వరుస వారైన నాయని వేంకటరామయ్యగారు, కీసర వంశీయులైన మునగాల పరగణా జమీందారుల ఆడపడుచు లచ్చమ్మారావు గారిని పరిణయమాడిరి. కీసరవారికి పురుష సంతానము లేకపోవుటచేత లచ్చమ్మారావుగారికి వారసత్వం ఏర్పడి ఆమె మునగాల పరగణాకు అధి కారిణియై, "రాజా నాయని లచ్చమ్మారావు బహద్దరు" అను పేరుతో వ్యవహ రింపబడినది. పరగణాకు ఆమెయే జమీందారిణి; శ్రీ నాయని వెంకటరామయ్యా గారు ఇల్లటపల్లుడు. లచ్చమ్మారావు వెంకటరామయ్యాగార్లకు సంతానము కలుగ లేదు. వేంకట రంగారావుగారి అనంతరం, లచ్చమ్మారావుగారు తన పితృ వంశీయులైన కీసర వంశంవారు కాక తన భర్త వంశీయులైన నాయని వారి యింటినుండే ఒక పిల్లవానిని తెచ్చి దత్తత చేసుకోదలచినది. భర్తగారి గ్రామము తొర్రూరులో తగిన పిల్లవాడు దొరకనందున, తొర్రూరి వారి సన్ని హిత జ్ఞాతులైన నెల్లికుదురు నాయనివారి ఇంటినుండి తెచ్చుకోదలచినది. అక్కడ నుండిన శ్రీ. నాయని రాఘవరెడ్డిగారికి, నరసింహారెడ్డి, అప్పారెడ్డి, రంగారెడ్డి, వరదారెడ్డి అను నలుగురు పుత్రులును చూడమ్మ, సింగమ్మ అను ఇద్దరు పుత్రికలును ఉండిరి. వారిలో మూడవ కుమారుడైన రంగారెడ్డి అను పిల్ల వానిని స్వీకరించి అతనికి "వేంకట రంగారావు" అను నామకరణమును జమీం దారు పదవికి యోగ్యముగా చేసిరి. ఆవిధముగా లచ్చమ్మారావు బహద్దరుగారు శ్రీ నాయని వేంకటరంగారావుగారిని నెల్లికుదురునుండి తెచ్చి తమకు దత్త పుత్రుడుగా చేసుకున్నారు. దత్తపుత్రుడు బాల్యములో నుండగానే లచ్చమ్మా రావుగారు స్వర్గస్థురాలైనది. ఆకారణము వలన మునగాల పరగణా కోర్టఫ్ వార్డ్సు స్వాధీనమైనది. కృష్ణాజిలా కలెక్టర్ మైనరుగా ఉండిన నాయని వేంకట రంగారావుగారి యోగక్షేమములు చూడవలసిన వాడైనాడు.

'మునగాల' అని పరగణా పేరేకాని వీరి జమీందారీ ముఖ్యపట్టణము 'నడిగూడెము'. నడిగూడెము మునగాలకు ఉత్తరముగా 4 మైళ్ళ దూరములో నున్నది. మునగాల హైదరాబాదునుండి విజయవాడకు వెళ్ళు రోడ్డుమీద సూర్యాపేటకు సుమారు 15 మైళ్ళ దూరమున ఉన్నది. సుమారైన పట్టణమే. కాని కీసరవారి పూర్వ రాజధానీపట్టణము "సిరిపురము". తరువాత యేర్పడినది నడిగూడెము. నడిగూడెములో పూర్వులు కట్టించిన కోట, శివాలయము, ఒక ధర్మసత్రము ఉన్నవి. మునగాల పరగణా బ్రిటిష్ పరిపాలనంలోనున్న కృష్ణాజిల్లాకు చెందినదైనప్పటికిని, నిజాం పరిపాలనములో నుండిన హైదరాబాదు రాజ్యంచేత చుట్టబడి యుండెను. అన్ని ప్రక్కలందును నైజాం గ్రామములే యుండి ఒక ద్వీపమువలె నుండినది. కృష్ణాజిల్లాకు చెందియుండిన ఈ పరగణా ఆంధ్రప్రాంతము లన్నింటినీ అనగా తెలుగు మాట్లాడు వారినందరినీ ఒకే పరిపాలనం క్రిందికి తీసుకరావలయునన్న యుద్దేశములో నేర్పాటు చేయబడిన "ఆంధ్రప్రదేశ్" విశాలాంధ్ర అవతరణము జరిగిన పిమ్మట క్రీ. శ. 1959లో నల్లగొండజిల్లాలో చేర్చబడినది. కాగా మునగాల ప్రాంతపు గ్రామాలన్నీ ఇప్పుడు నల్లగొండ జిల్లాకే చెందియున్నవి. ఈ పరగణాకు చెందినవి, 40 గ్రామములు. వీరి ఆదాయము సుమారు 5 నుండి 6 లక్షలవరకు ఉండినట్లును, బ్రిటిష్ ప్రభుత్వమునకు వీరు ప్రతి సంవత్సరమును 90 వేల రూపాయలు పేష్కష్ కట్టుచుండినట్లును చెప్పుదురు. అనగా చెప్పుకొనదగిన ఆదాయముతోను, చక్కని వైభవముతోను ఉండిన జమీందారీ అన్నమాట. ఈ పరగణాకు చెందిన సుమారు పది గ్రామాలలో మంచి దేవాలయము లున్నవి. ఆ దేవాలయ నిత్యపూజాది కైంకర్యములకై ఈ జమీందారులే ఇనాము లిచ్చియుండిరి. నడిగూడెమునందున్న "సారంగేశ్వరస్వామి" శివాలయము చరిత్రప్రసిద్ధి కలిగినట్టిది.* వీరశైవ మత ప్రవక్తలలో సుప్రసిద్ధులై యుండిన

* మల్లికార్జున పండితారాధ్యుడు బసవేశ్వరుని దర్శించుటకై కళ్యాణ కటకమునకు బయలుదేరి నల్లగొండ మండలములోని పానుగంటికి చేరునప్పుడు దారిలోవున్న నడిగూడెమునకు వచ్చి అచ్చటనున్న శివభక్తుడు, "వీరచాకి దేవయ్య" అనుభక్తుడిచ్చిన ఆతిథ్యాదులకు స్వీకరించి, అచ్చట ఉన శ్రీసారంగేశ్వరాలయమును దర్శించినట్లు పాల్కురికి సోమనాథుడు రచించిన పండితారాధ్య చరిత్రలోని ఈక్రింది పంక్తులు వివరించుచున్నవి:

పండితారాధ్యులవారు బసవేశ్వరుని దర్శించుటకై బయలుదేరి వెళ్లుచు, నల్లగొండ మండలములోని పానుగంటికి చేరగా, అచ్చటివారికి శ్రీ బసవేశ్వరుడు కప్పుడి సంగమేశ్వరమున లింగైక్యమొంది దేహమును చాలించినట్లు తెలిసినది. అప్పుడు నిరుత్సాహముతో వెనుకకు మళ్లిరట. ఆవిధముగా వారు పానుగల్లుకు చేరులోపల ఒకపూట నడిగూడెములోని సారంగేశ్వరాలయములో నివసించినట్లు పాల్కురికిసోమనాథుడు రచించిన పండితారాధ్య చరిత్రము నందున్నది. మునగాలవారికి, తమ పరగణా గ్రామములలోనిదైన, "రేపాల" లో వేంచేసియున్న లక్ష్మీనరసింహస్వామి ఇలువేల్పు. ఆ గ్రామంలోనే కొండమీద వెలసియున్న రామలింగేశ్వరస్వామి ఈ జమీందారులకు మంత్రులై యుండిన కొమఱ్ఱాజు వారికి ఇష్టదైవము. కొమఱ్ఱాజు వేంకటశివుడను పూర్వకవి "రేపాల రాజలింగేశ్వర" శతకమును రచించెను. పూర్వ రాజధానియైన సిరిపురంలోని కోదండరామస్వామి దేవాలయం, రంగనాయకస్వామి దేవాలయంకూడా కీసర వారు నెలకొల్పినట్టివే. నాయని వేంకటరంగారావుగారి దత్తుతల్లియైన నాయని లచ్చమ్మారావు బహద్దరు విష్ణుభక్తురాలు; తన పుట్టినింటి వారైన కీసరవారు నెలకొల్పిన దేవాలయములన్నింటికిని నిత్య పూజా నైవేద్యాదులు, జీర్ణోద్ధార ప్రతిష్ఠాదులు చేయించుటలో మిక్కిలి శ్రద్ధను చూపినది. దేవబ్రాహ్మణులయందు భక్తివిశ్వాసములు కలిగియుండినది. మునగాలవారు దేవబ్రాహ్మణ విశ్వాసము, కవి పండిత పోషణము మొదలయిన ఉదారగుణములు కలవారై యుండినందు

"...బసవగణాధ్యక్షు నాక్షణమ
వీక్షింతునను వింత వేడ్కమైనంత
స్ఫుటకీర్తి మల్లికార్జునుడు కళ్యాణ
కటకంబునకు నభిగమనంబు సేయ
మారాది సద్భక్తమండలి తాను
ఊరూర సద్భక్తులొగి నెదుర్కొనగ
ముదమున నిరుగుడుములకు నేతెంచి
సదమలాత్ముడు వీరచాకి రాజయ్య
ప్రవ్యక్తభక్తి సారంగేశునంద
నవ్యసీమాలంఘన ప్రతాసక్తి

వల్లనే తెలుగు కావ్యరచన యందును, సంస్కృత పాండిత్యమునందును సుప్రసిద్ధులైయుండిన మరింగంటి వారిలోని ఒకతెగవారు ఈ పరగణాకు చెందిన "అప్పల నరసింహాపురం" లో స్థిరనివాస మేర్పరచుకొని, కీసర వంశీయుల చేతను, తరువాత నాయని వంశీయులచేతను ఆదర సత్కార గౌరవములను పొందుచు వారి శ్రేయస్సును కోరుచు సారస్వత కృషిని సాగించుచు వచ్చినారు. పూర్వుల మార్గమునందే శ్రీ వెంకటరంగారావుగారును నడచుచుండిరి.

బాలుడై యుండిన వేంకటరంగారావుగారికే మునగాల పరగణా జమీందారీ వారసత్వము లభించుటచేతను, పరగణా కోర్ట్ అఫ్‌వార్డ్సు చేతిలోనుండుట చేతను కృష్ణాజిల్లా కలెక్టర్ జమీందారీ ఆదాయవ్యయాది విషయములతోపాటు వేంకట రంగారావుగారి విద్యాబుద్ధుల విషయమునందును పర్యవేక్షణ చేయుచుండెను. అట్టి యేర్పాటులో వీరు తెలుగు, ఉర్దు, సంస్కృతము, ఇంగ్లీష్ భాషలలో మంచి పరిజ్ఞానము సంపాదించి, మద్రాసు విశ్వవిద్యాలయమునకు సంబంధించిన ఎఫ్. ఏ (ఇంటర్మీడియేటు) పరీక్షలో నుత్తీర్ణులై చక్కని విద్యావంతులుగా ప్రశస్తిని గాంచిరి. తరువాత గృహస్థ జీవనమున ప్రవేశించి, అన్ని విధముల తమకు అనుకూలవతియైన రాణీ బుచ్చమ్మగారితో సుఖజీవనము చేయుచు అనేకములయిన ధార్మిక, సాంస్కృతిక, సారస్వత కార్యక్రమము

---

అతుల త్రికాల లింగార్చనాయుక్తి
సతత జంగమ పరిచర్యానురక్తి
శివభక్తి తత్త్వగోష్ఠీ సముద్యుక్తి
యవధూత పూర్వవర్ణాశ్రమవ్యక్తి
శ్రుతిచోదితాచార సుపథప్రయుక్తి
మతిఁగొనియాడుచు మటిపండితుల ని -
జాగ్రశిష్యుండన నమరు దోనయ్య
కగ్రజుండై వ్రతోద్యన్నిష్ఠ వెలయ
నా వీరచాకి రాజయ్యచే భక్తి
భావనమైఁ బ్రణిపత్తిఁ గైకొనుచు
గర మనురాగ సంగతిఁ బానుగంటి

లను నిర్వహించినారు. శ్రీమతి రాణీ బుచ్చమ్మ శ్రీ రాజా వేంకటరంగారావు పుణ్యదంపతుల గర్భమున ముగ్గురు కుమారులును ముగ్గురు కుమార్తెలును ఉదయించిరి.

**కుమారులు :-**

1. శ్రీ. రామకృష్ణారెడ్డిగారు :

వీరు ఎం. ఏ వరకును విద్యనభ్యసించి జమీందారీ కార్యకలాపములను చూచుకొనుచుండిరి. ప్రస్తుతము బెంగుళూరు నగరమునందు నివాస మేర్పరచుకొన్నారు; ఉదారహృదయులు.

2. శ్రీ. గోపాల కృష్ణారెడ్డిగారు :

వీరును ఉన్నత విద్యావంతులు. విదేశములందు విద్యాభ్యాసమునుచేసి ఉన్నతోద్యోగములను నిర్వహించినట్టివారు; బెంగుళూరు హైదరాబాదు నగరములలో నుందురు.

3. శ్రీ. నరేంద్రనాథ రెడ్డిగారు:

వీరు విద్యావంతులు జమీందారీ వ్యవహారములు చూచుకొనుచుండిరి. ప్రస్తుతము హైదరాబాదు నగరమునందే యున్నారు.

**కుమార్తెలు :-**

1. శ్రీమతి. లక్ష్మిబాయమ్మ:

ఈమె బాబాసాహెబ్ పేట దేశ్ ముఖ్ శ్రీ. రెడ్డి రాజగోపాలరెడ్డి బారిష్టర్ గారి ధర్మపత్ని. ఈ దంపతులకు విద్యావలతులు, శీలవంతులునైన

---

కరుగుదేరగ శిష్యుడైన బందరువు-
గోవిందప్రెగడయు కోరి మహేశ్వ
రావలియును పురం బభిరమ్యముగను."

ఆ తరువాత పానుగంటి పురవర్ణనాదులు, మహాశివునిసంకల్పము మూర్తీభవించి వేంగీదేశమునందలి దక్షారామమునందున్న భీమేశ్వర లింగ పురోహితుడు, వానసవంశీయుడు అయినభీమన పండితునికి అతనిసాధ్వి గౌరాంబకూ పుత్రుడై జన్మించి, శ్రీమల్లికార్జున పండితారాధ్యుడను పేరుతో ప్రసిద్ధిని పొందెను.

ఆయన మహిమను, పాండిత్యమును, వీరశైవ సిద్ధాంత ప్రచారదక్షతను వెల్లడించు మహాకావ్యమే, ద్విపద ప్రబంధముగానున్న పండితారాధ్య చరిత్రము పాల్కురికి సోమనాథుని రచన.

ఇద్దరు కుమారులు, ఆరుగురు కుమార్తెలును గలరు.

2. శ్రీమతి. రాణీ జె. సరళాదేవి:

ఈమె వనపర్తి సంస్థానాధీశులై యుండిన శ్రీ జనుంపల్లి కృష్ణదేవ రాయ మహాభూపాల్ బహిరీ బల్వంత్ బహద్దర్‌గారి ధర్మపత్ని, వనపర్తి సంస్థానాధీశ్వరియై రాణీ సరళాదేవిగా ప్రసిద్ధిని గాంచిన మహిళ. వర్తమానులై పార్లమెంటుసభ్యులై, విద్యావంతులై విఖ్యాతిని గడించిన వనపర్తి రాజా శ్రీ. జె. రామేశ్వరరావుగారికి జనయిత్రి; అనేక మహిళాసంస్థలు నిర్వహించుచున్న విదుషీమణి.

3. శ్రీమతి. ఆర్. సరోజినీదేవి:

శ్రీ ఎస్. ఎన్. రెడ్డిగారి ధర్మపత్ని, సంఘసేవాపరాయణురాలు. ఈమె బాబాసాహెబ్‌పేట దేశముఖులై యుండిన శ్రీ రెడ్డెడ్డి గోవిందరెడ్డి, శ్రీ రెడ్డెడ్డి రాజగోపాల్‌రెడ్డి బారిష్టర్‌గార్లకు తమ్ములై, బహుకాలము హైదరాబాద్ సిటీ పోలీస్ కమీషనర్‌గాను, రాజప్రముఖ్ మీర్ ఉస్మానలీఖాన్ బహద్దర్ నిజాంనవాబుగారికి సలహాదారుగను తమ యుద్యోగ విధులను సమర్థవంతముగా నిర్వహించి, ప్రస్తుతము విశ్రాంతిని తీసుకొనుచున్న శ్రీ ఎస్. ఎన్. రెడ్డి బారెట్లాగారి సతీమణి. ఈవిధముగా శ్రీ. మునగాలరాజా నాయని వెంకటరంగారావు బహద్దరుగారికి కలిగిన సంతానము ఉన్నత విద్యచేతను, సాంఘిక సేవాపరాయణత్వముచేతను సుప్రసిద్ధులై యున్నారు. శ్రీవారు తాము జమీందారులై యుండుటయే కాక తమకుమార్తెలను సంస్థానపతులకును, దేశ్‌ముఖ్‌వర్యులకును ఇచ్చియు, తమ కుమారులకట్లే యుత్తమ తరగతికిచెందిన రాజవంశీయుల యిండ్లనుండి కన్యలను తెచ్చుకొనియు రాజులై, రాజపుంగవులై, మహారాజబంధువులై తామరతంపముగా విలసిల్లి విస్తరించిన గృహస్థ జీవనమునందు ఆనందోత్సాహములతో మనుగడను సాగించినారు

శ్రీ. వేంకట రంగారావుగారికి లచ్చమ్మారావుగారి వారసత్వము సరియైనది కాదనియు, మునగాలపరగణాపై వారికి హక్కు లేదనియు, కీసర వంశీయులైనవారు పెట్టిన వ్యవహారము బహుకాలము నడచినది. చివరకు ప్రీవీ కౌన్సిల్‌వరకు గూడ వెళ్ళినది. తుదకు శ్రీ వేంకట రంగారావుగారి పక్షమువకే విజయము కలిగినది. అప్పుడు వీరికి తొల్బూరు పట్టితోపాటు మునగాల

పునరుక్తిపంటిది. శ్రీ కొమర్రాజు లక్ష్మణరావుగారి సహకారముతో పై గ్రంథాలయమును స్థాపించిన కాలముననందే విజ్ఞాన చంద్రికా పరిషత్తును, విజ్ఞాన చంద్రికా మండలినికూడ స్థాపించిరి. హైదరాబాదు నగరమునందు ఆకాలమున తెనుగు పుస్తకములను చక్కగా ముద్రింపగలిగిన ముద్రణాలయములు లేకయుండినందువలన పై విజ్ఞాన చంద్రికా పరిషత్తును, విజ్ఞాన చంద్రికా గ్రంథమాలను మద్రాసు నగరమునకు మార్చిరి. శ్రీ. మునగాల జమీందారుగారికి మద్రాసునగరమున స్వంత భవనముండుటచేతను, దివాన్‌గారైన శ్రీ.కొమర్రాజు లక్ష్మణరావుగారు జమీందారీ వ్యవహారములకు సంబంధించి పదేపదే మద్రాసు నగరమునకు వెళ్లవలసిన వారైనందువల్లను ఈమార్పు తప్పనిసరియైనది. అట్టి మార్పువలన శ్రీ. లక్ష్మణరావుగారు మద్రాసు నగరమున స్థిరనివాసమేర్పరచుకొని అక్కడి రాజకీయ వ్యవహారములతోపాటు పరిషత్తును, గ్రంథమాలను చక్కగా నిర్వహించుటకు తగిన యవకాశమేర్పడినది.

ఇవి మాత్రమేకాక శ్రీ. నాయని వేంకట రంగారావుగారు స్థాపించినవి, స్థాపకులలో నొకరై యుండినవి, మహారాజ పోషకులుగా నుండినవియైన సంస్థలు యావదాంధ్రములోను ఉండినవి అనిచెప్పుట అతిశయోక్తి కాదు. వారు, శ్రీ. ఉన్నవ లక్ష్మీనారాయణ పంతులుగారు నిర్వహించిన, గుంటూరు నగరమునందలి "శారదానికేతనము" నకు స్థాపకులలో నొకరైన అధ్యక్షులు. మచిలీపట్టణము (బందరు) నందలి ఆంధ్ర జాతీయ కళాశాల స్థాపకులలో ఒకరు. బందరుపట్టణము నందలిదేయైన "ఆంధ్ర సరస్వతీ గ్రంథ మండలి"కి మహారాజ పోషకులు. శ్రీ. వేంకట పార్వతీశ్వర కవులు నిర్వహించిన "ఆంధ్ర ప్రచారిణీ గ్రంథమాల"కు కూడా మహారాజ పోషకులు. ఇదికాక ఆంధ్ర తెలంగాణా ప్రాంతములలో నెలకొల్పబడిన పెక్కు గ్రంథమాలలకు, పాఠశాలలకు మహారాజ పోషకులుగానో, ప్రోత్సాహకులుగానో, ద్రవ్యదాతలుగానో యుండిరి. కవి పండిత సారస్వత పోషణములన్నచో వారికి మిక్కిలి మక్కువ.

సుప్రసిద్ధాంధ్ర సత్కవి, సంఘసంస్కారప్రియుడు, ఆర్య సమాజము వారికి జీవగఱ్ఱ, భగవద్భక్తుడునై యుండిన శ్రీ. ఆదిపూడి సోమనాథరావుగారు వీరికి మిక్కిలి సన్నిహితులు. శ్రీ. సోమనాథరావుగారు, తాము రచించిన "శ్రీకృష్ణదేవరాయ చరితము" అనుకావ్యమును శ్రీ.రాజా నాయని వేంకట రంగారావుగారికి అంకితమిచ్చి, వీరి గౌరవాదర బహుమానములకు పాత్రమైరి.

శ్రీ. కోదాటి గోపాలరావుగారు శ్రీ. నాయనివారికి ఆస్థానకవులైయుండి అనేక సందర్భములలో వీరిని కవితాగానముచే ఆనంగపరచుచుండిరట. దురదృష్ట వశమున గోపాలరావుగారి రచనలేవీ మనకు లభింపలేదు. శ్రీ మునగాల రాజాగారి వితరణము బహుముఖముగా ప్రసరించి ఆంధ్రదేశమునందలి సంస్థలకు, కవులకు, పండితులకు తోడ్పడినది. ఆదిపూడి సోమనాథరావుగారిని బహుళముగా సత్కరించుటయేగాక వారి జీవితమును భీమాచేయించి ప్రీమియములు తామే చెల్లించి భీమాద్రవ్యము వారికి చెందునట్లు చేసిరి. శ్రీ. గొల్లపూడి సీతా రామశాస్త్రిగారు ప్రకటించుచుండిన వేద గ్రంథములకు ధనసహాయముచేసిరి. గ్రంథాలయమునకు పుస్తకములు కొనియిచ్చుట, కవుల కావ్యముద్రణమునకు ధనమునిచ్చుట, విద్యార్థి వేతనములిచ్చుట మొదలయినవియే కలిమికి తగిన వ్యయములని భావించి యెన్నో గుప్తదానములు చేసిన ఉదారహృదయులు శ్రీ రాజా నాయని వేంకట రంగారావుగారు. (ఆంధ్ర విశ్వవిద్యాలయంలో రసాయనశాస్త్రం చదివే విద్యార్థులకు స్కాలర్‌షిప్పులు ఏర్పాటుచేసినారు.)

దేశభక్తి, దేశాభిమానము, బంధుప్రీతి, భాషాసేవ, కవిపండిత పోషణము, దీనజనోద్ధరణము మొదలయిన సుగుణముల కాలవాలమైయున్న వీరి హృదయముపై క్రీ. శ. 1906లో వచ్చిన "వందేమాతరం" ఉద్యమ ప్రభావం యెంతగానో ప్రసరించినది. బిపిన్‌చంద్రపాల్ ఉపన్యాసాలకు ముగ్ధులై పోయినారు. తాము కాంగ్రెసులో మెంబరుగా చేరక పోయినప్పటికిని (అది ఆనాడు రాజద్రోహముకనుక), పరోక్షముగా కాంగ్రెసువాదులును, గాంధీజీ భక్తులును అయినారు. తత్ఫలితముగా మహాత్మాగాంధి ఖద్దరు ప్రచారార్థమై క్రీ. శ. 1929లో ఆంధ్రప్రాంతమునకు వచ్చినప్పుడు వీరు ఖద్దరు నిధికి వెయ్యిరూపాయలు సమర్పించినారు. అంతేగాక తమ పరగణా ముఖ్య పట్టణమైన నడిగూడెములో ఒక ఖద్దరు కర్మాగారం నిర్మించి, రాట్నములు మొదలయినవి సమకూర్చి నూలుతీయించి ఖద్దరుదారమును ముఖ్యకేంద్రములకు పంపించునట్లు యేర్పాటుచేసినారు. ఆవిధముగా కొందరు కార్మికులకు జీవనోపాధిని కలిగించినారు. ఆనాడు ఆంధ్రదేశమునందు ముఖ్యముగా పేర్కొనదగియుండిన కాంగ్రెస్, జస్టిస్ పార్టీలలో దేనితోను సాక్షాత్సంబంధములేదు కాని కాంగ్రెస్ పార్టీపై అభిమానముండెను. కాంగ్రెసు నాయకులకు పరోక్షముగా అపారమైన ధనసహాయం, చేయూత ఇతర రూపమయిన సహాయంచేస్తూ

ఉండినారు. జస్టిస్ పార్టీతో మాత్రం ఏలాంటి సంబంధంగాని, దానిపై సాను భూతిగాని వీరికి లేకుండినది. ఆంధ్రదేశమునందలి మహానాయకులలో ఎక్కువ మంది వీరి సహచరులై యుండిరి. శ్రీ. అయ్యదేవర కాళేశ్వరరావుగారు మునగాల జమీందారుగారి రాజకీయవ్యవహారములు సరిదిద్దు న్యాయవాదులుగా నుండుటయేగాక, తాము నడిపిన రాజకీయోద్యమునకు వీరి తోడ్పాటు నెంతగానో పొందినారు. ఉభయులును కలిసి అనేక దేశహిత కార్యక్రమములను నడపినారు. అదే విధముగా అనేక దేశహిత కార్యములయందు వీరి సహకార ధన సహాయాదులు పొందిన వారిలో విద్యావేత్తగా, గ్రంథాలయోద్యమ పితామహుడుగా పేర్కొనదగిన శ్రీ గాడిచెర్ల హరి సర్వోత్తమరావుగారు, మహిళాభ్యుదయమునకై, గాంధీజీ ఆదర్శములకై ధర్మపత్ని శ్రీమతి. లక్ష్మీబాయి గారితో సహ తమజీవితమును అంకితమొనర్చియుండిన శ్రీ. ఉన్నవ లక్ష్మీనారాయణ పంతులుగారు, జాతీయ పతాకను కాంగ్రెస్సుకు నిర్మించియిచ్చిన శ్రీ. పింగళి వెంకయ్యగారు, ఆయుర్వేదశాస్త్రమున అపారపాండిత్యము కలిగి ఉత్తమ భిషగ్వరులుగా ప్రసిద్ధి చెందిన శ్రీ. ఆచంట లక్ష్మీపతిగారు. "ఆంధ్ర విజ్ఞాన సర్వస్వం" మొదలయిన అనేక గ్రంథములురచించి, ఇతరులను ప్రోత్సహించి, గ్రంథాలయములు, గ్రంథమాలలు నిర్వహించి ఉత్తమ విద్యావేత్తగా ఆంధ్రుల కృతజ్ఞతాంజలు లందుకొన్న దివాన్ శ్రీ. కొమఱ్ఱాజు వేంకట లక్ష్మణ రావుగారితోను, బహుగ్రంథ నిర్మాతలై, కవులై, కార్యదీక్షులై, ఆర్యసమాజాది ప్రజాహిత సంస్థలకు పట్టుగొమ్మయై ఉండిన శ్రీ పండిత ఆదిపూడి సోమనాథ రావుగారితోను, తెలంగాణా ప్రథమ వైతాళికుడని చెప్పదగిన శ్రీ రావిచెట్టు రంగారావుగారితోను, తెలుగు సంస్థానములు, తెలుగువారి దేశముఖ్ దేశ పాండ్యారుసుములు నిజాం కబంధహస్తముల పాలుకాకుండ కాపాడి, భాగ్యనగరమునందలి అనేక సంస్థలకు ఆశ్రయమైయుండి, ప్రజలకు పెన్నిధియని చెప్పదగియుండిన శ్రీ రాజాబహద్దర్ వేంకటరామారెడ్డి నగరపోలీస్ కమీషనర్ గారితోను, భాగ్యనగరమునందలి సర్వాంధ్ర సంస్థలకు పట్టుగొమ్మయై, తన జీవితమును ప్రజాహితకార్యముల కంకితముచేసియుండిన "ఆంధ్ర పితామహ" శ్రీ. మాడపాటి హనుమంతరావు గారితోను, వరంగల్లునగరమున సుప్రసిద్ధ జాతీయవాదులై యుండిన మాదిరాజు రామకోటీశ్వరరావుగారితోను, సుప్రసిద్ధాయుర్వేద మహాపండితులు, కవి, శతావధాని అగు శ్రీమాన్ వేదాల తిరుమల

రామానుజస్వామిగారితోను, ఆంధ్ర జాతీయ కళాశాలాస్థాపకులు శ్రీ కోపల్లె వేంకట హనుమంతరావుగారితోను, భారతదేశమున సుప్రసిద్ధ విద్యావేత్తయై, ఆంధ్ర విశ్వవిద్యాలయోపాధ్యక్షుడై, ఉత్తమ వక్తయై, రాజకీయ విజ్ఞాన ధురంధరుడై, తెనుగు సాహిత్య విమర్శకు, తద్గ్రంథరచనకు శ్రీకారము చుట్టిన శ్రీ. కట్టమంచి రామలింగారెడ్డిగారితోను, శ్రీమునగాల రాజాగారికి సన్నిహిత సంబంధముండివది. అనేక ప్రజాహిత సారస్వత కార్యక్రమములందు వారు వీరికిని, వీరు వారికిని సహచరులై యుండిరి. పైన పేర్కొన్నవారేకాక ఎందరో నాయకులతోను, ఎందరో కవి పండిత గాయకులతోను వీరికి సన్నిహిత సంబంధముండిది.

దేశస్వాతంత్ర్య, దేశాభివృద్ధి, భాషాసేవాది రంగములలో అసాధారణ కృషిని చేసిన మహాపురుషులకు సహచరులై, సహాయకులై యుండిన వీరికి, దేశస్వాతంత్ర్యాభిలాష, దేశహితైక కార్యదీక్ష, సాహితీ సంస్కృతుల పరిరక్షణ, పరిపోషణములందు మక్కువ ఉండుట సహజము. కనుకనే శ్రీ. నాయని వేంకట రంగారావుగారు తమమునగాలపరగణాలో పరగణాభివృద్ధికి కావలసిన పథకములను వేసి నిర్వహించిరి. పాఠశాలలు పెట్టించిరి. పశుగణ సంక్షేమాదులు సూచించి వ్యవసాయము నభివృద్ధిపరచి రైతు జనమునకు ప్రోత్సాహమును గలిగించిరి. దుర్వ్యసనములు, దురాచారములు, అలవడని పవిత్ర జీవితము గలవారగుటచేత తమకు భగవంతుడు ప్రసాదించిన సంపదను సత్కార్యములకు, సజ్జనులకు, బంధుప్రియులగుటచేత బంధువులకు, గ్రంథాలయములకు, గ్రంథముద్రణమునకు, ప్రజాహితకార్యములకు వినియోగించి అందరికిని ప్రీతిపాత్రులై యుండిన ధన్యతమజీవులు. జమీందారులలోను, సంస్థానాధీశులలోను, సంపన్నులలోను ఇట్లు సత్కార్య నిర్వహణమునకై తమ ధనమును వ్యయించినవారు మన దేశమునందు వ్రేళ్ళపై లెక్కింపదగినవారుగా నుండిరి.

బహుశ, శ్రీమునగాల జమీందారుగారు సంస్కృత పండితులుగూడనై యుండిన కారణముచేత, "దానం, భోగో, నాశః, తిస్రోగతయోభవంతి విత్తస్య, యోనదదాతి, న భుంక్తే తస్య తృతీయా గతిర్భవతి" అన్న నీతివాక్యమును, "ఆపదర్థం ధనం రక్షేత్. శ్రీమతా మాపదః కుతః? సా చేదపగతా లక్ష్మీః? సంచితార్థోపి నశ్యతి" అన్న భోజరాజ సంభాషణశ్లోకమును హృద్గతము చేసుకొని యుండిరేమొ! (నిలువచేయబడిన ధనము ఖర్చుగుటకు, దానము,

భోగము అనగా తాను అనుభవించుట, నాశము అనగా తనకుగాని తనవారికిగాని లేకుండ పోవుట అనునవి మూడేమార్గములు. కనుక ఎవడైతే తన ధనమును దానము చేయక, తాననుభవింపక వదలునో వాని ధనమునకు నాశముతప్పదు అని మొదటి శ్లోకమున కర్థము. ఇక రెండవ శ్లోకం భోజరాజునకును అతని మంత్రికిని జరిగిన ఉత్తరప్రత్యుత్తరరూపము. అందరికిని అక్షరలక్షలిచ్చి అమితముగా వ్యయముచేయుచున్న భోజునికి హితము చెప్పదలచి, అతని మంత్రి "ఆపదర్థం ధనం రక్షేత్" అని భోజుని పడకగదికి ఎదురుగానున్న గోడపై వ్రాసియుంచెనట. నిద్రలేచి చూచిన భోజుడు దీనిని నాకోసమే యెవరో వ్రాసియుండవచ్చునని తలచి, "శ్రీమతాం ఆపదః కుతః" అని దానిక్రింద వ్రాసెనట. అనగా శ్రీమంతులకు ఆపద లెక్కడనుండి వచ్చును? అని అర్థం. మరునాడు మంత్రిచూచి ఆశ్చర్యపడి, ఇతనికింతగర్వమా! అనుకొని, "సా చేద పగతాలక్ష్మీః" అని మరల వ్రాసెనట. అనగా, ఆ లక్ష్మి, ఆ శ్రీమంతత్వము తొలగినప్పుడేమి చేయుదువు? అని అర్థం. మరునాడు మళ్లీ భోజుడుచూచి, "సంచితార్థోఽపి నశ్యతి" అని సమాధానము వ్రాసెనట. ఆ లక్ష్మి తొలగిపోయిననాడు రావలసిన ధనము రాకపోవుటయేకాదు, ఉన్నదీ దాచినదీ అన్నీ నశించిపోవును అని భావము. మరునాడు మంత్రి ఆ సమాధానమును చూచుకొని సిగ్గుపడి, తానే ఈ శ్లోకభాగములు వ్రాసియుంచినట్లు భోజునితో చెప్పి ఇక మీ యిష్టము వచ్చినట్లు దానము చేయవచ్చునని చెప్పిపోయెనట) విజ్ఞులు, విశేషజులు తమ జీవితమును సార్థకము చేయుటకై సత్కార్యము లాచరించుట ప్రపంచమున, అందులోను భారత దేశమున, చిరకాలమునుండి వచ్చుచున్న సంప్రదాయము. ఆ సంప్రదాయమును పాటించినవారే శ్రీ. రాజా నాయని వేంకటరంగారావు బహద్దరుగారు.

శ్రీ మునగాల రాజాగారు ఆంధ్రతెలంగాణముల సమైక్యమునకు సేతువు వంటివారై యుండి రనవచ్చును. వారు జన్మించినది వరంగల్లు మండలము. దత్తపుత్రుడుగా వెళ్లి జమీందారుగా ప్రసిద్ధి చెందినది కృష్ణామండలము. తన కుమార్తెలలో ఇద్దరిని నల్లగొండ జిల్లాలోని బాబాసాహెబ్ పేట దేశముఖులైన బారిష్టర్. రాజగోపాలరెడ్డిగారికిని, శ్రీ ఎస్. ఎన్. రెడ్డిగారికిని యిచ్చి వివాహముచేసిరి. ఒకరిని మహబూబ్ నగర్ జిల్లా వనపర్తి సంస్థానాధీశ్వరుడై యుండిన శ్రీ జనుంపల్లి కృష్ణదేవరాయ బహిరీ బల్వంత్ మహాభూపాలుగారికిని ఒస

గిరి. ఇక సారస్వత సాంఘిక సేవాదులను ఉభయప్రాంతములందును, ఉభయ ప్రాంతములకు రాజధానులై యుండిన భాగ్యనగర, చెన్నపట్టణములందును సాగించిరి. తమ సంతానమున కాంధ్రాంగ్ల పారసీక భాషలను నేర్పించిరి. ఆ ప్రాంతము, ఈప్రాంతము, వారు, వీరు, అను భేదభావములేక తమ ఆధిపత్యము గల సంస్థలు ఉభయ తారకములగునట్లు తీర్చిదద్దిరి. తమ సన్నిహిత బంధువులకుగూడ నట్టి యుపదేశములనే యిచ్చి, వారికి సంబంధించిన వైవాహికాది కార్యకలాపములలో తమకు సంబంధమున్నప్పుడు అట్టి యభేద భావమునే ప్రకటించిరి. ఉదాహరణమునకు వీరు వృద్ధులై, పుత్రపౌత్ర దౌహిత్ర సంపదతో విలసిల్లుచున్న సమయమున జరిగిన ఒక సన్నివేశమును మనవిచేయుదును.

ప్రస్తుతమున పార్లమెంటు మెంబరుగానున్న శ్రీ. రాజా రామేశ్వరరావుగారు ఇటీవల జరిగిన సంస్థావముల విలీనీకరణము వరకును సర్వాధికారములతోను ఉండిన వనపర్తి సంస్థానమునకు అధిపతులైయుండిరి. వీరు శ్రీ కృష్ణదేవరాయ మహాభూపాల్ రాణి సరళాదేవిగార్లకు కుమారులు. శ్రీమునగాల జమీందారు రాజా వేంకట రంగారావుగారికి దౌహిత్రులు. శ్రీ రామేశ్వరరావుగారు శైశవము నందున్నప్పుడే శ్రీరాజా కృష్ణదేవరాయలవారు దివంగతులైనారు. అందువలన సంస్థానము కోర్టఫ్‌వార్డ్సువారి స్వాధీనమునందుండినది. శ్రీమతి రాణీ సరళాదేవిగారు, తండ్రిగారైన నాయని వేంకట రంగారావుగారి సలహా ప్రకారం, శ్రీ. రాజా రామేశ్వర రావుగారికి విద్యాబుద్ధులు నేర్పించినారు. వారికి మైనరుగా నున్నందున సంస్థానాధి పత్యమును శ్రీ నిజాంప్రభువు క్రీ. శ. 1940 తరువాత అప్పగించినారు. ఆ సందర్భమున శ్రీ రాజా రామేశ్వరరావుగారికి వనపర్తి పట్టణమునందు పట్టాభిషేకమును జరిపించినారు. "సవైరాజా బహిరీ బల్వంత్ మహాభూపాల్" ఇత్యాది బిరుదములతో శ్రీ. రాజా రామేశ్వరరావుగారికి సంప్రదాయము ననుసరించి పట్టాభిషేకము జరిగినది. ఆ పట్టాభిషేకకార్యకలాపమును నడిపించిన బంధువర్గములో శ్రీ నాయనివేంకట రంగారావుగారు ముఖ్యులు. వనపర్తి రాజప్రాసాదప్రాంగణమునందు వేయబడిన విశాలమైన పట్టాభిషేకమంటపము. అక్కడ నూతన సంస్థానాధిపతికి జరిగిన సత్కార గౌరవములు, భట్టుమూర్తుల కైవారములు, సైన్యాధిపతి ప్రభృతుల వందనములు, కట్నములు, కానుకలు మొదలయిన యుత్సవ విశేషములనన్నింటిని పూర్వరాజన్య సభామంటప మర్యాదలతో నడిపించినారు. పౌర జానపద

బహుమాన స్వీకారములతోపాటు విద్వత్కవి పండితాశీర్వాదములను దర్బారు హాలులో స్వీకరించు నేర్పాటునుగూడా చేయించినారు. ఈ ప్రాంతమువారు, ఆ ప్రాంతమువారు అను భేదములేక పలువురు కవిగాయకులు, విద్వాంసులు వచ్చి యుండిరి. ఆ సభాసన్నివేశము పూర్వకాలపు రాజుల కొలువుకూటములను స్మరింపజేసినది. అప్పుడు పాల్గొని ఆశీర్వదించిన వారిలో శ్రీ. జొన్నలగడ సత్యనారాయణమూర్తి, శ్రీ. కురుగంటి సీతారామభటాచార్యులు, శ్రీ. నరిపెల్లి విశ్వనాథశాస్త్రి, శ్రీ. సన్నిధానం సూర్యనారాయణశాస్త్రి, శ్రీ. మేడవరం రామ బ్రహ్మశాస్త్రి, మొదలయినవారు పేర్కొనదగినవారు. వీరుకాక శ్రీ తెల్కపల్లి రామచంద్రశాస్త్రి, శతావధాని గోపాలుపేట రామచంద్రాచార్యులు, శ్రీ. పెరవలి లింగయ్యశాస్త్రి ప్రభృతులైన వనపర్తిప్రాంతీయులైన కవి పండిత గాయకులు వచ్చియుండిరి. వీరందఱిని వారివారి ప్రాభవప్రాచుర్యముల ననుసరించి నూట పదహార్లతోను, అర్ధనూటపదహార్లతోను సత్కరించినారు. ఈ కవి పండిత గాయకసముదాయమును ఆహ్వానించి, సత్కరించిన కార్యక్రమములో శ్రీ. మున గాల రాజాగారిదే ముఖ్యపాత్ర. వారే దీనికి దోహదము కలిగించినారు.

అదేవిధముగా తమ కుమారులయు, కుమార్తెలయు వివాహములు జరిగినప్పుడు తమ బంధువులతోపాటు తమ జమీందారీ గ్రామములయందలి ప్రముఖులను, రైతులను, పట్వారీలను ఆహ్వానించి వారందరికిని తగిన వసతి సౌకర్యములు, విందులు ఏర్పాటు చేయుటయే కాక విద్వాంసులను, కవి పండితులను ఆహ్వానించి సత్కరించేవారట. బంధువులకంటే యెక్కువ ఆదరణ మును, పరామరికను ఇతరుల విషయమున చూపేవారట. ముఖ్యముగా కవి పండితులను తమ పంక్తిలో భోజనము చేయనివారిని పలుసార్లు "మీకు సౌక ర్యముగా నున్నదా? ఏర్పాట్లు సరిగా ఉన్నాయి కదా?" అని అడిగేవారట ఇది ఆనాడు వీరి విందులో పాల్గొన్న ఒక అనుభవశాలి శ్రీ. నాయని వేంకట రంగారావుగారి రెండవ కుమార్తె వనపర్తిరాణి, శ్రీమతి. జె. సరళాదేవిగారి వివాహవిషయము ప్రస్తావనకు రాగా చెప్పినమాట. ఇట్టి పరామరికనే తమకు బాధ్యతగల సాంఘిక, సారస్వత సంస్థల ఉత్సవాలు జరుగునప్పుడు వారు చూపేవారట. వారు ప్రసన్న హృదయులు, బంధుప్రీతి, మిత్ర వాత్సల్యము గలవారు. ఇట్లు అన్ని రంగములందును విజయవంతమైన జీవితమును గడపి,

అన్ని విధముల తనిసి తనియించిన శ్రీ. మునగాలరాజా నాయని వేంకట రంగారావు బహద్దరుగారు క్రీ. శ. 1958వ సంవత్సరమున దివంగతులైరి.

తెలుగువారికి పెన్నిధులవంటి శ్రీకృష్ణదేవరాయాంధ్ర భాషానిలయ స్థాపనము, విజ్ఞానచంద్రికా గ్రంథమండలి స్థాపనము, ఆంధ్రవిజ్ఞాన సర్వస్వ నిర్వహణము, ఆంధ్ర విశ్వవిద్యాలయ, నారాయణగూడా బాలికోన్నత పాఠశాలా, శారదా నికేతనాదులకు భూరివిరాళము, ఆయుర్వేదము, చేనేత వస్త్రపరిశ్రమ మొదలయినవాని పోషకత్వము, లక్ష్మణరాయ పరిశోధకమండలి స్థాపనము, తెలంగాణా శాసనముల ముద్రణము, పండిత సత్కారము, కవిపోషణము మొదలయిన ప్రజాహిత కార్యములను ప్రత్యక్షముగాను, పరోక్షముగాను నిర్వహించిన శ్రీ. మునగాలరాజాగారు మనకు చిరస్మరణీయులు. వారి యీ శత జయంత్యుత్సవము వారియెడల మనము చూపుచున్న కృతజ్ఞతాచిహ్నము; చంద్రునికి నూలుపోగువలె వారికి మనము అర్పించుచున్న శ్రద్ధాకుసుమాంజలి.



# నాయని వెంకట రంగారావుగారి భాషాసేవ

— ఆచార్య తూమాటి దొణప్ప

అది 1949వ సంవత్సరం-డిసెంబరు నెల—వాల్తేరులోని ఆంధ్ర విశ్వవిద్యాలయావరణలో ఆంధ్రాభ్యుదయోత్సవ సంరంభం-సభాస్థలం ఆరుబయలు రంగస్థలం. అనాదిగా ఆంధ్ర సంస్కృతి బహుముఖ వికాసానికి దోహదం చేసిన వివిధ రాజవంశాల, మహాపురుషుల, మహాకవుల పేర్లతో సింహద్వారం నుంచి సభాస్థలం దాకా అనేక ద్వారాలు నిర్మించబడి వున్నాయి. సభాస్థలమంతటా నిస్తులమైన ఆంధ్రప్రశస్తిని ప్రకటీకరించే సూక్తి పతకాలు చూడ ముచ్చటై వున్నాయి. సభామండపమంతా విశ్వవిద్యాలయంలోని వివిధ శాఖాధ్యక్షులతోను, అధ్యాపకులతోను, విద్యార్థులతోను, పరిశోధక విద్యార్థులతోను, ఆహూతులైన పురప్రముఖులతోను కిటకిట లాడుతున్నది.

మంగళవాద్యాలు మోగుతుండగా ఒక మహావ్యక్తి పై కప్పులేని మోటారు కారులో ఊరేగింపుగా వస్తున్నాడు. గతంలోని అనేక యుగాలు దాటి వస్తున్నట్లుగా ఒక్కొక్క ద్వారమే దాటి వస్తున్నాడు. మొట్ట మొదటిది సాతవాహన సింహద్వారం. ఉరేగింపు ఆ ద్వారం దాటుతుండగానే సాతవాహన ప్రభువుల కీర్తి గీతికలు నినదించాయి. ఆ వెంటనే చాళుక్య ద్వారం; తెలుగువాణి గజ్జె కట్టింది. నన్నయ ద్వారం, ఆ తర్వాత కాకతీయ ద్వారం, తిక్కన ద్వారం, కృష్ణరాయల ద్వారం, రఘునాథరాయల ద్వారం. ఇలా ఆంధ్ర ప్రశస్తి పతకాలు తిలకిస్తూ వివిధ ద్వారాలూ గడచి, వైదిక మంగళాశీర్వచనాలతో వర్షీయాంసుడైన ఆ మహావ్యక్తి భువనవిజయ సభా ప్రాంగణంలో అడుగు పెట్టారు. సభాస్థలినీ, సభాస్తారుల్నీ ఒక్కసారి సింహావలోకనంచేసి హర్షధ్వానాల మధ్య పూర్వాంధ్ర ప్రశస్తి పూర్వకాలైన ద్వారాదుల నిర్మాణానికి తన హర్షం ప్రకటించాడు. కాని అద్దంకి, కందుకూరు, కొండవీడు, కోరుకొండ, రాజమహేంద్రవరాలు రాజధానులుగా మధ్యాంధ్ర మహీమండలాన్ని ఏక సితాతపత్రంగా పరిపాలించి ప్రబంధ పరమేశ్వరులను, కవిసార్వభౌము

లను, కవిలోక చక్రవర్తులను పోషించి ఆంధ్ర భారతికీ, గీర్వాణ గిరాం సరస్వతికీ కనకాభిషేకాలు కావించిన సర్వజ్ఞ చక్రవర్తి బిరుద లాంఛనులైన రెడ్డిరాజుల ప్రశస్తి కానరాక పోవడం ఆయనకు ఆశ్చర్యం కలిగించింది. 'ఇది భువన విజయమా? మరి, మహిత మహిమాన్వితమైన త్రైలోక్య విజయమేదీ?' అని తన నిసర్గ వ్యంగ్య వైభవ ధోరణిలో చమత్కరించారు ఆ మహావ్యక్తి. ఆ మహావ్యక్తియే ఆనాటి సభా ప్రారంభకులు. ఆయనే కులపతిగా ఆంధ్ర విశ్వ విద్యాలయాన్నీ, సర్వసమర్థక కులపతిగా ఆంధ్ర సాహిత్యోపాసక ప్రపంచాన్నీ అప్రతిహతంగా చిరకాలం పరిపాలించిన డాక్టర్ కట్టమంచి రామలింగారెడ్డిగారు.

అయితే యిదంతా అప్రస్తుత ప్రశంస అనుకోండి. శ్రీరెడ్డిగారి చమత్కార ప్రశ్నకు సభా నిర్వాహకులిచ్చిన సమాధానం మాత్రమే ప్రస్తుతం.

'ఈ ద్వారాలు, ఈ అలంకారాలు-అన్నీ పూర్వ స్మృతి చిహ్నాలుగా నిర్మించినవి. ఈ భువనవిజయం అలనాటి రాయల రాజ్యంనాటి స్మృతి సంకేతం. ఇక్కడ వాస్తవంగా ప్రవర్తిస్తున్నది అవక్రవిక్రమ ప్రతిభులైన రెడ్డిరాజుల త్రైలోక్య విజయమే. రెడ్డిరాజుల ప్రభ, ప్రతిభ, స్మృతిపథంలోనివి కావు; ప్రత్యక్షాలే కనుక వాటిని అలంకారాదిక రూపంలో ప్రత్యక్షీకరించడం జరగలేదు. అక్కడ మద్రాసు రాష్ట్ర ప్రధానమంత్రిగా ఓమాండూరు రామస్వామి రెడ్డియారు: ఇక్కడ ఆంధ్ర విశ్వకలా పరిషత్కులపతులుగా తమరు: ఇది భువన విజయంలోని త్రైలోక్య విజయం' అని సవినయంగా ఆనాటి కార్యకర్తలిచ్చిన జవాబు కేవలం సమయోచితమైనదే కాదు; సవితర్కమైనదే కాదు, సత్య సమ్మతమైనది కూడా ఈ గడసరి జవాబులోని సమయస్ఫూర్తికి హసన్మూర్తియైన ఆ సహృదయ చక్రవర్తి తెలుగుల కీర్తికిరీటానికి కలికితురాయి.

సంస్మరణ సభ అనగానే పైన పేర్కొన్న పాతికేళ్ళ నాటి ఘట్టం కళ్ళ ముందు కనిపిస్తున్నది. ఒకనాడు తిరుపతి వెంకటకవుల కవితా జైత్రయాత్రలో కళ్యాణ కటకాలైన గద్వాల, దోమకొండ, వనపర్తి ఇత్యాద్యనేక త్రైలోక్య విజయాలను పోలిన సంస్థానాలలో మునగాల ఒకటి. ఈనాటికీ సాంఘిక రాజకీయ సాంస్కృతికాది రంగాలలో త్రైలోక్య విజయ సంప్రదాయమే పరం

పరాభివృద్ధిగా కొనసాగుతున్నది. ఈ సభావేదికే దీనికొక సాక్ష్యం. ఆంధ్ర ప్రదేశ్ రాజ్యపాలకులైన మాన్యశ్రీ ఓబులరెడ్డిగారు, నేటి సంస్మరణ సభా పాలకులూ, సాహిత్య రాజ్యపాలకులూ అయిన మాన్యశ్రీ గోపాలరెడ్డిగారు దీనికి ప్రత్యక్ష సాక్షులు.

అయితే ఇక్కడ 'రెడ్డి' శబ్దం ఇప్పటి పరిమితార్థంలోకాక విపులార్థంలో, చారిత్రికమైన ప్రపంచార్థంలో గ్రహించడం సముచితమూ, సమంచితమూ. రాజ్యపాలకులు రాష్ట్రకూటులు; గ్రామాధికారులు గ్రామకూటులు. రాష్ట్రకూటులు, రట్టడ్లు, రడ్లు అయినట్లుగానే గ్రామకూటులు గావుండ, గౌడలుగా పరిణమించారు. ఇవి రెండూ వృత్తి వాచకాలనీ, ఉద్యోగ సూచకాలనీ చరిత్రకారుల నిర్ణయం.• క్షాత్రపాలనం, క్షేత్రపాలనం, ప్రధానవృత్తులుగా, పరంపరా ప్రవృత్తులుగా గల ఒకే తెగవారు ప్రస్తుతః కాపులు, అంటే పంటలను ప్రజలను కాపాడేవారు. కాచు, కాపు అంటే క్రమంగా రక్షించు, రక్షణ అని అర్థాలు. కాపుదనం, కాపుదల, పాలికాపు, పెద్దకాపు మొదలైన పదాలన్నిటా ఈ అర్థమే స్ఫురిస్తుంది. ఇది కాకతీయుల కాలంనాటి తెలుగుదేశపు సాంఘిక వ్యవస్థ. సాహిత్యంలోనూ, శాసనాలలోనూ ఈ ప్రతిపాదనను సమర్థించే సాక్ష్యాలు అనేకం లభిస్తున్నాయి. ద్విముఖమైన రక్షణయే ముఖ్యలక్షణంగా కలిగిన ఈ సజాతీయ సమష్టివర్గంవారితో కాకతీయ పాలకులు సంబంధ బాంధవాలు నెరపినట్లు రుజువులు కోకొల్లలు. అయితే కాలక్రమంలో అవలంబించిన వృత్తి పరంగాను, నివసించిన దేశపరంగాను ఈ వర్గంలో ఏకదేశాలైన విభిన్న శాఖలవారికి పరస్పర వ్యావర్తకాలూ, కులసూచకాలూ అయిన పేర్లు ఏర్పడ్డాయి. 'రడ్డి' 'రద్ధి' అంటే దేశీప్రాకృత భాషలో ప్రధానుడు, గ్రామాధికారి అని అర్థం.* అనంతర కాలంలో 'రడ్డి', రెడ్డిగా మారింది. వారు వీరూ భావించినట్లుచా 'రెడ్డి' సంస్కృత 'రాట్' శబ్ద భవంకాదు. కాపుదనానికి తోడు గ్రామాధికారులుగా అదనపు బాధ్యతలను నిర్వహించి, తదనుగుణమైన అధికారాలను చలాయించిన కాపులు 'రెడ్లు' అనే శాఖగా వ్యవహరించబడ్డారు. కమ్మనాటిలో, లేక కమ్మరాష్ట్రంలో ప్రధానంగా నివసించిన

• కుందూరి ఈశ్వరదత్తు, రెడ్డి పదోత్పత్తి వికాసము; రెడ్డిసంచిక, రాజమహేంద్రవరము, 1947. పుట. 109.

* 'రద్ధివరే', 'రద్ధీప్రధానం', VII–2. హేమచంద్రుని దేశీనామమాల

కాపులు కమ్మవారైనట్లు చెప్పవచ్చు. 'కమ్మ' అంటే నది అని కూడా ఒక అర్థం. 'గుండ్లకమ్మ' లోని 'కమ్మ'కు ఇదే అర్థం. నదీ పరివాహ భూములలో కోటేరు పట్టి, నేలతల్లిని నమ్మి బంగారు పంటలు పండిస్తూ, పనిబడినప్పుడు కటారి చేపట్టిన ఒకానొక కాపుల శాఖవారే నేటి కమ్మవారని నా ఊహ. 'వెళ్ళాణ్మై''వెళ్ళామై', 'వేళాణ్మై' * అంటే వ్యవసాయమనే అర్థంకల తమిళ పదాలతో శబ్దార్థాలలో సారూప్యసాజాత్యాలు కలదే,మన 'వెలమ' పదం. తమిళంలో 'వెళ్ళాళన్'అంటే రైతు అని అర్థం.† వెలమవారు కూడా తక్కిన శాఖల వారి లాగానే ఆదిలో హాలికులు; ఆ పిమ్మట ఆయుధోపజీవులు; ఇట్లు వెలమ వారు కూడా రెండందాలా కాపులు. అనాదినుంచీ తెలుగునేలకు సీమితమైన కాపులు 'తెలగా' శాఖీయులుగా వాడుకపడ్డారు. సీమానామం మూలంగా కాక, కేవలం వృత్తిధర్మంచేత వ్యవహరించబడ్డవారు వట్టి 'కాపులు' గా మిగిలారు.

వృత్తి ధర్మ నిరూపకాలైన రెడ్డి, నాయడు అన్న పట్టపు బిరుదులు తెలుగుదేశంలోని కమ్మ, కాపు, తెలగ, రెడ్డి, వెలమతెగలవారికి సాముహికంగా సర్వసామాన్యంగా చెల్లుతున్నవని చెప్పడానికిగల సాక్ష్యాలను బండ్లకెత్తవచ్చు. కమ్మవారి గృహనామాలలో కొమ్మారెడ్డి, తమ్మారెడ్డి, వాసిరెడ్డి అన్నవీ, వ్యక్తి నామాలలో నరసింహారెడి, ముసలప్పరెడ్డి, వెంకటరెడ్డి, సంజీవరెడ్డి మొదలైనవీ కనిపిస్తాయి. కాపులలో కసిరెడ్డి, జనపరెడ్డి అన్న గృహనామాలు, కూర్మా వెంకటరెడ్డిలాంటి వ్యక్తినామాలు ఉన్నాయి. వెలమవారిలో చెవిరెడ్డి, వాసిరెడ్డి వంటి ఇంటిపేర్లూ, ముక్కంటి రెడ్డి, రామలింగారెడ్డి, వీరభద్రారెడ్డి, హేమాద్రి రెడ్డివంటి వ్యక్తి నామాలు లేకపోలేదు. వెలమ దొరలైన బొబ్బిలి, వెంకటగిరి మున్నగు జమీందారుల కూటస్థులకోవలో 'రెడ్డి' అన్నది ఉత్తరభాగంగా గలిగిన వ్యక్తినామకులు చాలమంది కనిపిస్తారు. వీరి మూలపురుషుడుగా సంభావితుడైన చెవిరెడ్డికి బేతిరెడ్డి, బేతాళనాయడు అన్న వ్యవహార నామాలున్నట్లు చరిత్రకారుల కథనం ♦ రెడ్ల గృహ నామాలలోను, వ్యక్తినామాలలోను 'రెడ్డి'

---

* Tamil Lexicon, Vol. VI, P. 3793

† ibid, P. 3843

♦ వెలయఁ బిల్లలమఱ్ఱి బేతాళనాయఁ డే ఘనవంశమున కాదికర్త యయ్యె....
అట్టి మేటి రేచెర్ల గోత్ర వెల్గొటి వంశమందు....' (గోపీనాథము వెంకట కవి, శిశుపాల వధ మహా కావ్యావతారిక, 28.

పదానికి గల వ్యాప్తి సరేసరి. ఇక నాయడు/నాయుడు శబ్దం, పైన పేర్కొన్న అన్ని తెగల గృహనామాలలోను, వ్యక్తినామాలలోను ప్రచురంగా కనిపిస్తుంది. ఇది నాయక శబ్ద వికృతియైన 'నాయఁడు'కు సంబంధార్థక రూపం.

ఈ కాపువర్గాలవారి గోత్ర నామాలలోసైతం ఇలాంటి సామ్యమే గోచరిస్తుంది. కమ్మవారైన చల్లపల్లి జమీందారులూ, పద్మనాయక వెలమలైన బొబ్బిలి, వేంకటగిరి జమీందారులూ రేచర్ల గోత్రం వారే. పైడిపాల గోత్రం రెడ్లలోనూ, కమ్మవారిలోనూ, నేటి కాపువారిలోనూ కనిపిస్తుంది.

ప్రాయికంగా నాటికీ నేటికీ పై తెగలవారే విశాలాంధ్రదేశంలో క్షేత్రాన్ని, క్షాత్రాన్నీ పరిపాలించడంలో ప్రముఖ భూమికను నిర్వహిస్తున్నారనడంలో విప్రతిపత్తి లేదు. సర్వజ్ఞ బిరుదాంచితుడైన రేచెర్ల సింగమ నాయడు, సర్వజ్ఞ బిరుదాంచితుడైన పెదకోమటి వేమారెడ్డి ఈదృష్టిలో ఇద్దరూ రెడ్లే; ఇద్దరూ నాయళ్ళే! గృహనామంలో రెడ్డి శబ్దాన్నీ వ్యక్తి నామంలో నాయడు శబ్దాన్నీ స్థగితం కావించుకొన్న కమ్మప్రభువు, అమరావతిసంస్థాన పాలకుడు రాజా వాసిరెడ్డి వెంకటాద్రి నాయడు (1761-1816) ఉభయకుల దీపకుడు.

ప్రస్తుత స్మరణీయులు, ప్రాతఃస్మరణీయులు అయిన మునగాల రాజా శ్రీ నాయని వెంకటరంగారావు బహద్దరువారు (1875-1958) ఈ కోవలోని వారే. తెలుగుజాతి సాహితీ సంస్కృతుల రూపురేకలు దిద్దడంలో కర్తలూ, కారయితలూ ఈ కుదురులోని వారే. ఇది అనాదీ, అనంతమూ. అవిచ్ఛిన్నమైన ఈ సూత్రంలో ఒక మణిపూస శ్రీ నాయని వెంకట రంగారావుగారు.

శ్రీ వెంకట రంగారావుగారి అభిజనం వరంగల్లు జిల్లా తొర్రూరు గ్రామం. ఈయన తొర్రూరు, నెల్లికుదురు పరిసరాలలోని సుప్రసిద్ధ దేశముఖుల కుటుంబానికి చెందినవారూ, 'మోటాటి' రెడ్ల శాఖకు చెందినవారూ అయిన గోపమ్మ రామవరెడ్డి దంపతుల కుమారుడు. మహారాష్ట్రుల పాలకవ్యవస్థలో దేశముఖుల చాల ప్రముఖులు. దేశంలోని వతన్‌దార్ల (అధికృతుల)ను దేశముఖులని వ్యవహరించడం మహారాష్ట్ర సంప్రదాయం. దేశముఖుల పట్టపునామ సంప్రదాయాన్నిబట్టి 'రెడ్డి' పదం స్థానంలో 'దేశముఖ్' అన్న పట్టపు పేరు వచ్చి చేరింది. ఆ పిమ్మట మరాటీభాషలో పాలకార్థాన్నీ, ఆదరార్థాన్నీ సూచించే "రావ్' అన్న బిరుద వాచకం వ్యక్తినామంపై చేరింది. ఇది సంస్కృత 'రాజ' శబ్దానికి వికృతి.

తెలంగాణంలోని సంస్థానాధిపతులలో రెడ్లు ఎక్కువ. ఆత్మకూరు, గద్వాల, దోమకొండ సంస్థానపాలకులు 'పాకనాటి' శాఖకు చెందిన రెడ్లు, మునగాల పాలకులూ, వీరితో వియ్యమందిన వనపర్తి సంస్థానాధీశ్వరులూ, వనపర్తివారి ఆడుబడుచు సంతతికి చెందిన బిజ్జుల వంశీయులు—ప్రాగుటూరి పరిపాలకులూ మోటాటి తెగకు చెందిన రెడ్లు. రాజమహేంద్రవరం రాజధానిగా పాలించిన వీరభద్రారెడ్డి ప్రభృతులు పంటరెడ్లు; మన సభాధ్యక్షులైన గోపాల రెడ్డిగారుకూడా పంటరెడ్డి శాఖకు చెందినవారు. తీర గోదావరీ తీరభూములలోవి రెడ్లు 'భూమంచి'రెడ్లు.

'మోటాటి' అన్నది సీమావాచకమై 'ముటవాడి' శబ్దానికి వికృతి. క్రీస్తు శకం పన్నెండో శతాబ్దినాటికే 'ముటవాడి' ఒక 'నాడు'గా ప్రసిద్ధమైంది. ఇప్పటి ప్రకాశంజిల్లా మార్కాపురం తాలూకాలోని ఒక భాగమే 'ముటవాడి' నాడు. ప్రాచీనాంధ్ర కర్ణాటక భాషా శాసనాలలోని 'ముట్టవాడి', ముటవాడికి పూర్వరూపం. గుంటూరు మండలంలోని కొణిదెన గ్రామం చెన్నకేశవస్వామి దేవాలయ శిలాశాసనాన్నిబట్టి 'ముట్టవాడి' నాడును త్రిభువనమల్లుడు జయించి నట్లు తెలుస్తున్నది. మార్కాపురం తాలూకా త్రిపురాంతకంలోని త్రిపురాంత కేశ్వర దేవాలయ శాసనాలలో '...స్వయంభూ దేవ గళ మధ్యాహ్న నివే ద్యక్కం బిట్ట ముట్టవాడి నా డొళ గణ పుల్లలపఱు కవలగుంట్ట రాచగొండ' (పంక్తులు 34-37, నెం. 204, ద.హిం.శా , సం. IX, భాగం 1, క్రీ. శ. 1122), '...జీర్ణోద్ధారక్కం ముట్టవాడి నా డొళగణ చాపలమడుగు చతు స్సీమ సహితం ధారాపూర్వక మాడి బిట్టరు...' (పంక్తులు 18-20, నెం. 212, పై., క్రీ శ. 1127), అని ముట్టవాడి నాడు పేర్కొబడ్డది. ఈ 'ముట్ట వాడి' సీమలో బహుకాలం నివసించి ఇతర ప్రాంతాలకు వలస వెళ్ళిన రెడ్డి శాఖీయులు 'ముటవాడి' రెడ్లుగా వాడుక పడారని నిశ్చయించడం సయుక్తిక మైనది. 'ముటవాడి'యే ఆ పిమ్మట 'మోటాటి'గా మారినట్లు నిర్ధారించ వచ్చు.

ప్రాకుటూరి పాలకుడైన బిజ్జుల చిన తిమ్మభూపతి తన అనర్ఘరాఘవ కృత్యవతారికలో 'నితాంతవిఖ్యాతిఁ దనరుచున్న ముటవాడ కులమున నొప్పు మీఱెఁ జాల బిజ్జుల నార భూపాల మౌళి' (అనర్ఘ రాఘవము, ప్రాచ్య లిఖిత గ్రంథాలయ ప్రతి, R. No.629) అని తన శాఖను గురించి చెప్పకున్నాడు.

శ్రీ వెంకట రంగారావుగారు 1883లో మునగాల ఎస్టేటు జమీందారిణి శ్రీ లచ్చమ్మారావుగారికి దత్తులుగా వచ్చారు. మునగాల ఎస్టేటు కృష్ణామండలంలోని నందిగామ తాలూకాలోనిది. ఇది అనాటి బ్రిటిష్ ప్రాంతంలో నెలకొని ఉన్నప్పటికీ అన్ని వైపులా నిజాంరాష్ట్రం దీనిని ఆవరించి ఉండినది. 'నడిగూడెం' దీని ముఖ్యస్థానం. మెకంజీ కథనం ప్రకారం గుర్లపాటి అయ్యన్న దేశాయి ఈ సంస్థానాధీశుల పూర్వులలో ఒకడు. కాకతీయ చక్రవర్తులకు సామంతులుగా నుండిన వారి కుదురునకు చెందిన వాడీ అయ్యన్నదేశాయి. ఇతని కుమారుడు అకాలమరణం చెందడంవల్ల కోడలు సుభద్రమ్మకు సంస్థానం సంక్రమించింది. సంస్థానాన్ని అజమాయిషి చెయ్యడానికి ఆమెకు శక్తి చాలనందున ఆమె సోదరుడైన కీసర ముకుందప్ప మునగాల పరగణాకు పాలకుడుగా మొగల్‌పాదుషా ఔరంగజేబునుంచి సన్నదులు సంపాదించాడు. ముకుందప్పకు సూరన్న, నరసన్న అని ఇద్దరు కుమారులు. సూరన్న తరువాత సంస్థాన పాలనాన్ని చేపట్టిన నరసన్నగారి అనంతరం ఆయనభార్య లక్ష్మమ్మ అధికారానికి వచ్చింది. ఈమె అనంతరం కుమారుడు వెంకట రామన్న, ఆ పిమ్మట ఇతని కుమారుడైన వెంకట నరసింహారావు రాజ్యానికి వచ్చారు. 1802 నాటి శాశ్వత కరనిర్ణయం సందర్భంగా ఇంగ్లీషు ఈస్టిండియా కంపెనీ నుంచి 'సన్నద్-ఇ-మిల్కియత్-ఇస్తిమిరార్' నరసింహారావు స్వీకరించారు. ఆయన అనంతరం ఆయన కుమారుడు కోదండరామయ్య కొన్నాళ్లు పాలించి 1814లో అకాల మరణంపాలైనాడు. వీరికుమారుడు వెంకట నరసింహారావు పసివాడు అవడంవల్ల నాలుగేళ్లపాటు సంస్థానం కోర్ట్ ఆఫ్ వార్డ్స్ స్వాధీనంలో ఉండి, 1818లో నరసింహారావు వశమైనది. 1836లో పరమపదించిన ఈయనకు సంతతి లేనందువల్ల దత్తుడైన కోదండరామయ్య అప్పటికి మైనరైనందున, 1850లో జమీ పాలనం స్వీకరించారు. ఇతడు 1854లో మరణించాడు. ఇతని భార్య రుక్కమ్మ 14 ఏళ్లు జమీని పాలించి 1868లో గతించారు. ఈమె కుమార్తెయే లచ్చమ్మారావుగారు. ఈమె 1873లో జమీందారిణి అయ్యారు. నిజాం రాష్ట్రంలో ప్రముఖులైన నాయని వెంకటరామయ్యగారిని వివాహమాడారు. లచ్చమ్మారావుగారి ఎస్టేట్ మానేజరుగా కొమఱ్ఱాజు వెంకటప్పయ్యగారు పనిచేశారు. ఈమె భర్త వెంకట రామయ్యగారు చిన్న వయస్సులోనే నిస్సంతుగా మరణించడంవల్ల మన కథానాయకులు శ్రీ వెంకట రంగారావుగారిని దత్తు స్వీకరించడం జరిగింది. లచ్చమ్మారావుగారు 1892లో

మరణించాక, దత్తత చెల్లదని అయిదారు తరాలు సంస్థానాన్ని పాలించిన కీసరవారు వ్యాజ్యెం తెచ్చారు. ఈ వ్యాజ్యెం ప్రివీకౌన్సిల్ దాకా వెళ్ళినా, చివరకు దత్తులైన రంగారావుగారి కనుకూలంగా తీర్మానమైంది. ఈ విధంగా 1900 లో వెంకటరంగారావుగారు ఎస్టేటు ఆధిపత్యాన్ని స్వీకరించారు.

దత్తు కాలం నాటికి రాజాగారు మైనరైనందున సంస్థానం కోర్ట్ ఆఫ్ వార్డ్స్ స్వాధీనంలో ఉండగా, కృష్ణా జిల్లా కలెక్టర్ సంరక్షణ క్రింద మచిలీపట్నంలో రాజాగారి చదువు సంధ్యలు సాగాయి.

ఆనాడు భావ విప్లవానికీ సాంఘిక సంస్కరణానికి మధ్యాంధ్ర మహీతలంలో మచిలీపట్నం ఒక ప్రధాన కేంద్రం. అసలే ఒకపాటి అంతర్జాతీయతా ప్రభావితమైన పట్టణం అది. గోపాలకృష్ణ గోఖలే సంస్కరణ భావాలు, బాల గంగాధర తిలక్ తీవ్ర రాజకీయాభిప్రాయాలు యువతపై గొప్ప ప్రభావాన్ని నెరపిన యుగసంధ్య అది. ఒక వైపున ఆర్యసమాజ ధోరణులూ, ఇంకో వైపున దివ్య జ్ఞాన సమాజ ప్రబోధాలూ, మరో వైపున బ్రహ్మ సమాజ వాసనలూ మచిలీపట్నంపై విసురుతున్న కాలమది. వీటన్నింటినీ మించి జాతీయోద్యమ నాయకులైన గాంధీజీ ప్రభావం దశదిశలా విస్తరిస్తూ వుండిన రోజులవి. ఆదిభట్ల వారి హరికథలూ, హరిప్రసాదరావుగారి హరిశ్చంద్రాది నాటక ప్రదర్శనాలూ, కూచిపూడివారి భాగవతాలూ, బందరు నవాబు వంశీయుల పీర్ల పండగల వేడుకలూ, బందరు శివగంగ మహిషాసుర మర్దని అమ్మవారి ఊరేగింపులో తిరుపతి వేంకటకవుల అవధాన విద్యలూ, బందరు బజారు మచ్చుల చావడిలోను, రామన్నపేటలోని సోషల్ క్లబులోను వారం వారం ప్రముఖుల ఉపన్యాసాలూ మొత్తం మచిలీపట్టణాన్ని ముంచెత్తిన ముహూర్తాలవి. సనాతనాచార పరాయణులకూ, సంఘ సంస్కరణ వాదులకూ, పాతకూ కొత్తకూ—సభలలో సభస్సులలో, ఉత్సవాలలో ఊరేగింపులలో, పత్రికలలో కరపత్రికలలో హోరాహోరి పోరాటాలు సాగిన సమయమది. బందరు లడ్డు, ఇమాంపసందు మామిడి పండ్లు, బందరు బందరంతా ఘుమాయించిన ఘడియలవి. చవిటి పర్రల బందరు పెక్కు మహాకవి కుమారుల కమనీయ గీతాలావనలతో 'బృందావన పురం' గా కొత్త వెలుగులు విరజిమ్మిన మధురక్షణాలవి.

ఇక శ్రీ రాజాగారి సహాధ్యాయులూ సతీర్థ్యులూ అంతా అనంతర కాలంలో ఆంధ్ర దేశపు పునరుజ్జీవనోద్యమాలలో ప్రముఖ పాత్ర వహించిన

ంగరాజు పట్టాభి సీతారామయ్య, అయ్యదేవర కాళేశ్వర
౦ సర్వోత్తమరావు, కోపల్లె హనుమంతరావు, దేశిరాజు
ప్నారి కృష్ణారావు పైజెప్పిన వారిలో కొందరు. నాగపూరు
హిరిస్ కాలెజిలో సంస్కృతం, దర్శనశాస్త్రం ప్రత్యేక
బి. ఏ. డిగ్రీ విద్యార్థి (1898-1900) అయిన కొమర్రాజు
ప (1877-1923) కూడా సెలవులలో బందరు వచ్చి ఈ
నే రేవారు. లక్ష్మణరావుగారి తండ్రి వెంకటప్పయ్యగారు
౦ ఎస్టేటులో మానేజరుగా పనిచేసిన కారణంగా రాజాగారికీ,
గాఢమైన స్నేహం ఏర్పడింది. ఆనాడు మరాట్వాడాలో
ుక రాజకీయ వైజ్ఞానిక సంస్కరణలు ఈ మిత్ర మండలి
వచ్చేవి. లక్ష్మణరావుగారు సంఘ సంస్కరణ క్షేత్రంలో
రాజకీయ రంగంలో తిలక్ అనుయాయి. ఇంచుమించు
మండలిలోని సభ్యులందరూ ఇలాంటి అభిప్రాయాలు

ద్వికాస వాతావరణంలో, ఉత్తమోపాధ్యాయుల శిక్షణలో,
తుల సహవాసంలో పెరిగిన శ్రీ రాజాగారికి స్వస్థాన వేష
స్కృతులపై అమిత ప్రీతి, జాతీయోద్యమంపై గౌరవ ప్రపత్తి
లేదు. రాజా రామమోహనరాయ్, రామకృష్ణపరమహంసల
ఆయన హృదయంలో అప్పటికే హత్తుకు పోయాయి.
(1863–1902), బిపిన్ చంద్రపాల్, దాదాభాయ్ నౌరోజీ,
ప్రభృతుల దర్శన భాగ్యంకూడా ఆయనకు లభించింది.
ఉపన్యసించిన బెజవాడ సభ కాయన ఆహ్వాన సంఘాధ్య
లకత్తాలో దాదాభాయి నౌరోజి అధ్యక్షతన స్వరాజ్యపు తీర్మా
వ భారత జాతీయ కాంగ్రెస్ సమావేశానికి తమ దివాన్
గో కలసి రాజాగారు హాజరయి వచ్చారు. 1907 లో నంది
ృష్ణా జిల్లా కాంగ్రెస్ సభలకు రాజాగారు ఆహ్వాన సంఘాధ్య
ంధి నాయకత్వాన సాగిన జాతీయోద్యమంలో కూడా ఉచిత
వారు. సుశిక్షితమైన చిత్తవృత్తీ, ప్రజాహిత పరమైన కార్య
ఏవడ్డాయి.

ఇంతేకాక సంప్రదాయ మనేది మరీ బలీయమైనది. మునగాల సంస్థానాన్ని పాలించిన పూర్వపాలకులు చాల మంది సాహితీ సముద్ధరణంలో, కవి పండిత పోషణంలో, కళాకార సమాదరణంలో పేరు పెంపులు గడించిన వారు. ఎస్టేట్ మానేజరు కొమ్మరాజు వెంకటప్పయ్యగారు ప్రేరకుడుగా వరదరాజు నందికేశ్వరకవి 'శివతత్త్వ సుధానిధి' అన్న మూడాశ్వాసాల ప్రబంధాన్ని, 'సేతు మాహాత్మ్యం' అన్న క్షేత్ర మాహాత్మ్య ప్రతిపాదకమైన రచననూ సంధానించారు. ఇవి రెండూ ఆంధ్ర శైవ వాఙ్మయంలో ప్రశస్త కృతులు. వెంకటప్పయ్యగారి పినతండ్రి కొమ్మరాజు రామలింగకవి 'వీరభద్ర', 'శ్రీగిరి మల్లేశ్వర' మకుటాలతో రెండు శతకాలను సంతరించారు. వెంకటప్పయ్యగారి అన్న వెంకటశివుడుగారు రేపాల రాజలింగ శతకకర్త. 'భావ భవ భంగ గౌరి హృత్పద్మ భృంగ రాజిత శుభాంగ రేపాలరాజలింగ' అన్న మకుటంగల ఈ శతకంలో శివపారమ్యం నిరూపించబడింది. సంప్రదాయ ప్రియులైన శ్రీ వెంకట రంగారావు బహద్దరుగారుకూడ సాహితీ పోషణలో, కవిపండిత సమ్మానాలలో, సాంఘిక రాజకీయ సేవా కార్యక్రమాలలో ప్రముఖ పాత్ర వహించారు.

రాజాగారు సంస్థానాధిపత్యం స్వీకరించిన వెంటనే 'సురపతి కెప్పుడున్ హితముసూపు బృహస్పతి మాడ్కినెమ్మి తమ్మరసిన మంత్రి సత్తముని యాత్మజుఁడై తన మిత్రుఁడై సరసకళా విచక్షణత సత్యమె మాటికి బోధ సేయుచున్ బరఁగెడి లక్ష్మణార్యుని...' (శ్రీ కృష్ణదేవరాయ చరిత్రము, 1 4) ఎస్టేటు దివానుగా నియమించడంలోనే బహుముఖమైన ఆంధ్ర భాషాభివృద్ధికి, ఉజ్జ్వలమైన ఆంధ్ర సంస్కృతి పురోగతికి నాందీవాచకం పలికారు.

విద్వత్కవుల వంశంలో జన్మించిన శ్రీ లక్ష్మణరావుగారు జగమెరిగిన జగా పండితులు. కలకత్తా విశ్వవిద్యాలయం ఎం. ఏ, పట్టభద్రులు చక్కటి సంస్కారం, సరస సాహిత్యాభిలాష గల ప్రభువులకు బహుముఖమైన ప్రజ్ఞా ప్రాభవాలూ, పాండితీ పరిశోధనా వైభవాలూ గల ఇలాటి దివాను లభించడం చాలా అరుదు. అది వాస్తవంగా ఆంధ్రుల అదృష్టం.

దివానుగా లక్ష్మణరావుగారు మునగాల ఎస్టేటుకు చేసిన సేవ విస్మరించరానిది. వీరి సేవలు తమ చిన్న సంస్థానానికే పరిమితం కాకుండా విశాలాంధ్ర మంతటికీ విస్తృతమయ్యే తీరున లక్ష్మణరావుగారికి విశేషావకాశాలను కల్పిం

చిన మునగాల రాజాగారు నిజంగా అభినందనీయులు. మునగాల యెస్టేటు పెద్ద దావా నిమిత్తం లక్ష్మణరావుగారు 1905-1923 మధ్య చెన్నపట్టణంలోనే ఎక్కువ కాలం గడిపారు. శోధకుడుగా, ప్రప్రథమ ఆంధ్ర విజ్ఞాన సర్వస్వ సంపాదకుడుగా, విజ్ఞాన చంద్రికా గ్రంథ మండలి నిర్వాహకుడుగా లక్ష్మణ రావుగారు గావించిన పరిశ్రమ విద్వల్లోక విదితం.

'తనువు రుజావృతం బయిన దార్ఢ్యము తప్పచునున్న భాషపైఁ
గనికరముంచి తీవ్రకృషి కర్షకురీతి నొనర్చి తత్ఫలం
బనిశము నాంధ్రలోకమునకై వినియోగ మొనర్చియుంట నీ
జననము సార్థకం బయి పొసంగెను లక్ష్మణరాయ ధీమణీ'

అని శేషాద్రి రమణకవులు చేసిన ప్రశస్తిలో అతిశయోక్తి ఏమాత్రం లేదు.

'కర్తా కారయితా చైవ ప్రేరక శ్చానుమోదకః
సుకృతం దుష్కృతం చైవ చత్వార స్సమభాగినః'

అన్న అభియుక్తోక్తి మేరకు లక్ష్మణరావుగారి భాషోద్యమాలన్నిటికీ శ్రీ రాజా గారు ప్రేరకులు, ఉద్బోధకులు. రాయలసీమకు చెందిన గాడిచెర్ల హరి సర్వోత్తమరావు, సాగరాంధ్రానికి సంబంధించిన అయ్యదేవర కాళేశ్వరరావు తెలంగాణానికి చేరిన రావిచెట్టు రంగారావు-ఈ ముగ్గురు సహచరుల తోడ్పాటు తో లక్ష్మణరావుగారు 1905 లో చెన్నపట్టణం కచ్చాలేశ్వరాగ్రహారంలో స్థిర పరచిన విజ్ఞాన చంద్రికా గ్రంథమండలికి శ్రీ రాజాగారు సంస్థాపకాధ్యక్షులు. రాజకీయార్థిక శాస్త్రాలు, వ్యవసాయ పారిశ్రామిక విషయాలు, నానా దేశ చరిత్రలు, మహా పురుషుల జీవితాలు, చారిత్రిక నవలలు, ఇతర భాషల లోని ఉద్గ్రంథాల భాషాంతరీకరణాలు ఈ మండలి ఆశయాలలో నిర్వచించ బడ్డ ప్రచురణాంశాలు. ఈ గ్రంథమండలి అనేక గ్రంథాలను ప్రచురించి సర్వతోముఖమైన ఆంధ్రాభ్యుదయానికి ఎనలేని సేవ చేసింది. కట్టమంచి రామ లింగారెడ్డిగారి అర్థశాస్త్రము, లక్ష్మణరావుగారి హిందూ మహాయుగము, మహమ్మదీయ మహాయుగము, ఆచంట లక్ష్మీపతిగారి జీవశాస్త్రము, మాని కొండ సత్యనారాయణశాస్త్రిగారి ఆంగ్ల రాజ్య స్థాపన, వేలూరి సత్యనారాయణ

* దీని మొదటి కార్యస్థానం హైదరాబాద్ రెసిడెన్సీలోని రావిచెట్టు రంగా రావుగారి బంగాళా.

గారి బౌద్ధ మహాయుగము, దుగ్గిరాల రాఘవ చంద్రయ్యగారి విజయ నగర స్సామ్రాజ్యము, చిలుకూరి వీరభద్రరావుగారి ఆంధ్రుల చరిత్ర మండలి పక్షాన వెలువడిన ఉత్తమ రచనలలో కొన్ని.

శ్రీ లక్ష్మణరావుగారు సంధానించిన 'ఆంధ్ర విజ్ఞాన సర్వస్వము' నకు సైతం శ్రీ రాజాగారు ప్రేరకులు. దక్షిణదేశ భాషలలో ఇది మొదటి విజ్ఞాన సర్వస్వం (1912–13). ఆంధ్రుల దురదృష్టవశంవల్ల అకారాది విషయ విభాగంగల సంపుటాలతోనే ఇది ఆగి పోయింది. ఈ సర్వస్వ నిర్మాణంలో, ప్రచురణలో శ్రీ మల్లంపల్లి సోమశేఖర శర్మగారు సహాయకుడుగా పని చేశారన్నది ఇక్కడ పేర్కొనదగ్గ విషయం. శ్రీ లక్ష్మణరావుగారి శిక్షణలో చరిత్ర రచనకు శ్రీకారం చుట్టిన మల్లంపల్లి వారు ఉత్తమ పరిశోధకులుగా రూపొందడమే కాక, అనంతర కాలంలో తెలుగు భాషాసమితివారి విజ్ఞాన సర్వస్వ సంపాదకులుగా అదే సంప్రదాయంలో ముందడుగు వేసి మన్నన లందారు. లక్ష్మణరాయ పరిశోధక మండలి ముఖ్య కార్యకర్తలలో ఒకరైన ఆదిరాజు వీరభద్రరావు సైతము శ్రీ లక్ష్మణరావుగారి తరిబీయతులో తయారైన వారే.

సమగ్ర భాషాభివృద్ధి అన్నది కేవలం గ్రంథ రచనవల్ల, గ్రంథ ప్రచురణవల్ల మాత్రమే జరుగదు. భాషా విజ్ఞాన విస్తృతికి గ్రంథాలయాలు కూడా ప్రధాన సాధనాలు. ఈ దృష్టితో లక్ష్మణరావుగారి సంకల్ప శక్తితో రావిచెట్టు రంగారావు, ఆదిపూడి సోమనాథరావు, మైలవరపు నరసింహశాస్త్రి మున్నగు మిత్రుల సహకారంతో తాము సంస్థాపకాధ్యక్షులుగా శ్రీ మునగాల రాజా 'అచ్చ తెనుంగు కబ్బమున కాది పదంబయి పోల్చు భాగ్యమున్ హెచ్చుగఁ గన్న దేశమిది...' (శ్రీ కృష్ణదేవరాయ చరిత్రము, 1–5) కావున హైదరాబాదు నగరం రామకోఠీలో రావిచెట్టు రంగారావుగారి బంగళాలో 1901 సెప్టెంబరు నెల 1వ తేదీన '...ప్లవ సంవత్సర శ్రావణ బహుళంపు తదియ రవివారంబా భూవరుడు పాలవంచపు భూవిభుచేఁ దెఱవఁ జేసెఁ బుస్తకశాలన్' (పైది, 1–11). ఇదే నేటి శ్రీ కృష్ణదేవరాయాంధ్ర భాషానిలయం. రాజాగారి మిత్రులు ఆనాటి పాల్వంచ సంస్థానాధిపతులు రాజా పార్థ సారథి అప్పారావుగారు అధ్యక్షులుగా గల సభాముఖంగా ఈ గ్రంథాలయం అవతరించింది. దీని నిర్వహణకూ విస్తరణకూ, అడుగడుగునా సుమారు అర్ధ శతాబ్దం పైగా శ్రీ రాజాగారి అండదండలు అన్ని అంతస్తులలోనూ లభిస్తూనే వచ్చాయి. నిజాం పాలన

కాలంలో తెలంగాణా ఆంధ్రోద్యమానికి కూడా ఇది కేంద్ర స్థానంగా ఉపకరించింది. పాఏటి రాజకీయ స్వాతంత్ర్యమూ లేక తెలుగు భాషా సంస్కృతులు విస్మృత మౌతున్న విషమ పరిస్థితులలో రూపెత్తిన ఈ గ్రంథాలయం తెలంగాణంలో ఉద్బుద్ధమైన సకలోద్యమాలకూ మూల భూమికగా పనిచేసింది. సాహిత్య సప్తాహాలు, మహాకవి జయంతులు, సమకాలిక విద్వత్కవి సత్కారాలు, అఖిలాంధ్ర కవి సమ్మేళనాలు, హరికథా కాలక్షేపాలు, కూచిపూడి భాగవత ప్రదర్శనాలు, సంగీత విద్వాంసుల కచేరీలు, గ్రంథాలయ సభలు, ఇతర సాంఘిక సాంస్కృతిక సమావేశాలు ఈ గ్రంథాలయంలో నిర్వహించబడుతూ వచ్చాయి. ఎన్నెన్నో ఆటుపోటులకు తట్టుకొని ఈ గ్రంథాలయం రజతోత్సవాలు (1927), స్వర్ణోత్సవాలు (1952), వజ్రోత్సవాలు (1962) మహా వైభవంగా జరుపుకుంది. ఇంచుమించుగా ఈ గ్రంథాలయం అవతరించిన సమయంలో వరంగల్లులో నెలకొన్న రాజ రాజ నరేంద్ర గ్రంథాలయం కూడా రాజాగారి భాషాభిమానం వల్ల రూపు దిద్దుకొన్నదే.

లక్ష్మణరాయల మరణానంతరం విజ్ఞాన చంద్రికా గ్రంథమండలి కొంత కాలం బెజవాడలోను, కొంతకాలం హైదరాబాదులోను తన కార్యకలాపాలు నిర్వర్తించి అంతర్హితమైంది. లక్ష్మణరాయల మీది గౌరవాభిమానాలు కారణంగా వారి స్మృత్యంకంగా తెలంగాణంలో అవతరించిన లక్ష్మణరాయ పరిశోధక మండలికి కూడా శ్రీ రాజాగారు సంస్థాపకాధ్యక్షులు. గొప్ప విరాళమిచ్చి దీని స్థైర్యానికి ఎంతో పాటుపడ్డారు. 'తెలంగాణా శాసనములు' మున్నగు అపూర్వ పరిశోధక గ్రంథాలు ఈ మండలి పక్షాన వెలువడాయి.

శ్రీ రాజాగారు లక్ష్మణరాయల స్మృతిచిహ్నంగా ఆంధ్ర విశ్వవిద్యాలయంలో చరిత్ర పరిశోధనకై ఒక ఎండోమెంటు నిధిని ఏర్పరిచారు.

లక్ష్మణరాయ సహవాస సంస్కారం వల్లనే రాజాగారు దేశాభాషాభిమానాలను ఇతోధికంగా పెంచిన వారు, పెంచుకున్న వారు. 'దానే మౌనం' అన్న నిదానం రాజాగారికి పెన్నిధానం. శ్రీ కృష్ణదేవరాయాంధ్ర భాషా నిలయానికి అనుబంధంగా కొంతకాలం పాటు (1901-08) నడచిన తెలుగు పాఠశాల, కాశీ విశ్వవిద్యాలయం, హృషీకేశంలోని ఆంధ్రాశ్రమం, గుంటూరులోని శారదా నికేతనం, హైదరాబాదులోని నారాయణగుడా బాలికోన్నత పాఠశాల,

బందరు జాతీయ కళాశాల, రామకృష్ణ మిషను, వివేకానంద కళాశాల, రెడ్డి జన సంఘం, కృష్ణా గుంటూరు మండల విశ్వబ్రాహ్మణ మహాజన సంఘ పుస్తక భాండాగారం మున్నగు విద్యా సాంస్కృతిక సంస్థలు, కాకినాడలోని ఆంధ్ర ప్రచారిణీ గ్రంథమాల, చెన్నపట్టణంలోని ఆర్యభారతీ గ్రంథమాలిక, బందరులోని సరస్వతీ గ్రంథమాలిక, రాజ మహేంద్రవరంలోని ఆంధ్రేతిహాస పరిశోధక మండలి మున్నగు గ్రంథ ప్రచురణసంస్థలు, పరిశోధన మండలులు రాజాగారి వితరణ గుణాన్ని చవిచూచినవే. ఇంకా ఎన్నో సంస్థలకు రాజ పోషకులుగా ఉండి దేశ భాషాభివృద్ధికి ఎంతో తోడ్పడ్డారు. గుంటూరు జిల్లా కావూరు వినయాశ్రమం పక్షాన గొల్లపూడి సీతారామశాస్త్రిల (స్వామి సీతా రామ్) వారి ఆధ్వర్యవంలో ప్రకటితమైన తెలుగు వేదసంపుటాలు వీరి అండ దండల వల్లనే వెలుగు చూశాయి. చిలకమర్తి షష్టి పూర్తి సమ్మాన సంఘంలో సభ్యులు కావడమే కాక ఆయన సంపూర్ణ రచనలను సంపుటాలుగా ప్రకటించ డానికి గొప్ప విరాళం ఇచ్చిన మహోదారులు వీరు.

మద్రాసు యూనివర్సిటీవారి కాంపోజిషన్‌కమిటీలో సభ్యులుగా లక్ష్మణ రావుగారు గ్రాంథిక భాషాశైలిని బలపరచడం రాజాగారికి అసమ్మతం కాక పోయినా, వ్యావహారిక భాషాశైలిని బలపరుస్తూ కేవలం తెలుగు వ్యావహారిక భాషాపదాలు ఆధారంగా గెలెత్తి అనే పాశ్చాత్య పరిశోధకుడు – చెన్నపురి సివిల్ సర్వీస్ ఉద్యోగి–ఇంగ్లీషు వివరణలతో, రోమన్ లిపిలో నిర్మించిన తెలుగు-ఇంగ్లీషు నిఘంటు* ప్రచురణకు శ్రీ రాజాగారు రాజ పోషకులు. ఇది ఆనాటి మద్రాసురాష్ట్ర ముఖ్యమంత్రి, ఆంధ్ర విశ్వవిద్యాలయ ప్రో ఛాన్సలర్ అయిన బొబ్బిలి రాజా శ్రీ రావు రామకృష్ణ రంగారావు బహద్దరుగారికంకితం. దీనినిబట్టి శ్రీ రాజాగారికి గ్రాంథిక వ్యావహారిక భాషాశైలులపట్ల పట్టింపు లేదనీ, తెలుగుభాషాభివృద్ధియే వారి పరమావధి అనీ నిష్కర్షించవచ్చు.

శ్రీరాజాగారికి దేశచరిత్రలన్నా, చరిత్ర సంబంధమైన రచన లన్నా చాలా ప్రీతి. తమ ఆశ్రయంలోని ఆదిపూడి సోమనాథరావు (1867-1941) గారిని ప్రోత్సహించి 'జపాను చరిత్రము'• ను రాయించి ప్రకటింపజేశారు.

---

* A. Galletti Di Cadilhac, Telugu Dictionary, A Dictionary of Current, Telugu; Oxford University Press, London, 1935.

• ఆనంద స్టీమ్ ముద్రాక్షరశాల, చెన్నపురి, 1906.

ాడు పాశ్చాత్య దేశాల అధినేతలకు, ముఖ్యంగా రాచరికపు పాలనా వ్యవస్థ దేశాలకు, ప్రాచ్య దేశాలంటే ఒక రకమైన హేళనభావం, ఒక విధమైన ్షాబుద్ధి ప్రబలి వుంది. ప్రాచ్యదేశాలవారు అల్ప ప్రకృతులనీ, అలనమతు ఒక ఈసడింపు వారిలో వుండేది. తమ ఆభిజాత్యంపట్ల కృత్రిమ ప్రతిష్ఠా, ు ఆర్థిక స్థితిపట్ల కృత్రిమ ప్రతిష్ఠా, తమ ఆర్థికస్థితిపట్ల దురభిమానమూ లో గూడు కట్టుకొని వుండేవి. సాంకేతిక ప్రగతిలోను, సైనిక వ్యూహ నా చమత్కృతిలోను తాము సర్వాధికులమనే దురహంకారం ఎక్కువ తాదులో వారికి వుండేది. ఇరవయ్యో శతాబ్దపు తొలి యేళ్ళలో అనంతమైన ున సామగ్రికీ, అపారమైన సైనిక సంపత్తికి రష్యా సార్వభౌముడు జారు ్వర్తిది పెద్దపేరు. రాజ్యదాహంతో జారు చక్రవర్తి జపానుపై దురాక్రమ సేనా వాహినులను దూకించాడు. ఆనాడు రష్యాకంటె అన్ని ిలా ఎన్నోరెట్లు కిందిస్థాయిలో ఉన్న జపాన్‌దేశం ఈ బాడులను ్రకొట్టి అన్ని సైనిక రంగాలలోను రష్యాను చిత్తుగా ఓడించింది. ానుకు అనుకూలంగా సంధి ఒడంబడికలు కుదిరాయి. ఎవరూ ాంచని ఈ సంఘటనలు అఖిల ప్రపంచ రాజ్యాలను విస్మయ విభ్రాంతు ి ముంచి వేశాయి. సుదీర్ఘమైన ఈ భీషణ సమరంలో జపాన్‌దేశ నాయ ా, ప్రజానీకమూ, సర్వసేనానులూ, సమస్త సేనావాహినీ ప్రదర్శించిన ంఠిత దీక్షాదక్షతలనూ, అసదృశ సమరనీతి కుశలతనూ అభినందిస్తూ యా రాజ్యాలన్నీ తమ హర్షాన్ని ప్రకటించాయి. గుండుబలంకంటె గుండె ం గొప్పదనీ, మందిబలంకంటె మంచి బలం దొడ్డదనీ నిరూపితమైన యీ ్రతిక గుణపాఠం మునగాల రాజాగారిని బాగా ఆకట్టుకుంది. సరళమైన ులో వచనరూపంలో నిర్మితమైన ఈ గ్రంథం ఇతిహాసము, వివిధ విషయ ు, యుద్ధము, కథామంజరి అన్న నాల్గు భాగాలుగా విభజించబడ్డది. ాను దేశపు ప్రాచీన చరిత్ర మొదటి భాగంలో సంక్షేపంగా నిక్షేపించబడ్డది. ాన్ దేశానికి సంబంధించిన చిల్లర మల్లర విశేషాలు రెండోభాగంలో వివ ర బడ్డాయి. మూడో భాగంలో యుద్ధవర్ణనం కళ్లకుగట్టినట్టు చిత్రించబడ్డది. ాటపు సమయంలో జపానీయులు ప్రదర్శించిన వీరోచిత సంఘటనలు ో భాగానికి కావ్యవస్తువు.

ఇంతేకాక. ఆసియాఖండ దేశాలలో సమయోచిత సంస్కరణములచేత, ్రగౌరవముచేత, నిజమైన దేశభక్తిచేత, స్వార్థపరిత్యాగముచేత. పారి ుకాది రంగాలలో జపానుదేశం సాధించిన ప్రగతికి ముగ్ధులై,

శ్రీ రాజాగారు తమ కుమారులలో పెద్దవారిద్దరికీ జపాను నాయకులైన అడ్మిరల్ టోగో, జనరల్ నోగీల పేర్లను ముద్దు పేర్లుగా పెట్టుకొని జపానుపట్ల తమకు గల గాఢాభిమానాన్ని వ్యక్తం చేశారు. ఆ అభిమానమే 'జపాను చరిత్రము' ఆవతరణానికి సైతం కారణమైనట్లు ఊహించవచ్చు. 'ఎప్పటి కెయ్యది ప్రస్తుత మప్పటికా మార్పునొంది యలరెడువారే, మెప్పం బడయుదు రెల్లెడఁ దప్పక జాపానులట్ల తథ్యము సుమతీ' అన్న పద్య మీ చరిత్ర ప్రారంభంలో మకుటమణిగా కూర్చబడింది. ఇది శ్రీ రాజాగారి కంకితం.

విజయ నగర సామ్రాజ్య చక్రవర్తులలో శిరోభూషణమైన శ్రీకృష్ణ దేవ రాయలంటే రాజాగారికి ప్రత్యేకాభిమానం. సత్పరిపాలనకూ, సాహిత్యపోషణకూ, సర్వకళా సమాదరణకూ తననాటి పాలకులకందరకూ ఆయన ఒజ్జబంతి అని రాజాగారు భావించేవారు. ఆ భావనయే ఆదిపూడి సోమనాథరావుగారి చే 'శ్రీ కృష్ణదేవరాయచరిత్రము'* అన్న ప్రబంధాన్ని నిర్మింపజేసింది. దీనికి కృతిభర్తృత్వం వహించి రాజాగారు కృతికర్త శ్రీ సోమనాథరావుగారిని ఎన్నో విధాల సమ్మానించారు.

ఆధునికాంధ్ర సాహిత్యంలో మొట్టమొదటి చారిత్రిక కావ్యం శ్రీ కట్టమంచి రామలింగారెడ్డిగారి 'ముసలమ్మ మరణము' తరువాతిది ప్రస్తుత చర్చలోని 'శ్రీ కృష్ణదేవరాయ చరిత్రము'. ఆ పిమ్మట దుర్భాక రాజశేఖర శతావధానిగారి 'శివభారతము', తుమ్మల సీతారామమూర్తిగారి 'మహాత్మకథ', శంఖవరం రాఘవాచార్యుల 'విశ్వనాథ విజయము', బాడాల రామకవిగారి 'కృష్ణకథా విపంచి', చేబోలు చిన్మయబ్రహ్మ కవిగారి 'విశ్వదాభిరామము' మొదలైన చారిత్రిక కావ్యాలనేకం వెలువడ్డాయి. సోమనాథరావుగారి ఈ రచనకు సూయెల్ దొరగారి విస్మృత సామ్రాజ్యము, చిలుకూరి వీరభద్రరావుగారి 'జీర్ణకర్ణాట రాజ్యము' ముఖ్యాధారాలు. కుమారధూర్జటి కృతమైన 'కృష్ణరాయవిజయ' ప్రసంగం పీఠికలో ప్రసక్తమైనప్పటికీ, దాని పోలిక లెక్కడా ఈ ప్రబంధంలో కన్పించవు. ఇది ఆరాశ్వాసాల వీరరస ప్రధానమైన కావ్యం. వితరణశాలి, వీర రణోత్సవశీలి అయిన తుళువ నరసరాయల పాలనతో మొదలైన ఈ ప్రబంధం 'శస్త్ర విక్రమ సంపన్నుఁ డస్తమించె' అని కృష్ణదేవరాయల అస్తమయంతో సమాప్తమైంది. మచ్చుకు ఒక పద్యం చూడండి :

* ఆనంద స్టీము ముద్రాక్షరశాల, చెన్నపురి, 1907.

'దేవాధీశునిఁగొల్చి దీనతతులన్ ధీవర్యులంబ్రోచి స
ద్భావం బొప్పఁగ దండనాథులను సత్కారంబులం దన్పి భూ
దేవేంద్రుండు జయోత్సవంబు సలిపెన్ దేదీప్యమానోద్ధతిన్
గైవారంబులు గన్నడంబునకుఁ గల్గన్ నల్గడన్ భూవరా!' (4 97)

మునగాల రాజాగారి వియ్యంకులు-వనపర్తి సంస్థానాధీశ్వరులు రాజా సవై రామేశ్వరరాయలవారు. ప్రాచీన గ్రంథ సంపాదనంలోను, తత్ప్రచురణ విధానంలోను, సాహితీ తత్త్వ పరిశోధనంలోను జగమెరిగిన విద్వత్పరిశోధకులు శ్రీ మానవల్లి రామకృష్ణ కవిగారి (1866-1957)కి ఆశ్రయ మిచ్చి ఆంధ్ర సాహితీ జగతికి అపూర్వమైన కృతిసంతతిని సమర్పించినకీర్తి ఈ వనపర్తిసంస్థానాధీశ్వరులది. రామకృష్ణకవిగారు పదేళ్లపాటు వనపర్తి సంస్థానాశ్రయంలోవుండి గ్రంథపరిశోధన ముద్రణాదుల గావించారు. శ్రీ కవిగారితో పెక్కురంగాలలో సాటికీ పోటికీ రాగలిగిన మహావిద్వాంసులు కొమర్రాజు లక్ష్మణరావుగారు మునగాల ప్రభువుల ఆశ్రయంలో విలసిల్లడం అనేది విద్వత్పోషకులైన ఈ వియ్యంకుల ఆశయ సామ్యానికి తార్కాణ.

మునగాల రాజాగారి రెండో కొమార్తె రాణి సరళాదేవిగారు వనపర్తి రాజా స్వర్గీయ శ్రీ కృష్ణదేవరాయలవారి అర్ధాంగి. సన్నిధానం సూర్యనారాయణ శాస్త్రిగారి 'పువ్వుల తోట' అన్న ఖండకావ్యం సరళాదేవిగారి ప్రేరణచే కృష్ణరాయలవారి ఆత్మకు అంకిత మీయబడింది. సరళాదేవిగారి కుమారులు రాజా మూడవ రామేశ్వరరాయలు మాతామహులమాదిరిగానే వితరణగుణంలో, విద్యా పోషణంలో పెద్ద పేరుపెంపులు కలవారు.

శ్రీ రాజాగారికి వారి బహుముఖమైన విద్యా విజ్ఞానాభిలాషనూ, తత్పోషణాన్నీ పురస్కరించుకొని ఆంధ్ర విశ్వవిద్యాలయంవారు 1953 జనవరి 5న జరిగిన రజతోత్సవ సందర్భంలో. సర్వేపల్లి రాధాకృష్ణపండితుల సమక్షంలో 'కళాప్రపూర్ణ' అనే గౌరవ డాక్టరేట్ బిరుదం ఇచ్చి సత్కరించారు. ఆ సమయంలో విశ్వవిద్యాలయ వక్త ఉయ్యూరు కుమార రాజా శ్రీ ఎం. ఆర్. అప్పారావుగారు చేసిన ప్రఖ్యాపన ప్రసంగ భాగాలను ఉట్టంకించి విరమిస్తాను:

"...ఆంధ్ర పునరుజ్జీవనోద్యమ చరిత్రకారునకు శ్రీ నాయని వేంకట

రంగారావుగారి విద్యా విజ్ఞానాభిలాషయు, తత్పోషణమును ప్రశంసచేయుట ముఖ్య కర్తవ్యము కాగలదని మనవి చేయుచున్నాను.

"విశాలాంధ్రమునకు హైదరాబాదు రాజధాని కా దగునని కొందఱు మిత్రు లిప్పుడు చేయు సూచన అర్ధశతాబ్ది క్రిందనే రంగారావుగారికి స్ఫురించెనో, యేమొ, అచట శ్రీ కృష్ణరాయ గ్రంథాలయము నెలకొల్పి, అభ్యుదయ పరంపరాభివృద్ధిగా నడచుచున్న దాని స్వర్ణోత్సవము మొన్ననే కన్నుల పండువుగా చూచుకొన్నారు..."

*    *    *

"అభిజనమునకు ఉచితమైన అకలుష వర్తనము, ఆడంబర రహిత జీవనము, భారతీయ సంస్కృతి యందసమానమైన అభిమానము, అవేలమగు ఆంధ్రతా భావ వికాసము శ్రీ రంగారావుగారియందు రాశీభూతముగా నున్న విశిష్ట గుణములు" అని పై ప్రసంగంలో శ్రీ అప్పారావుగారు చెప్పినట్లు ఆంధ్ర సంస్కృతి పునర్వికాస కారకుడైన ఈ చరితార్థుణ్ని మనసారా స్మరించుకొని ఈ సభ సైతం చరితార్థ మవుతున్నది.

---

# స్వర్గీయ ఆదిరాజు వీరభద్రరావు పంతులుగారి జీవితము — భాషాసేవ

— *గడియారము రామకృష్ణశర్మ*

## ౧. జీవితము

*శివప్రకమణిక*

"నమ్రత్వేనోన్నమంతః పరిగుణనుతిభిః స్వాన్‌గుణాన్ ఖ్యాపయంతః
పుష్ణంతః స్వీయమర్థం సతతకృత మహారంభ యత్నాః పరార్థే
క్షాంత్యైవాక్షేపరూక్షాక్షర ముఖరముఖాన్ దుర్ముఖాన్ దుఃఖయంతః
సంతః సాశ్చర్య చర్యా జగతి బహుమతాః కస్య నాభ్యర్థనీయాః॥

'సజ్జనులు తాము నమ్రులై తమ ఔన్నత్యమును చూపెదరు. ఇతరుల సుగణములను పొగడి గుణములను ప్రకటించెదరు. నిరంతరము పరులకొరకై పాటుపడుచు తమ ప్రయోజనములనుకూడ సాధించికొనెదరు. తమ్ము కటువుగా ఆక్షేపించుచుండువారిని క్షమతోడనే దుఃఖితులను చేసెదరు. సత్పురుషుల ఈ చర్యలు ఎవరికి ఆశ్చర్యము కలిగింపవు? వారు ఎవనికి కోరదగినవారు కారు?' అని దీని భావము.

ఇందలి సజ్జనలక్షణములన్నిటిని కలిగి, అందలి 'పుష్ణంతః స్వీయమర్థం' అనునది దోషముకాకున్నను దానికి అపవాదముగా ఉన్న మహామనీషులు మా ఆదిరాజు వీరభద్రరావు పంతులుగారు.

ఇటీవలి వరకు హైదరాబాదు నగరములో జరుగు ప్రతి సాహిత్య సభలోను తెల్లని తలపాగా లేక గాంధీటోపీ, ముడతలు పడిన పాతకోటు, సీరుకావి ధోవతి, బక్కచిక్కిన శరీరము, తాంబూల రాగరంజితమైన బోసినోరు, ప్రసన్న మందహాసము, స్నేహపూర్ణములైన చూపులు, భుజముపై ప్రేలాడ వేసికొన్న వలసంచి కల పంతులుగారి నిరాడంబర విగ్రహము మనకు సాక్షాత్కరించుచుండెడిది. అవయవాలు అవసన్నములై రోగశయ్యమీద కదలలేక వరుండికూడ తమకు ప్రియమైన సాహిత్య వ్యాసంగమును వదలని మహాయోధులు పంతులుగారు. వారు నేడు భౌతికకాయమును చాలించినను వారి యశఃకాయము మనముందు నిలిచి కర్తవ్యముల నాదేశించుచున్నది.

పంతులుగారి జీవితచరిత్ర ఒకవ్యక్తిచరిత్రకాదు. మామిత్రులన్నట్లు ఇది గడచిన ఎనుబది సంవత్సరాలలో తెలంగాణమునందు జరిగిన సాంస్కృతిక పునరుజ్జీవన సమీక్ష; ఇచట సాగిన ప్రజోద్యమాల చరిత్ర. ఈ నగరమునందు పంతులుగారి ప్రత్యక్ష సంబంధ సహకారములు లేని గ్రంథాలయముగాని, ఆంధ్ర విద్యాలయముగాని, సాహిత్య సంస్థగాని, ఆంధ్రసంఘముగాని లేదన్నచో అతిశయోక్తికాదు. ఈ విధముగా తెలుగువారి సర్వతోముఖాభ్యుదయముతో పెనవేసికొన్న వారి మహాజీవితమును తక్కువ వ్యవధిలో తెలుపుట కష్టము.

వారు పుట్టి పెరిగిన నాటి తెలంగాణా పరిస్థితులను ఒకసారి సింహావలోకనము చేసికొన్నగాని వారి మహాకృషి అవగాహనము కాదు. నేడు హైదరాబాదు నగరములో తెలుగువాడు తలయెత్తుకొని సగౌరవముగా జీవించుచు అన్ని రంగాలలో ముందుకు సాగుచుండుటకు ఎందరో మహావ్యక్తులు ప్రత్యక్షముగ, పరోక్షముగ ఫలాపేక్షలేక సాగించిన మహత్తర కృషియే ముఖ్యకారణము – అట్టి మహావ్యక్తులలో వీరభద్రరావు పంతులుగారు పేర్కొనదగిన వారు.

*నాటి పరిస్థితులు :*

అప్పటి హైదరాబాదు రాజ్యముమీద భారత దేశపరిస్థితుల ప్రభావము అనివార్యముగా పడక తప్పలేదు. అక్కడ స్వరాజ్యోద్యమము తీవ్రముగా సాగుచుండెను. బ్రిటిషువారు దానిని అణచుటకు ఎత్తులమీద ఎత్తులు వేయుచుండిరి. విధిలేక విభజించి పాలించు నీతి నవలంబించి దేశీయులను హిందూ ముస్లిం సంఘాలుగా చీల్చు యత్నములు చేసిరి. అధికసంఖ్యాకులపై అల్పసంఖ్యాకులను పురికొలుపుటకై 'ముస్లింలీగు'ను సృష్టించిరి. ప్రత్యేకముగా ఇందుకై అలీఘరులో 'ముస్లిం విశ్వవిద్యాలయము'ను స్థాపించిరి. దానిలో తయారైన పట్టభద్రులు ముస్లింరాజ్యమైన హైదరాబాదు తమకు కార్యరంగముగ పనికివచ్చునని తలచిరి. ఈ పరిస్థితులలో కడపటి నిజాం నవాబు మీర్ ఉస్మానలీఖాన్ 1911లో సింహాసన మెక్కెను. ఆంగ్లపాలకుల చలవవలన మెల్లమెల్లగా ఉత్తర భారతము నుండి ముస్లిం విద్యాధికులు హైదరాబాదు చేరి ఉన్నత పదవులలో స్థిరపడుచుండిరి. అంతవరకు ఏ కలతలులేక అన్నదమ్ములవలె మెలగుచుండిన ముస్లిములలో లేనిపోని అనుమానములు, ఆశలు రేకెత్తించబడెను. ఇచటగూడా "అంజుమనె ఇత్తెహాదుల్ ముసల్మీన్" అను మత దురహంకార

సంస్థ తలయెత్తెను. ఉరుదూ రాజకీయభాష చేయబడెను. ఉరుదూ బోధనా భాషగా ఉస్మానియా విశ్వవిద్యాలయము ఏర్పడెను. అల్ప సంఖ్యాకులకు ఉన్నత విద్యను, అధికారములను కట్టబెట్టుచుండిరి. ప్రాంతీయభాషలకు ఏవిధమైన ప్రోత్సాహము లేదు. ప్రజలకు ప్రాథమిక సౌకర్యములు గూడలేవు. అధిక సంఖ్యాకులైన ప్రజలు నిత్యము నిర్బంధశాసనములకు గురియగుచు అవమానింపబడుచుండిరి. వారు తమ పొరుగురాష్ట్రములలో సాగుచుండిన ఉద్యమాలపై ఆసక్తి కలిగించుకొనుచుండిరి. వాని ప్రభావములకు లోనగుచుండిరి. నిర్బంధముగ రుద్దబడుచుండిన శాసనముల వలన ప్రజలు నానాబాధలు పడుచుండిరి. గుడి కట్టరాదు, బడి పెట్టరాదు. నలుగురు కలిసి తమ అవస్థలు చర్చించు కొనుటకు సమావేశము కారాదు. గ్రంథాలయము పెట్టరాదు. అప్పటి తెలంగానా దుర్దశను వీరభద్రరావు పంతులుగారే ఇట్లు వర్ణించినారు.

"నిజాం రాష్ట్రములోని 8 తెలుగు జిల్లాలలో 60 లక్షల జనులుండిరి. అయిననేమి ఇతర ప్రాంతాలతో బోల్చినపుడు ఇచటి తెలుగువారి స్థితి ఎంతయు విచారకరముగ ఉండెను. ఎనిమిది జిల్లాలలో ఒకటి మాత్రమే ఇంగ్లీష్ హైస్కూలు ఉండెను. తదితర విద్యాలయములయినను మహారాష్ట్రాది ఇతర మండలముల కంటె చాల తక్కువగా ఉండెను. పత్రికా పఠనేచ్ఛ మృగ్యముగా నుండెను. ఆంధ్ర చరిత్రకు దోహదకారులైన శిలాశాసనాదులు తండోపతండములుగా ఉన్నను, వాటిపై దృష్టిని బరపినవారే లేకుండిరి. దేశభాషలపై అభిమానము శూన్యముగా నుండెను. ధనవంతులు, సంస్థానాధిపతులు, దేశముఖులు, వర్తకులు దేశాభివృద్ధిపట్ల విముఖులయి మెలగుచుండిరి. తెలుగువారు అనుదిన జీవనమునందు సమయాసమయాలు లెక్కచేయక ఉరుదూ భాషను మాట్లాడుకొనుటయే పరమార్థము, నాగరకత అనుకొనుచుండిరి. ఒకవేళ తెలుగు మాట్లాడినను" బమొకద్దమే ముందర్జే ఉన్వాన్ నిగారిష్ ఇది గదా" అనుచు సంకర భాషను వాడుచుండిరి. తెలంగాణా జనులు శారీరక, మానసిక పుష్టిలేక ధార్మిక-సామాజిక, పారిశ్రామిక, రాజకీయాది తత్వముల నెరుగక అజ్ఞానాంధకారములో నిద్రాముద్రితులై ఉండిరి." అని ఆంధ్ర పితామహుల షష్టిపూర్తి సంచికలో వ్రాసినారు.

ప్రజలు ఈ స్థితిలోను ప్రభుత్వ శాసనాలు ప్రతిబంధకాలుగాను ఉన్నప్పటికి దేశదుర్గతిని పోగొట్టుటకు కొందరు మేధావులు నడుము కట్టినారు.

క్రమముగా గ్రంథాలయోద్యమము, ఆంధ్ర భాషావికాసోద్యమము, రాజకీయోద్యమము, సాంఘిక సేవా ఉద్యమము ప్రారంభమైనవి. అన్నిటిని ప్రభుత్వము, ముస్లిం ప్రజలు సమానముగా అణచివేయుటకు తీవ్రయత్నాలు చేసినారు. కాని అన్నియు వ్యర్థమైనవి. ప్రతిఘటనోద్యమాలు బలపడినవి. కాలము కలసిరాగా అభివృద్ధి నిరోధక శక్తులను నిర్మూలించి నిరంకుశపాలనను అంతమొందించినవి. ఈ అన్ని ఉద్యమాలతో వీరభద్రరావు పంతులుగారికి ప్రత్యక్ష పరోక్ష సంబంధములున్నవి. ఈ పరిస్థితులను గ్రహించినచో శ్రీవారి జీవితమెంత మహోన్నత మైనదో తెలిసికొనవచ్చును.

*జననాదులు*

పంతులుగారు ఆర్షేయ పౌరుషేయములు గల ఆరువేలనియోగి బ్రాహ్మణ కుటుంబములో 1890 సంవత్సరమున జన్మించినారు. వారి జన్మస్థానము ఖమ్మంమెట్టు జిల్లా—మధిరతాలూకా దెందుకూరు గ్రామము. అదొక చిన్న పల్లెటూరు; తల్లి వెంకమ్మగారు—తండ్రి లింగయ్య పంతులుగారు చాల బీదవారు. ఆయన తన గ్రామములో ఉన్న కరోడ్గిరినాకాలో (కష్టమ్సు ఆఫీసు) గుమాస్తా పని చేయుచు తక్కువ జీతముతో ఎట్లో మర్యాదగా కాపురము చేయుచుండిరి. ఆయన కుమారుని కీర్తి ప్రతిష్ఠలను చూచి ఆనందించు అదృష్టమునకు నోచికొనలేదు. పుత్రుడు 5 ఏండ్లవాడై ఉండగా చనిపోయిరి. ఆ కుటుంబమునకు తీవ్రాఘాతము కలిగినది. అదే వయసులోనే పితృవియోగము పొంది కష్టములపాలైన ఆంధ్ర పితామహుల చరిత్ర వ్రాయుచు పంతులుగారు "జీవితపథము కంటకావృతమై యుండుటయు, అంధకార బంధురమై యుండుటయు మహాపురుషుల జీవిత లక్షణము" అని వ్రాసినారు. అది వీరి జీవితమునకును అన్వయించును, దొడ్డయిల్లాలైన వెంకమ్మగారు కుమారుని శ్రేయమును కోరి పలుబాధలు పడిరి. చివరకు తాను చెల్లెలి ఇల్లు చేరుకొని కుమారుని పెదతండ్రిగారి దగ్గరకు పంపిరి.

*విద్యాభ్యాసము*

పంతులుగారి పెదనాన్నగారు ఆదిరాజు రామకృష్ణారావుగారు అప్పుడు చింతకాని పోలీసు ఠానాలో 'నవిసిందా' (లేఖరి) గా పని చేయుచుండిరి. అందువలన ఆ ఊరి వీధిబడిలోనే వారికి అక్షరాభ్యాసము జరిగెను. ఆ

వీథిబడి ఉపాధ్యాయుడు వీణె సీతారామయ్యగారు చక్కని బోధనాశక్తిగల పండితుడు. పూర్వకాలపు వీథిబడులలోని విద్యా విధానము నేటి విద్యార్థులకు పరిచయము లేనిది. అందు విద్యాభ్యాసకాలము సూర్యోదయము నుండి సూర్యాస్తమయమువరకు-మధ్య భోజనాదులకు కొంత విరామము ఉండెడిది. అందు తరగతులు లేవు. దైవప్రార్థనతో దినచర్య ప్రారంభమగును. పెద్ద బాలశిక్ష-ఎక్కాలు-లెక్కలు, అమరము-ఆంధ్రనామ సంగ్రహము, ప్రార్థనా శ్లోకములు పద్యములు కంఠస్థము చేయించబడును. తరువాత భారత భాగవత రామాయణములలో ప్రధాన ఘట్టములు బోధింపబడును. విద్యార్థులకు నిర్బంధముగా చక్కనివ్రాత, ఎంత చిక్కువ్రాతలనైన సులువుగా చదువుట నేర్పుచుండిరి. 4-5 ఏండ్లు ఆ బడిలో చదివినచో తెలుగులో మంచిజ్ఞానము, వ్యవహారమునకు తగినంత లెక్కల పరిజ్ఞానము-ముత్యాలకోవవంటి వ్రాత, శుద్ధమైన ఉచ్చారణము అన్నిటికంటె ముఖ్యమైన వినయవర్తనము, పెద్దలపట్ల దైవమువట్ల భక్తి పట్టుబడుచుండెను. నేడు ప్రైమరీస్కూలు చదువునకు పట్టునంత కాలములో అంత యోగ్యత కలుగుచుండెను, ఇప్పుడు ఉన్నతపాఠశాల విద్య పూర్తి చేసినవారు గూడ తప్పులు లేకుండ వ్రాయలేరు- చదువలేరు. భారతాదులలో 17 పద్యాలు చదువలేరు. నిత్య జీవితమునకు అవసరమైన వ్యవహారజ్ఞానము ఉండదు. కష్టబడి పెంచి చదువు చెప్పించిన తలిదండ్రులపై అసహ్యము-ఉపాధ్యాయునిగూర్చి తిరస్కారము చూపెదరు-ఇది మనకు నిత్యానుభవములో ఉన్న విషయము. విద్యారంగము కోట్ల రూపాయలను ధ్వంసము చేయుచు వాయువేగ మనోవేగములతో సాగుచున్నది.

పంతులుగారి విద్యాభ్యాసమునకు అ వీథిబడిలో చక్కని పునాది యేర్పడినది. చురుకైన బుద్ధి కలవారగుట వలన అనేక విషయములను ఆకళించుకొని తోటి విద్యార్థులలో మేటి అనిపించుకొనిరి. ఒక ప్రక్క చదువు నేర్చికొనుచు విశ్రాంతిసమయములో తమ పెదతండ్రిగారికి అవసరమైన వ్రాత పనులు చేసిపెట్టుచుండిరి. నైజాం పాలనలో పైస్థాయి యందు ఉరుదూ కొనసాగినను గ్రామస్థాయిలో తెలుగులోనే వ్రాత సాగుచుండెను. పంతులుగారు కొన్నాళ్ళు చింతకాణిలోను, 'కొణిజర్ల' లో కొన్నాళ్ళను చదువు సాగించిరి. పెదతండ్రిగారి ప్రాపకము ఉన్నప్పటికి వారి ప్రాథమిక విద్య అవస్థలతో సాగి ముగిసినది. వయసు తక్కువ, ఉన్నతవిద్యావకాశములు లేవు. ఆ స్థితిలో

వెంకమ్మగారు ఆలోచించి తమ కుమారుని హైదరాబాదులో ఉన్న శ్రీమంతులు, ఉదారులు, తమ దూరపు బంధువులు అయిన శ్రీ రావిచెట్టు రంగారావుగారి దగ్గరకు పంపిరి. రంగారావుగారి భార్య లక్ష్మీనరసమ్మగారును వెంకమ్మగారును ఒక ఊరివారు. ఊటుకూరి వారింటి ఆడుబిడ్డలు. ఆదర్శవర్తనులైన రంగారాయ దంపతులు వీరభద్రరావుగారిని తమ కుమారునివలె ఆదరించిరి. వారికి సంతానములేదు. నిస్సహాయ స్థితిలో ఉన్న వీరభద్రరావుగారికి మహదాశ్రయము లభించినది.

రావిచెట్టు రంగారావుగారు హైదరాబాదులో పేరు మోసినవారు, సరసులు, సాహిత్యాభిమానులు, దేశభక్తులు. వారి ప్రయత్నముచే పంతులుగారు చాదరఘాటు ఉన్నత పాఠశాలలో చేరిరి. ఇంటిదగ్గర ఇంగ్లీషు మొదలైన పాఠ్యాంశములను నేర్చుకొని ఫస్టుఫారములో ప్రవేశించిరి. అప్పుడు బ్రహ్మశ్రీ రాయప్రోలు వెంకట సోమయాజులుగారు ఆంధ్రోపాధ్యాయులుగా ఉండిరి. సహజముగా సాధువర్తనులైన పంతులుగారికి హైస్కూలులో చక్కని క్రమశిక్షణ చక్కని భాషాపరిజ్ఞానము అలవడినవి, శ్రద్ధతోచదివి ప్రతిసంవత్సర పరీక్షలో ఉత్తీర్ణులగుచు మెట్రిక్ వరకు చదివిరి. అంతలో తీవ్రమైన అనారోగ్యమునకు గురిఅయి వారు మెట్రిక్ పరీక్షలో ఉత్తీర్ణులు కాలేకపోయిరి. రంగారావుగారు వారి ఆరోగ్యమునకై చేసిన యత్నములన్నియు విఫలమైనందున పైచదువు సాగలేదు. అంతటితో వారి ఉన్నతవిద్య ముగిసినది.

పెద్దల సాహచర్యము

పూర్వపుణ్యము లేనిదే సత్పురుషుల సాహచర్యము లభింపదని పెద్దలందురు పైచదువు అబ్బకపోయినను వారికి విద్వద్వరేణ్యులైన శ్రీ కొమర్రాజు లక్ష్మణరావుగారితో, శ్రీ ఆదిపూడి సోమనాథరావుగారితో, ఆంధ్రభాషాభిమానులు, అభ్యుదయ భావోపేతులు అయిన శ్రీ రావిచెట్టు రంగారావు, మునగాల రాజా శ్రీ నాయని వెంకటరంగారావు బహద్దరు గారలతో సాహచర్య భాగ్యము లభించినది. వారిలో సహజముగ ఉండిన మాతృభాషాభిమానము పొంగినది.

పరతంత్రులైన ప్రజలు స్వతంత్రులగుటకు వారి మాతృభాష ఆధారమైనట్లు మరొకటి కాజాలదు. ఈ సత్యమును మొట్టమొదటిసారిగ గ్రహించి లోకమునకు చాటినవారు తెలుగువారే. ప్రజలభాషలో సర్వవ్యవహారములు సాగవలెనను పట్టుదలతో భాషాధారక రాష్ట్రోద్యమమును జాతీయోద్యమ సారథులచే

ఆమోదింపజేసిన వారును ఆంధ్రులే. భారతదేశములో ఈ పరిణామము జరుగుచున్న సమయమున తెలంగాణములో ప్రజల సర్వతోముఖ వికాసమునకు సుస్థిర స్వరూప మొసగుటకై మొదట గ్రంథాలయోద్యమము కొనసాగినది. మహా మేధావులు-సుప్రసిద్ధప్రామాణిక పరిశోధకులు అయిన శ్రీ కొమఱ్ఱాజు వెంకట లక్ష్మణరావుగారు, భాషాభిమానులైన రావిచెట్టు రంగారావుగారు, మునగాల రాజాగారు ముగ్గురును కలసి హైదరాబాదులో 1901 సంవత్సరమున శ్రీ కృష్ణ దేవరాయాంధ్ర భాషానిలయమును స్థాపించిరి. ఆరంభములో అది రావిచెట్టు వారింట చాలకాలము ఉండెను. దానికి రంగారావుగారే కార్యదర్శిగా ఉండిరి. ఇందలి సంస్కృతాంధ్ర గ్రంథములను జిజ్ఞాసువులైన వీరభద్రరావుగారు ప్రత్యేక శ్రద్ధతో చదివి తమ విద్యావిజ్ఞానములను పెంచికొనిరి. ఈ గ్రంథాలయమునే కాక పై ముగ్గురు పెద్దలును తెలుగువారి అభివృద్ధికి అవసరములైన ఉత్తమ గ్రంథములను వ్రాయించి ప్రచురించుటకై "విజ్ఞాన చంద్రికా గ్రంథమాల"ను ప్రారంభించిరి. అదికూడ రావిచెట్టువారింటనే నెలకొనెను. రావుగారే కార్యదర్శిగా ఉండిరి. ఈ రెండు సంస్థల నిర్వహణలో రంగారావుగారికి పంతులుగారు అన్ని విధముల చేదోడు వాదోడుగా ఉండిరి. విద్యాభివృద్ధితోబాటు, కార్యదక్షత, సేవా పరాయణత్వము వారికి అలవడినవి. ఇవి వారి పురోభివృద్ధికి మూలకందము లైనవి.

ఆ తరువాత బహుకార్యవ్యగ్రులైన రంగారావుగారు తమకు తీరికలేక వీరభద్రరావుగారిని భాషానిలయములో లైబ్రేరియన్ పనిలో ఉంచిరి. ఆ బాధ్యతలను వారు సమర్థతతో నిర్వహించిరి. తమ పాండిత్యమును వృద్ధిచేసికొనుచు తోడి తెలుగువారికి విజ్ఞానము నందించుటకై పాటుబడిరి. ఈ సమయమున వారు ఆంధ్రవాఙ్మయమును మథించిరి. చక్కని చిక్కని పాండిత్యమును సాధించిరి.

కొంతకాలమునకు విజ్ఞానచంద్రికా గ్రంథముల కార్యాలయము మదరాసునకు మారినది. రావిచెట్టువారి నివాసముగూడ అచ్చటికి మారెను. వారి నిర్బంధముచే పంతులుగారు ఆ కార్యాలయములో లేఖకులుగా నియుక్తులైరి. మదరాసులో ఉన్న కాలమున వారికి శ్రీ కందుకూరి వీరేశలింగంపంతులు, శ్రీ చిలుకూరు వీరభద్రరావుగారు. శ్రీ గురుజాడ అప్పారావు, శ్రీ మల్లంపల్లి సోమశేఖరశర్మ-శ్రీ వేమూరి విశ్వనాథశర్మ గారలవంటి విద్వాంసులు, పరిశోధ

కులు, మేధావులతో కలసి పనిచేయు సదవకాశము లభించినది. పంతులుగారి సహజ విమర్శనా శక్తి విజృంభించినది.

> "అనపేక్షిత గురువచనా, సర్వాన్ గ్రంథీన్ విభేదయతి సమ్యక్,
> ప్రకటయతి పర రహస్యం, విమర్శశక్తి ర్నిజాజయతి"

అన్నారు పెద్దలు. నైజమగు విమర్శ శక్తి గురుబోధను అపేక్షింపదు. అన్ని చిక్కులను విడదీసి పర రహస్యములను ప్రకటించును. అట్టి శక్తికి జయమగుగాక ! అని భావము. పంతులుగారిలో దైవదత్తమగు విమర్శశక్తి పుష్కలంగా ఉండినది. అది తరువాత వారి పరిశోధనాకృషికి వన్నె కూర్చినది.

## వివాహము

అప్పుడప్పుడే వీరభద్రరావుగారు విద్యాభివృద్ధి చేసికొనుచు 17వ సంవత్సరములో అడుగు పెట్టిరి. ఇంతలో వారి పోషకులైన రావిచెట్టు రంగారావుగారి బలవంతముతో 1907లో వివాహము చేసికొనవలసివచ్చెను. వారి సహధర్మచారిణి లక్ష్మీనరసమ్మగారు పింగళి వారింటి ఆడుబిడ్డ. అమె పుట్టినిల్లు పరిటాల. అన్ని విధముల పంతులుగారికి అర్ధాంగ లక్ష్మిగా ఉండిరి. ప్రతి నెలలో ఎవరో ఒక పండితుడు వారి పంక్తిలో లేని దినములు చాల తక్కువ. దుర్బల శరీరులై ఉండినా ఓపికతో కన్నతల్లివలె అతిథుల నాదరించిన అన్నపూర్ణాదేవి ఆమెగారు. స్త్రీలకు సహజమైన వస్త్రభూషణములపై ఆసక్తి లేక నిర్లిప్తతతో గృహిణీధర్మమును శ్రద్ధతో పాలించిన దొడ్డ ఇల్లాలు. వారి అనుకూల దాంపత్యము ఇతరులకు ఆదర్శప్రాయమైనది. ఆమె తోడ్పాటుతో పంతులుగారు సంసార సాగరమును సులభముగ తరించిరి.

## ఉద్యోగములు

వీరభద్రరావుగారు నిర్ధనులైనను మానధనులు. వారికి ఆత్మాభిమానమెక్కువ. తలిదండ్రుల వలె రావిచెట్టు దంపతులు అనురాగముతో పోషించుచున్నను వివాహమైన తరువాత ఉభయులభారమును వారిపై వేయరాదని, వేరు కాపురము పెట్టవలెనని నిశ్చయించిరి. వారినిర్ణయమునకు తిరుగులేదు. పంతులుగారి స్వభావమును బాగా ఎరిగిన రావిచెట్టువారు మదరాసులో విజ్ఞానచంద్రికా కార్యాలయమున లేఖకులుగా నియమించిరి. అదే వారి మొదటి ఉద్యోగము.

అప్పటి వేతనము నలుబది రూపాయలు. ఆ నగరము క్రొత్త-కాపురము క్రొత్త, వేతనము తక్కువ. అయినను ధీరులై సంసారమును, తమ ఉద్యోగ ధర్మమును సమర్థతతో నిర్వహించి పెద్దల మెప్పు సంపాదించిరి.

ఆ రోజులలో విజ్ఞాన చంద్రిక ఎన్నో ఉత్తమ గ్రంథాలను సమర్థులచే వ్రాయించి ప్రచురించినది. ఈ గ్రంథమాలతో బాటు శ్రీ. లక్ష్మణరావుగారు దేశోద్ధారకుల సహాయముతో 'ఆంధ్ర విజ్ఞాన సర్వస్వము' ను ప్రచురించు మహాప్రయత్నము చేయుచుండిరి. కార్యదక్షులు-ఉత్సాహపంతులు-భాషాభిమానులు అయిన పంతులుగారు గురుతుల్యులైన లక్ష్మణరావుగారికి అన్ని విధముల తోడ్పడుచు రాత్రింబగళ్లు శ్రమను లెక్కచేయక పనిచేసిరి. ఈ విధముగా 1908 నుండి 1914 వరకు వారి మదరాసు కాపురము సాగినది. కొన్ని అవాంతర పరిస్థితులవలన ఉద్యోగమును మానుకొని వారు హైదరాబాదుకు తిరిగి వచ్చిరి.

అప్పటికి శ్రీ మాడపాటి హనుమంతరావు పంతులుగారు హనుమకొండ నుండి నగరమునకు వచ్చి తమ వకీలువృత్తిని కొనసాగించికొనుచు శ్రీ కృష్ణదేవరాయాంధ్ర భాషానిలయ కార్యదర్శిగా పని చేయుచుండిరి. అప్పుడు పంతులుగారికి వారితో పరిచయము కలిగెను. అప్పటినుండి వారు ఆప్తమిత్రులై మెలగిరి. మాడపాటివారి సాహచర్యముతో పంతులుగారి జీవితము మలుపు తిరిగెను..

1914లో నగరమునకు వచ్చిన వెంటనే సికింద్రాబాదులోని మహబూబ్ కాలేజి ఉన్నత పాఠశాలలో తెలుగు పండితులుగా చేరి ఉత్తమ బోధకులుగా 1921 వరకు పనిచేసిరి. అది ప్రయివేటు సంస్థ. తరువాత విద్యనభ్యసించిన చాదరుఘాటు హైస్కూలులో ఆంధ్రోపాధ్యాయులుగా ప్రవేశించిరి. అది ప్రభుత్వ పాఠశాల. వారికి పాండిత్యముతోబాటు చక్కని బోధనాశక్తి అలవడినది. వారందు 1921 నుండి 1948 వరకు పనిచేయుచు ప్రజాహిత సంస్థలతో సంబంధము కలిగియుండిరి. తమ 58వ యేట ఉద్యోగము నుండి విరమించిరి. పంతులుగారి శక్తిని-సేవానిరతిని గ్రహించిన మాడపాటివారు వెంటనే తాము నిర్వహించుచున్న నారాయణగూడ బాలికోన్నత పాఠశాలలో పని చేయవలెనని కోరిరి. అక్కడ 1949 నుండి 1953 వరకు పని చేసిరి. ఆ పాఠ

శాలలో వారు చేసిన కృషి నిరుపమానమైనది. వారి దగ్గర విద్యాభ్యాసము చేసిన బాలబాలిక లెందరో నేడు ఉన్నత పదవులందున్నారు.

వారు తెలుగు పండితులుగా ఉండినను మనకెందుకని ఊరకుండక తమ పాఠశాలలో జరుగుచుండు సాంస్కృతిక కార్యక్రమాలలో పాల్గొనుచు తోడి ఉపాధ్యాయులతో కలసి పని చేయుచుండిరి. ఉద్యోగ కాలములో వారెన్నడును తమ విధిని అలక్ష్యము చేయలేదు. ఒడలు దాచుకొనలేదు. వేతనము స్వల్పమైనను తమ పవిత్ర కర్తవ్యమును నిర్వహించుటకై రాత్రింబవళ్ళు పాటుబడుచుండిరి.

పంతులుగారికి క్రీడంమీద చాల ఆసక్తి ఉండెను. విద్యార్థుల మానసిక వికాసమునకు విద్య ఎంత అవసరమో శారీరిక వికాసమునకు క్రీడలు అంత ముఖ్యమని వారి అభిప్రాయము. విద్యార్థులలో క్రమశిక్షణ, సేవా నిరతి, దేశ భక్తి మొదలైన సుగుణములను పెంపొందించుటకు స్కౌటు ఉద్యమము చాల తోడ్పడునని వారి నమ్మకము. పంతులుగారు స్కౌట్ మాష్టరుగా ఆదర్శవంతమైన కృషి చేసినారు; అయిదు బాల భట సంఘములకు వారు నాయకులుగా ఉండిరి. నగరములో జరుగుచుండు మహాసభలకు, ఉత్సవాలకూ తమ బాల భట సంఘములతో వెళ్ళి అచట చక్కని వ్యవస్థ ఏర్పరచుచుండిరి.

ఉద్యోగము నిర్వహించుచు రచనా వ్యాసంగము చేయుచు వారు ప్రతి ఫలాపేక్షక లేక ప్రజా సంస్థలతో సహకరించుచుండిరి. సమకాలికులైన రచయితలతో, పత్రికాధిపతులతో, సంఘ సేవకులతో, రాజకీయ నాయకులతో వారికి సన్నిహిత సంబంధము లుండెను.

*గుణసంపద*

పంతులుగారు సౌజన్యమూర్తులు. నమ్రత, నిరాడంబరత, సేవాపరాయణత-సంతృప్తి-సత్యసంధత, జీవ కారుణ్యము మొదలగు సుగుణములు వారికి జన్మతో అబ్బినవి. ఇచ్చకము లాడుట వారెరుగరు. ఉన్నది ఉన్నట్లు చెప్పుటలో మొగమోటము లేదు. వారి జీవకారుణ్యమునకు ఒక చిన్న ఉదాహరణము:

ఒక చూడి ఆవును యజమాని డబ్బు ఇబ్బందితో కసాయివానికి అమ్మెను. ఆ వార్త విని పంతులుగారు వెంటనే వాని దగ్గరకు పోయి నచ్చచెప్పి

యెక్కువ ధరకు దానిని కొని ఇంటికి తీసికొని వచ్చిరి. ఆ గోమాత సంతానము వృద్ధిపొంది కొన్ని తరాలు పంతులుగారింట పెరిగెను. విశ్రాంతి వేళలలో వారు దూడలతో ఆడుకొనుచుండిరి. ప్రాచీన మహర్షులు చతుర్విధ పురుషార్థములను ఇట్లు నిర్వహించినారు.

"ఉపకారః పరోధర్మః, పరోర్థః కర్మనైపుణం,
పాత్రే దానం పరః కామం, పరో మోక్షో వితృష్ణతా॥

ఇతరులకు ఉపకారము చేయుటే ఉత్తమ ధర్మము; కర్తవ్యమును ఆచరించుటే ఉత్తమ అర్థము; అర్హునకు దానమిచ్చుటే ఉత్తమ కామము; ఆశ లేకుండుటే శ్రేష్ఠమైన మోక్షము. దీనికి పంతులుగారి జీవితము ప్రత్యక్షోదాహరణము. కాల పరిస్థితులు మారి నిత్యజీవితము దుర్భరమైనను కష్టార్జనమును తప్ప అన్యము నాసింపని దృఢవ్రతులు పంతులుగారు.

"అకృత్వా పరసంతాపం, అగత్వా ఖలనమ్రతాం
అనుత్సృజ్య నతాంవర్త్మ, యత్స్వల్ప మపి తద్బహు॥

ఇతరులను నొప్పింపక నీచులకు తలఒగ్గక సజ్జన మార్గమును వదలక, ఆర్జించినది అల్పమైనను బహుళము కాగలదు. అని వ్యాసభగవానుడు భారతమున వ్రాసిన మహావాక్యములను నమ్మిచరించిన ధర్మవర్తనులు వారు.

*కుటుంబ జీవితము*

పంతులుగారికి ఔరస సంతానము లేదు. ఒకరిద్దరు కలిగి పోయినారు. తమకు పిల్లలు లేకున్నను వారి యిల్లు పెండ్లిసందడితో కలకల లాడుచుండెను. విశ్వకుటుంబులైన వీరభద్రరావుగారు కష్టసుఖములను చవిచూచిన వారగుట వలన తమ బంధువులలో నిస్సహాయ స్థితిలో నుండిన ఇద్దరు బాలురను, ఇద్దరు బాలికలను తీసికొనివచ్చి పెంచిరి. వారికి చదువులు చెప్పించిరి. పెండ్లిండ్లు చేసిరి. పురుళ్ళు పోసిరి. మంచి చెడ్డలు చూచిరి. వారి సంతానమే వారింట నుండినది.

పంతులుగారు పెంచిన బాలురలో ఒకరు నర్సింహారావు. ఆయనకు B. A. వరకు చదువు చెప్పించిరి. ఉద్యోగము ఇప్పించి పెండ్లి

చేసిరి. అల్పాయుపై ఆయన మరణించెను. రెండవ ఆయన లక్ష్మీనారాయణ. ఆతనికి H. S. C. వరకు చదువు చెప్పించి వివాహముచేసి జీవనోపాధి చూపించిరి. ఆయన ఉన్నారు. ఆడ పిల్లలలో పెద్దామె రాధమ్మ, పంతులుగారు ఆమెను ముద్దుగా 'అమ్మన్నా' అని పిలుచుచుండిరి. ఈమె పుట్టిన మూడవ నాడే తల్లి చనిపోయెను. ఆ పసికందును తెచ్చి సాకిరి. H.S.C. వరకు చదివించిరి. పెండ్లి చేసిరి. ఆర్గురు పిల్లలు తరువాత కవల పిల్లలను ప్రసవించి ఆమె చనిపోయెను. ఆమె భర్త మరొక వివాహము చేసికొని హాయిగా ఉన్నారు. రాధమ్మ సంతానము ఎనిమిదిమంది పంతులుగారి ఆశ్రయములోనే పెరిగినారు. వారికిది తీవ్రాఘాతమైనది. రెండవ బిడ్డ చిట్టెమ్మ. బాల్యములోనే తలిదండ్రులను కోల్పోయిన ఈమెను తెచ్చిపెంచిరి. అంత చతురురాలు కాని ఆమెను పెద్దచేసి వివాహము చేసిరి. భర్త ఎచటనో ఉద్యోగము చేయుచుండ ఈమె తన పిల్లలతో పంతులుగారి దగ్గరనే ఉండి, పెంచిన తలిదండ్రులు మరణించువరకు వారిసేవ చేసి ఋణము తీర్చుకొన్న ధన్యురాలు.

పంతులుగారు వార్థక్యమువలన మంచముపై ఉండగనే వారి పత్ని లక్ష్మీనరసమ్మగారు అనాయాసముగా మరణించిరి. స్థితప్రజ్ఞులైన పంతులుగారు ఇందుకేమాత్రమూ చింతింపలేదు.

వీరభద్రరావుగారు అద్వైతులు. శైవవైష్ణవ విభేదమును పాటింపలేదు. వైదికధర్మనిష్ఠులు; నాస్తికములైన జైనబౌద్ధములను ఆకళించికొని అందలి మేల్మిని లోకమునకు చాటిరి. వారికి ఆచారములపై శ్రద్ధలేదు. ప్రతి సోమవారము ఉపవసించుచుండిరి. హైందవాభిమానము కలవారు; క్రైస్తవులతో ముస్లిములతో మైత్రినెరపిరి. ఆంధ్రభాషాభిమానులు; ఉరుదూ-మరాఠీ-కన్నడ-ఆంగ్ల హిందీ సాహిత్యములపై సమానాదరము కలిగియుండిరి. సమన్వయ దృష్టికి పంతులుగారు మొదట పేర్కొనదగినవారు.

## ౨. భాషాసేవ

వీరభద్రరావు పంతులుగారికి చిన్నతనమునుండి ఆంధ్ర భాషమీద, ప్రజాసంస్థలమీద విశేషాభిమానము కలదు. అవి పెద్దల సాహచర్యముతో బల

పడినది. తమ కష్టములను కడతేర్చుకొనుటకై స్వయంకృషితో పాండిత్యమును విమర్శనాపాటవమును పెంపొందించికొన్న వారగుటవలన తన దేశీయుల అభ్యుదయమునకై పాటుపడ వలెనను దీక్ష కలిగినది. మాతృభాషలో జనులకు తగినంత జ్ఞానము కలిగించినగాని వారి అభివృద్ధి జరుగదను విశ్వాసముతో భాషాసేవకు జీవితము నంకితము చేసిరి. పంతులుగారి భాషాసేవ బహుముఖములైనది. 1. ఉపాధ్యాయుడుగ బాల బాలికలను తీర్చిదిద్దుట. 2. విజ్ఞానదాయకములైన గ్రంథాలయములను స్థాపించుట, నిర్వహించుట. 3. ఉత్తమ రచనలు చేసి ప్రజలను విజ్ఞానవంతులను చేయుట. 4. తెలుగు పత్రికలను ప్రోత్సహించి వానిద్వారా సామాన్యప్రజలలో చైతన్యము కలిగించుట. 5. దేశనాయకులతో సన్నిహితత్వము కలిగి ఉండి ప్రజోద్యమాలకు పరోక్షముగ తోడ్పడుట. 6. సారస్వత సంస్థలద్వారా దేశీయులలో సాహిత్యాభిరుచిని కలిగించుట. 7. దేశము నందలి చారిత్రక సామగ్రిని సేకరించి పరిశోధనలద్వారా ఆంధ్రసాంస్కృతిక వైభవమునుచాటుట. ఈవిధముగ వారు అనేకవిధముల దేశమునకు భాషకు అమూల్యమైన సేవ చేసినారు. వారి సేవాపద్ధతి అపూర్వమైనట్టిది.

నిరంకుశ నిజాంపాలనలో ఉద్యోగముచేయుట కత్తిమీద సామువంటిది. ఉద్యోగులకు ప్రజాసంస్థలతో ఎట్టి సంబంధము ఉండరాదు. ప్రజాసంస్థలలో పనిచేయువారు కర్తవ్యమును వదలిపెట్టి అధికార హోదాలకై ప్రాకులాడు చుండిరి. ఈ స్థితిలో పంతులుగారు ఉద్యోగిగా ఉండి తమ సత్ప్రవర్తనచే-విధి నిర్వహణచే పై అధికారుల మెప్పునుపొంది తమకు ఉచితమని తోచినవిధముగ ప్రజాసంస్థలతో నిరాటంకముగా సంబంధములను సాగించిరి. ఏసంస్థలో ఉన్నను పదవులకై ప్రాకులాడక కార్యకర్తగా ఉండి నిస్వార్థ సేవ జేసి ప్రజలలో గౌరవమునుపొందిరి. ఇది అప్పటి పరిస్థితులలో సామాన్య విషయము కాదు. తమ సచ్ఛీలముచే పంతులుగారు దానిని సాధింపగల్గిరి.

## ఉపాధ్యాయ వృత్తి

ఇంచుమించు 30 సంవత్సరములకాలము ఉన్నత పాఠశాలలలో తెలుగు పండితులుగా ఉండి విద్యార్థినీ విద్యార్థులను ఉత్తమ పౌరులుగా తీర్చిదిద్దిరి. మాతృభాషాభిమానులుగా చేసిరి. వారి శిష్యులు పలువురు ప్రజానాయకులుగా ఉన్నతాధికారులుగా రాణించుచున్నారు.

లైన వార మాస పత్రికలలో వారు ఎన్నో వ్యాసములు వ్రాసినారు. ప్రత్యేకముగ చెప్పదగిన గోలకొండ కవుల సంచిక—భాషానిలయ రజతోత్సవ సంచిక-మాడపాటివారి షష్టిపూర్తి సంచికలవంటి విశేష సంచికలు వారి సంపూర్ణ కృషితో వెలువడినవి.

*గ్రంథరచన*

ఆయా సంస్థలలో పనిచేయుచు పంతులుగారు ఎన్నో గ్రంథములను రచించినారు. వారి రచనలలో 'జీవిత చరితావళి, ప్రాచీనాంధ్ర నగరములు, మన తెలంగాణము, గ్రీకుపురాణ దేవతలు, షితాబుఖాన్ చరిత్ర, మాడపాటి హనుమంతరావుగారి జీవిత చరిత్ర గణనీయమైనవి. ఎన్నో కథానికలను, బాల వాఙ్మయమును రచించిరి. ఇవికాక హైదరాబాదు రేడియో స్టేషను నుండి, వివిధ విషయాలపై అపూర్వ కృషిచేసి దాదాపు 150 వరకు ఉత్తమ ప్రసంగములను ప్రసారము చేసినారు. సంగ్రహాంధ్ర విజ్ఞానకోశమునకై వారు రచించిన వ్యాసములు అనేకము లున్నవి. పంతులుగారికి సన్నిహితము_న సారస్వత సంస్థలలో ముఖ్యములైన వానినే తెలిపెదను.

*సాహిత్య సంస్థలు :*

*1. శ్రీ కృష్ణదేవరాయాంధ్ర భాషా నిలయము*

1901 సంవత్సరమున హైదరాబాదులో స్థాపించబడిన మొదటి గ్రంథాలయ మిది. దాని నిర్వహణ బాధ్యతను రావిచెట్టు రంగారావుగారు వహించిరి. వారి పోషణలో ఉన్న పంతులుగారికి ఆ బాధ్యత సంక్రమించినది. ఆరంభములో ఈ గ్రంథాలయము రంగారావుగారింట కొన్నాళ్లు, బడీచావిడి దగ్గర అద్దెయింట్లో కొన్నాళ్లు ఉండినది. మొదటి లైబ్రేరియనుగా, మదరాసునుండి వచ్చిన తరువాత ఆంధ్ర పితామహులతో కలసి కార్యవర్గ సభ్యులుగా, కార్యదర్శిగా, అధ్యక్షులుగా పంతులుగారు భాషానిలయమునకు చేసిన సేవ చిరస్మరణీయమైనది. మాడపాటివారితో కలసి భాషానిలయమునకు వారు ఇప్పటి భవనమును నిర్మాణము చేయించిరి.

*2. విజ్ఞాన చంద్రికా గ్రంథమాల*

రావుత్రయము-నాయని, రావిచెట్టు, కొమర్రాజు వారలు- 1905లో ఈ గ్రంథమాలను స్థాపించిరి. దీని నుండి జీవిత చరిత్రలు-దేశ చరిత్రలు-కవుల

చరిత్రలు-వివిధ విజ్ఞాన శాస్త్రములు ప్రకటింపబడినవి. హైదరాబాదులో రాజకీయ పరిస్థితులు అనుకూలముగ లేనందున ఈ గ్రంథమాల 1908లో మదరాసుకు మార్చబడినది. పంతులుగారచటికి వెళ్ళి లేఖకులుగా పనిచేయుచుండిరి. అప్పు డప్పుడే M. A. పాసై జాతీయోద్యమ ప్రేరితులై రంగమున దూకి పనిచేయుచుండిన శ్రీ గాడిచర్ల హరిసర్వోత్తమరావుగారికి పెద్దలు గ్రంథమాలలో ఆశ్రయమిచ్చిరి. వారి వర్తనము నిజాయితి, గల పంతులుగారికి సరిపడలేదు. నిర్వాహకులు పద్ధతిని సరిజేయగల స్థితిలో లేకుండిరి. దానిని సహింపక పంతులుగారు సంస్థతో సంబంధమును త్రెంచుకొని హైదరాబాదుకు తిరిగివచ్చిరి. వారు గ్రంథమాలలో పని చేయుచుండిన కాలమున గ్రంథమాలనుండి శ్రీ కొమర్రాజు వారి హిందూ మహాయుగము, మహమ్మదీయ మహాయుగము, చరిత్ర చతురాననులు శ్రీ చిలుకూరు వీరభద్రరావుగారి ఆంధ్రుల చరిత్ర సంపుటములు, శ్రీ కందుకూరి వీరేశలింగంపంతులుగారి ఆంధ్రకవుల చరిత్ర, శ్రీ కట్టమంచి రామలింగారెడ్డిగారి అర్థశాస్త్రము వెలువడినవి.

### 3. ఆంధ్ర జనసంఘము

తెలంగానా ఆంధ్రోద్యమమునకు బీజమన దగినది ఆంధ్ర జనసంఘము. అది ఏర్పడుటకు ఒక అల్ప సంఘటనము ప్రాతిపదిక అయినది. 1921 సంవత్సరమున హైదరాబాదులో మహారాష్ట్రుల ఆధిపత్యమున హిందూ సంఘ సంస్కార మహాసభ జరుపబడెను. ఆ సభలో అధిక సంఖ్యలో మహారాష్ట్రులు, తక్కువగా కర్నాటకులు—ఆంధ్రులు పాల్గొనిరి. ప్రసంగములు మూడు ప్రాంతీయ భాషలలో జరుగవలెనని నిర్ణయింపబడెను. ఈ సమన్వయ దృష్టి మరాఠీ మూకకు సరిపడలేదు. తెలుగులో ప్రసంగము జరుగునప్పుడు అల్లరి చేయ మొదలుపెట్టిరి. స్థానిక హైకోర్ట్ వకీలు శ్రీ ఆలంపల్లి వెంకటరామరావు గారు ఉపన్యసించుచుండగా వారి ఉపన్యాసమును సాగనీయక కేకలు వేయుచుండిరి. చేయునది లేక ఆయన ఉపన్యాసమును ఆపివేయవలసి వచ్చెను. అప్పుడక్కడ ఉండిన తెలుగువారికి ఈ అవమానము భరింపరాని దయ్యెను. శ్రీ మాడపాటి హనుమంతరావు పంతులుగారు మొదలైన 13 మంది పెద్దలు వెంటనే అసమ్మతి సూచకముగా సభలోనుండి లేచిపోయిరి. అదే రాత్రి శ్రీ టేకుమాల రంగారావుగారింటిలో ఆంధ్ర నాయకులు సమావేశమై కర్తవ్యమును చర్చించి తెలుగుజాతి అభ్యుదయమునకై ఆంధ్ర జనసంఘమును స్థాపిం

చిరి; దానికి మాడపాటివారు కార్యదర్శిగా నియమితులైరి. ఆ సంఘములో వీరభద్రరావుగారు కార్యవర్గ సభ్యులుగా ఎన్నుకోబడిరి, అదే కేంద్ర జనసంఘమై చివరకు ఆంధ్ర మహాసభగా రూపొందినది. ఈ సంఘము ప్రజలలో రాజకీయ చైతన్యమును, భాషాభిమానమును కలిగించు కార్యక్రమములను చేపట్టెను. పంతులుగారు ఉపాధ్యాయుగా ఉండుటవలన రాజకీయాలతో సంబంధము పెట్టుకొనక సాహిత్య సాంస్కృతిక కార్యక్రమాలను మాత్రము నిర్వహించుచుండిరి.

### 4. పరిశోధక మండలి

తెలుగువారి సర్వతోముఖాభివృద్ధిని కాంక్షించి ఆంధ్ర జనసంఘమునకు అనుబంధముగా 'పరిశోధక మండలి' 1922లో స్థాపించబడినది. ఇందుకు మూలపురుషులు శ్రీ కొమర్రాజువారే. తెలంగాణములో అపారముగా ఉన్న తామ్ర శిలా శాసనాలను, నాణెములను, తాళపత్ర గ్రంథములను సేకరించి ప్రచురించుట, పరిశోధించుట దాని లక్ష్యములుగా ఉండెను. రానురాను ఆంధ్ర జనసంఘము రాజకీయ సంస్థగా మారిపోవుచుండుటవలన పరిశోధకమండలి సాగించు కృషికి నిజాంసర్కారునుండి ఆటంకములు కలుగరాదని దూరదృష్టి గల పెద్దలు ఆలోచించి మండలిని వేరుచేసి స్వతంత్ర సంస్థగా మార్చివైచిరి. వీరభద్రరావు పంతులుగారు దానికి కార్యదర్శిగా పని చేసిరి. శేషాద్రి రమణ కవులలో నొకరైన శ్రీ దూపాటి వెంకట రమణాచార్యులుగారు మండలి ప్రతినిధిగా తెలంగాణా జిల్లాలలో తిరిగి తాళపత్ర గ్రంథములను, నాణెములను, శాసన ప్రతిబింబాలను సేకరించుచుండిరి. మండలి స్థాపకులలో ప్రధానులైన K. V. లక్ష్మణరావుగారి మరణము తరువాత వారి పవిత్ర స్మృతిచిహ్నముగ 1931లో అది లక్ష్మణరాయ పరిశోధకమండలిగా మారినది. అధ్యక్షులు శ్రీ నాయని వెంకట రంగారావు బహద్దరుగారు. కార్యదర్శి పంతులుగారు. వారు చేసిన మహత్తరకృషి పశ్చిమాంధ్ర చరిత్రను పరిపుష్టము చేసినదని చెప్పిన చాలును. ఈ మండలి 'తెలంగాణా శాసనములు' అను పేరుతో రెండు సంపుటాలను ప్రకటించినది. ఈ సందర్భములో పంతులుగారి అనుభవాలను తెలిసికొన్నచో వారి శ్రమ విదితము కాగలదు.

సేకరించిన శాసన ప్రతిబింబాలలో కొన్నిటికి పాఠములు వ్రాయించి తొలి సంపుటమును ప్రకటింపవలెనని అధ్యక్ష కార్యదర్శులు ప్రయత్నించిరి.

ప్రతిబింబములను చదివి శాసనపాఠములను వ్రాయువారు వారికి అందుబాటులో లేకుండిరి. పంతులుగారు తమకు ప్రియమిత్రులైన శ్రీ మల్లంపల్లి సోమశేఖర శర్మగారిపై ఆశపెట్టకొని శాసనముల కట్టతో మదరాసునకు పోయిరి. అక్కడ ఎన్నాళ్ళు కాచుకొన్నను వారికి తీరిక లేకుండెను. గత్యంతరములేక శర్మగారి సలహాతో అచటినుండి రాజమండ్రికిపోయి శ్రీ భావరాజు వెంకటకృష్ణారావు గారిని ఆశ్రయించిరి. త్వరగా పని పూర్తిచేసినచో తగిన ప్రతిఫల మిత్తునని కూడ తెలిపిరి; కాని ఏ కారణముల వలననో కృష్ణారావుగారు త్వరగా పని పూర్తి చేయక ఆలస్యముచేసి కొన్ని శాసనములను మాత్రమే వ్రాసి తక్కినవాటిని పూర్తిచేయుటకు తీరిక లేదని తెల్పివైచిరి. ఏమి చేయవలెనో పంతులుగారికి తోచలేదు. మార్గాంతరము లేక వారు మరల శాసనముల కట్టను మోసికొని హైదరాబాదుకు తిరిగివచ్చిరి. ఎంతోకాలము శ్రమ వ్యర్థమయ్యెను. పంతులుగారి ఆవేదనను గ్రహించిన హిస్టరీప్రొఫెసరు శ్రీ సిరుగూరు హనుమంతరావుగారు అప్పుడప్పుడే చరిత్రలో డాక్టరేటు గ్రహించి, నిరుద్యోగిగా ఉండిన తన మేనల్లుడు శ్రీ మారేమండ రామారావుగారికి ఈపనిని అప్పగించునట్లు చేసిరి. ఆయనకు హళగన్నడభాష రాదు. శాసనములు చాలవరకు హళగన్నడములోనే వ్రాయబడియుండెను. రామారావుగారు ఆ భాష తనకు తెలియదని చెప్పక ఊహ కందిన విధముగా శాసన పాఠములు వ్రాసి ఎట్లో పని పూర్తి అయినదనిపించిరి. ఏదోవిధముగా మొదటి గండము గడచినది. ఇక ముద్రణ ప్రారంభించవలెను. ఇంతలో అనుకోని ఆపద ఎదురైనది.

హైదరాబాదు ప్రభుత్వము 1914లో పురాతత్త్వశాఖను ప్రారంభించెను. డైరెక్టరుగా ఢిల్లినుండి వచ్చిన గులాం యజ్దానీ సాహెబ్ నియమితులైయుండిరి. ఈ క్రొత్త డిపార్టుమెంటు ఆరంభమైనప్పటినుండి అజంతా, ఎల్లోరా గుహలను గూర్చి, వాని శిల్ప చిత్ర కళాదులనుగూర్చి ఎక్కువ శ్రద్ధతీసికొనెను. చరిత్ర కందని కాలపు గోరీలు త్రవ్వుటకు, ముస్లిం నిర్మాణములను వెలికి తెచ్చుటకు విశేష కృషి చేసినది. రాష్ట్రములోని ప్రాచీన హైందవ నిర్మాణములనుగూర్చిగాని తామ్రశిలాశాసనములను గూర్చిగాని అంతశ్రద్ధ తీసికొనలేదు. పరిశోధక మండలి ఈ విషయములలో విశేష శ్రద్ధతీసికొనుచుండుట ప్రభుత్వదృష్టికి వ్యతిరేక కార్యముగ తోచెను. ఇందేదో రాజకీయ మున్నదని అనుమానము కలిగినది. వెంటనే సర్కారునుండి మండలి కార్యదర్శి పేర శ్రీముఖము జారీ అయినది.

"ప్రభుత్వమువారు దేశములోని చారిత్రక సాధన సామగ్రిని సేకరించి ప్రకటించు ప్రయత్నములు చేయుచున్నారు. ప్రయివేటు సంస్థలు ప్రభుత్వానుమతి లేనిదే ఇట్టి పనులు చేయరాదు" అని శాసించినది. నానాబాధలు పడి చివరకు శాసన సంపుటమును ప్రచురింపలేని దుస్థితి ఏర్పడినందుకు పంతులుగారు చాల దుఃఖించిరి. ఉచితజ్ఞులు, సమర్థులు అయిన శ్రీ హనుమంతరావు పంతులుగారు జోక్యము కలిగించుకొని వెంటనే సర్కారువారి ముఖ్య కార్యదర్శిని చూచి మండలి ఉద్దేశములు వివరించి అది ప్రభుత్వ వ్యతిరేక కార్యము కాదని నచ్చచెప్పి శాసనములను ప్రకటించుటకు అనుమతిని సంపాదించిరి. ఆ చిక్కు తొలగిపోయినది. ఇంక ఆలస్యము తగదని ఎట్లో అష్టకష్టములు పడి 'తెలంగానా శాసనములు' మొదటి సంపుటమును 1935లో ప్రచురించిరి. తక్కిన శాసనాల కథ అంతటితో మిగిలిపోయెను.

1959 సంవత్సరము నాటికి దేశము స్వతంత్రమైనది. పరిస్థితులు మారినవి. మండలి అధ్యక్షులు శ్రీ రాజా నాయని రంగారావుగారు వృద్ధులై రోగశయ్యపైన ఉండి మిగిలిపోయిన శాసనాలను గూడ త్వరగా ప్రకటించినచో దానిని చూచి ప్రాణములు విడిచెదనని పంతులుగారితో గట్టిగా చెప్పిరి. గత అనుభవాలను స్మరించికొని ఈసారి ఎవరికి ఈ పని అప్పగించవలెనా అని పారజూచిరి. ఉత్సాహము తప్ప ఏ అర్హతలేని నేను అప్పుడప్పుడే శాసన పరిశోధనారంగమున కాలుబెట్టి 'వినయాదిత్యుని పల్లెపాడు తామ్ర శాసనము' ను ప్రకటించియుంటిని పంతులుగారి దృష్టి నామీద పడినది. నాపై వారికి గల వాత్సల్యముతో ఈ పని త్వరగా నెరవేర్చవలెనని నన్ను ఆదేశించిరి. వారి ప్రోత్సాహముతో నేను 6మాసములలో శాసనాలను చదివి పాఠములను వ్రాసియిచ్చితిని. అది ముద్రింపబడక ముందే రాజాగారు కన్నుమూసిరి. ముద్రణ మొక సమస్య అయినది. శ్రీ దేవులపల్లి రామానుజరావుగారు కేంద్రప్రభుత్వం నుండి ఆర్థిక సహాయము చేయించిరి. ముద్రణ సమయమున పంతులుగారు తాము ప్రూఫులు దిద్ది సాధ్యమైనంతవరకు తప్పులు లేకుండ 1960లో రెండవ సంపుటమును ప్రచురించిరి. 1961లో పంతులుగారు వ్రాసిన 'షితాబుఖాను చరిత్ర' మండలి పక్షమున ప్రకటింపబడెను. పరిశోధక మండలి సేకరించిన తాళపత్ర గ్రంథములకు పట్టిక సిద్ధము చేసిరి. అముద్రిత గ్రంథములను గూర్చి వ్యాసములు వ్రాసి ప్రకటించిరి. మండలి ద్వారా వారు చేసిన సేవ సాటిలేనిది.

ఆ తాళపత్ర గ్రంథములన్నియు ఇప్పుడు స్టేట్ ఆర్కైవ్స్‌లో భద్రపరచబడి నవి. అన్ని సంస్థలకంటె పరిశోధక మండలి పంతులుగారికి ప్రియతమమైనది.

### 5. విజ్ఞానవర్ధనీ పరిషత్తు

హైదరాబాదులో ఉత్తమ రచయితలను సిద్ధము చేయవలెనను సంకల్ప ముతో శ్రీ సురవరము ప్రతాపరెడ్డిగారు 1941లో విజ్ఞానవర్ధనీ పరిషత్తును ప్రారంభించిరి. నగరమునందలి పలువురు మేధావులు సభ్యులుగా ఉండిరి. 15 దినముల కొకసారి అందరును సమావేశమై ఒక్కొక్క విషయముమ గూర్చి వ్యాసమును వ్రాసికొని వచ్చి చదువుచు దానిపై చర్చ చేయుచుండిరి. ఈ పరి షత్తునకు రెడ్డిగారు అధ్యక్షులుగా ఉండిరి. పంతులుగారు దీనిలో సభ్యులుగా ఉండిరి. దీని పక్షమున కొన్ని గ్రంథములు ప్రకటింపబడెను.

### 6. ఆంధ్ర సారస్వత పరిషత్తు

1943లో ఆంధ్ర భాషావ్యాప్తి-సంస్కృతి ప్రచారము-ఉత్తమ గ్రంథ ప్రకటనలు ముఖ్యోద్దేశములుగా ఆంధ్ర సారస్వత పరిషత్తు అవతరించినది. దానిస్థాపకులలో పంతులుగారొకరు. మరణించు వరకును పంతులుగారు పరిషత్తు కార్యవర్గ సభ్యులుగా, పరీక్షకులుగా, సలహాదారుగా ఉండి పరిషత్తు అభ్యు న్నతికి తోడ్పడిరి. పరిశోధక మండలి తరువాత పంతులుగారికి ప్రియమైనది ఆంధ్ర సారస్వత పరిషత్తు. వారు మరణించుటకు ముందే మండలిని పరిషత్తుకు అప్పగించిరి.

### 7. ఆంధ్ర చంద్రికా గ్రంథమాల

ఆంధ్ర పితామహులకు షష్టిపూర్తి ఉత్సవ సందర్భములో ప్రజలు 6400-00 రూపాయలు కానుకగా సమర్పించిరి. వారు దానిని వాడుకొనక ఆ ధనముతో 1948 సంవత్సరమున 'ఆంధ్ర చంద్రికా గ్రంథమాల'ను ప్రారం భించిరి. దాని ద్వారా ఉత్తమ గ్రంథములను ప్రకటించిరి. ఈ గ్రంథమాలకు పంతులుగారు ప్రధాన సంపాదకులుగా ఉండి కృషిచేసిరి.

### 8 ఆంధ్ర బాలికోన్నత పాఠశాల

నిజాం పాలనలో హైదరాబాదు రాజ్యమున బాలికలకు మాతృభాషలలో ఉన్నత విద్యావకాశములు బొత్తిగా లేకుండెను. ప్రభుత్వ విద్యావిధానము

ఉర్దూ మాతృభాషకాని వారందరికిని బాధాకరముగా ఉండెను. బోధనాభాష విషయములోను, ప్రయివేటు పాఠశాలలు స్థాపించు విషయములోను సర్కారువారు చాల కఠిన నియమములుచేసి స్త్రీవిద్యావకాశములు లేకుండచేసిరి. అది హిందూ నాయకులకు ప్రధాన సమస్య అయినది. ఈ విషయమును గూర్చి ఆంధ్ర కర్నాటక మహారాష్ట్ర నాయకులు ఏకీభవించి పరిష్కార మార్గము నన్వేషించిరి.

శ్రీ రామచంద్ర నాయక్ బారెట్లా, రాయ్ బిశ్వేశ్వరనాథ్, శ్రీ అహల్యా బాయి మల్లన్న, శ్రీమతి సులోచనాబాయి, శ్రీ మాడపాటి హనుమంతరావు పంతులు, శ్రీ కృష్ణస్వామి ముదిరాజ్ మొదలైన నాయకులు ఒక సంఘముగా ఏర్పడి 1928లో రెసిడెన్సీ బజారు (ఇప్పటి సుల్తాన్ బజారు) నందు ఆంధ్ర మహారాష్ట్ర భాషలలో ఉన్నత విద్యను బోధించు బాలికా పాఠశాలను ప్రారంభించిరి. అప్పుడు రెసిడెన్సీ బజారు నిజాం అధికారములో లేకుండెను. బ్రిటిషు రెసిడెంటు ఇప్పటి కోఠీలో ఉండి ఆ పరిసర వీథులన్నియు అతని అధికారములో ఉండెను. అందువలన ప్రయివేటుగా ఈ బాలికా పాఠశాలను ప్రారంభించుటకు ఎట్టి ఆటంకములు కలుగలేదు. కాని మహారాష్ట్ర శాఖలో తరువాత విద్యార్థినులు తగ్గిపోయినందున కొంత కాలమునకు ఆ శాఖ తీసివేయబడెను. తెలుగుశాఖ మాత్రమే అభివృద్ధి చెందినది. 3 సంవత్సరములు పాఠశాలను నిర్వహించిన తరువాత పై సంఘమువారు ఆర్థికవసతులు లేవను కారణముచే తమ బాధ్యతను వదలుకొనిరి. అప్పటికి ఆంధ్రశాఖలో బాలికల సంఖ్య పెరిగి 3 ఫారము వరకు వృద్ధి చెందియుండెను. ఆ స్థితిలో శ్రీ మాడపాటివారు తమ మిత్రులైన శ్రీ వడ్లకొండ నరసింహారావుగారి సహాయముతో బాలికా పాఠశాల భారమును వహించిరి. వారి కృషిచే అది ఉన్నత పాఠశాలగా అయి ఇప్పుడు కళాశాలగా మారినది. నగరములో ఆంధ్ర బాలికలకు వరదాయినిగా ఉన్నది. ఈ పాఠశాలను ఉస్మానియా యూనివర్సిటీ-నాగపూరు యూనివర్శిటీలే కాక ఆంధ్ర యూనివర్శిటీకూడ ఆమోదించక పోవుట విచారకర విషయము. ఆ స్థితిలో 1932 సంవత్సరమున పూనాలోని భారత మహిళా విశ్వవిద్యాలయము ఆమోదించి ఉపకార మొనర్చినది. ఆంధ్ర రాష్ట్రము ఏర్పడిన తరువాత 1945లో ఆంధ్ర విశ్వవిద్యాలయము తన అభిప్రాయమును మార్చుకొని ఈ పాఠశాల విద్యార్థినులు మెట్రిక్ పరీక్షలో పాల్గొనుటకు అనుమతించి నది. 1954లో వీరభద్రరావు పంతులుగారు ప్రభుత్వ పాఠశాలనుండి విరమించిన వెంటనే

హనుమంతరావు పంతులుగారి నిర్బంధముచే ఈ బాలికా పాఠశాలాభారము వహించి 1953 వరకు దాని అభివృద్ధికి పాటుపడిరి.

## 9. సంగ్రహాంధ్ర విజ్ఞాన కోశ సమితి

హైదరాబాదునుండి సంగ్రహరూపమున విజ్ఞాన కోశము ప్రకటింపవలె నను ప్రయత్నము జరిగి ఆచార్య ఖండవల్లి లక్ష్మీరంజనముగారి కృషి ఫలిత ముగా 'సంగ్రహాంధ్ర విజ్ఞానకోశ సమితి' ఏర్పడినది. దానికి అధ్యక్షులు డా॥ బెజవాడ గోపాలరెడ్డిగారు; కార్యదర్శి ఆచార్య ఖండవల్లి లక్ష్మీరంజనముగారు. పంతులుగారి శక్తి సామర్థ్యములను, కార్యదక్షతను, పాండిత్యానుభవములను గుర్తించిన పెద్దలు వారిని ఈ సమితి కార్యాలయమున ప్రధాన నిర్వాహకులుగ పని చేయగోరిరి. వార్ధక్యముచే ఆరోగ్యము బాగులేకున్నను ఆంధ్ర భాషాభి వృద్ధిని కాంక్షించు పంతులుగారు కాదనలేక అందు ప్రవేశించి సంపూర్ణ బాధ్యత వహించిరి. ఈ మహాకార్యమును నిర్వహించుట సామాన్య విషయము కాదు. వారు దక్షతతో పూనుకొని తమ చేతిమీదుగా 8 సంపుటాలలో విజ్ఞానకోశ మును పూర్తిచేసి తెలుగువారికి మహోపకారమును చేసినారు. వారి దీక్షకు ఈ కోశము-గీటురాయివంటిదనవచ్చును. ఇందు వారొనర్చిన కృషి అనితర సాధ్య మైనది.

ఈ కోశ నిర్వహణలో 39 ప్రధాన విషయములకు 39 మంది ఉద్దండ పండితులు సంపాదకులుగా పేర్కొనబడినారు. వారిలో "ఆంధ్ర దేశము-విశేష శీర్షికలు" అను విషయమునకు మాత్రమే పంతులుగారు సంపాదకులు. కాని ఏ ఒక్క సంపాదకుడుగాని తన బాధ్యతను నిర్వహించెననుట సంశయా స్పదము. అన్ని విషయాలకు వీరే సంపాదకులై వ్యాసములను పరిశీలించి సవరణలను సూచించి ప్రచురణార్హములు చేయుచుండిరి. ఆ కాలమున పంతులు గారు పడుచుండిన శ్రమ అంతంత మాత్రము కాదు. వ్యాసములు సేకరించుట, వానిని తమ ఉద్దేశము ప్రకారము సవరించుకొనుట, వ్యాసములు రానపుడు తామే వ్రాయుట, భాషను సవరించుట—మొదలైన కార్యములన్నియు వారు చూచుకొనుచుండిరి. ముద్రణ సమయములో కాగితము-సైజు-టైటిల్-బైండు-బ్లాకులు-ప్రూఫులు సమస్తము వారే చూచుకొనవలెను.

పంతులుగారు తదేక దీక్షతో కృషిచేసి దాదాపు 1500 వ్యాసములతో 8 సంపుటాలుగా సంగ్రహాంధ్ర విజ్ఞానకోశమును 1970లోగా ముద్రించి ముగింపు

## 10. సాహిత్య అకాడమీ

1957లో ఉదయించిన ఆంధ్రప్రదేశ సాహిత్య అకాడమీ పంతులు గారిని విశిష్ట సభ్యులుగా ఎన్నుకొని దుశ్శాలువతో సువర్ణ పథకముతో గౌరవించినది. అందుండి విరమించిన తరువాత కన్నుమూయు వరకు వారికి నెలకు 100/- వంతున సహాయము చేసినది.

### ముగింపు

ఈ విధముగా 1906 నుండి 1905 వరకు, 65 సంవత్సరములు అవిచ్ఛిన్నముగా అనేక విధములుగ ఆంధ్ర భారతిని సేవించి ఆదిరాజు వీరభద్రరావు పంతులుగారు 29 సెప్టెంబరు 1973 తేదీన తమ భౌతిక కాయమును చాలించిరి.

నిద్రాణమైయుండిన తెలంగాణమును మేల్కొల్పి నవచైతన్యమును ప్రసారము చేసిన నలుగురు మహావ్యక్తులను ఈచల్లని సమయమున స్మరించుచున్నాను. వారిలో ప్రథములు స్వర్గీయ రాజాబహద్దరు కొత్వాల్ వెంకట రామారెడ్డిగారు. హైదరాబాదులో వారి సహాయ సానుభూతులు లేక ఏప్రజాహితకార్యము గూడ జరుగలేదన్న అతిశయోక్తికాదు. రెండవవారు ఆంధ్ర పితామహులు స్వర్గీయ మాడపాటి హనుమంతరావు పంతులుగారు; వారి సారథ్యము లేనిచో తెలంగాణములో ఉద్యమమేలేదు. మూడవవారు స్వర్గీయ సురవరంప్రతాపరెడ్డిగారు; వారి తోడ్పాటులేనిచో తెలుగుజాతికి చైతన్య ప్రసారము లేదు. నాలుగవ వారు మన కథానాయకులు స్వర్గీయ ఆదిరాజు వీరభద్రరావు పంతులుగారు; వారి నిరాడంబర కృషిలేనిచో తెలంగాణమున సాంస్కృతిక పునరుజ్జీవనము లేదు.

---

# ఆదిరాజు వీరభద్రరావుగారి పరిశోధన–రచనలు

– డాక్టర్ బి. రామరాజు

తెలంగాణంలో విద్యావైజ్ఞానిక రంగాల అభివృద్ధికీ, సాంస్కృతిక పునరుజ్జీవనానికీ అలనాడు వైతాళికగీతాలు ఆలపించి నిద్రాణమైన జాతిని మేలుకొల్పిన కొలదిమంది పుణ్య పురుషుల్లో అగ్రశేణికి చెందినవారు ఆదిరాజు వీరభద్రరావుగారు. వారు పుట్టినది మధిర తాలుకా దెందుకూరు. ఐదవయేటనే తండ్రిగారు మరణించటంతో పెదతండ్రిగారి పర్యవేక్షణలో చింతకాజి వీధిబడిలో ఓనమాలనుండి భారత భాగవతాల వరకూ, ఒంట్లనుండి పెద్దబాలశిక్షలోని "ఖర్జూరఫలములు గణికుండు కొనితెచ్చి" భాగించే వరకూ, ఆంధ్రనామ సంగ్రహంనుండి అమరం వరకూ చదువుకొన్నారు. మరి కొంతకాలం కొణిజెర్లలో ప్రాథమిక విద్య పూర్తి చేసుకొని అనాథలైన ఈ తల్లీకొడుకులూ తమ బంధువులైన రావిచెట్టు రంగారావుగారింట ఆశ్రయం సంపాదించుకొని 1900లో హైదరాబాదులో స్థిరపడ్డారు. సంపన్నులు వదాన్యులు దేశభక్తులు ఐన రావిచెట్టు రంగారావుగారి యిల్లు ఆ దినాల్లో ఒక పుణ్యతీర్థం. కవులు పండితులు పరిశోధకులు చారిత్రకులు రాజకీయవేత్తలు దేశభక్తులు అందరికీ అది కూడలి. 1 9-1901 నాడు వారి యింటనే ఈనాటి శ్రీ కృష్ణదేవరాయాంధ్ర భాషానిలయానికి నాందీపూజ జరిగింది. ఆ సారస్వత సత్రానికి వచ్చిన పెద్దలకు తాంబూలాలు పంచిన పిన్నవాడు ఆదిరాజు వీరభద్రరావుగారు. రావిచెట్టువారి ఆశ్రయం మూలంగా కొమర్రాజు వెంకట లక్ష్మణరావువంటి చారిత్రక పరిశోధకులను, ఆదిపూడి సోమనాథరావు మైలవరపు, నరసింహశాస్త్రివంటి కవిపండితులను, చాదర్‌ఘాట్ హైస్కూల్లో చదువుకొన్నందున రాయప్రోలు వెంకట సోమయాజులవంటి ఉత్తమ దేశికులను, సన్నిహితంగా సేవించే భాగ్యం కలిగింది ఆదిరాజువారికి. బడి చదువు మెట్రిక్ దాటకపోయినా స్వయంకృషితో చదువులలో సారమెల్ల సంగ్రహించుకొన్నారు

వీరభద్రరావుగారి స్వయంకృషికి తొలి పాఠశాల శ్రీ కృష్ణదేవరాయాంధ్ర భాషానిలయం. ఆ భాషానిలయానికి వారు చాలకాలం గ్రంథపాలకులుగా కార్యదర్శిగా ఉంటూ భాషానిలయంలోని గ్రంథాలన్నిటినీ ఆపోశనం

పట్టినారు. దీనికి తోడు విజ్ఞానచంద్రికా గ్రంథమాల. అది హైదరాబాదులో ఉన్నప్పుడూ మద్రాసులో ఉన్నప్పుడూ వారే దానికి ఆఫీసు కార్యకర్తలు. మద్రాసులో ఉండగా కొమర్రాజు వారి చరిత్ర పరిశోధనలో కావలసినంత అంతేవాసిత్వం లభించింది. ఈ విధంగా ఆదిరాజు వీరభద్రరావుగారు స్వయం కృషితో ఆంధ్రదేశానికి అవసరమైనంత తెలుగులోను, తమ జిజ్ఞాస కవసరమైనంత సంస్కృతాంగ్లాల్లోను పాండిత్యం సంపాదించుకొన్నారు.

ఈ శతాబ్దపు తొలిపాదంలో చాలామందికివలెనే వీరభద్రరావుగారికి కూడా నూనూగు మీసాల నూత్నయౌవనంలో కవిత్వం వ్రాయాలెననే కుతూహలం కలిగిందట. అందుకోసం ఛందస్సు నేర్చుకొని కొన్ని పద్యాలు వ్రాసినారట. ఐతే ఆదిపూడి సోమనాథరావుగారు ఆదిరాజు వారి 'ఛాందసం' వదలించి గద్యరచనంవైపు దృష్టి మరలించినారట. వీరభద్రరావుగారు విద్యార్థిగా ఉన్నప్పుడే భారతంలోని శకుంతలోపాఖ్యానం చదివి 'చిత్ర శాకుంతలం' పేరుతో మున్నూటయాభై పుటల నవల వ్రాయటానికి ఒక ప్రణాళిక వేసుకొని దాదాపు నూరుపుటలు వ్రాసినారట కూడ. అది అంతటితో ఆగిపోయిందట. ఆ రచనలు కూడ అసూర్యంపశ్యలుగానే ఉండిపోయినవి. వీరభద్రరావుగారి రచనలన్నీ వచనంలో సాగినవి. వారి వచన రచనం సరళసుందరంగాను, సమాచారదాయకంగాను, వివరణాత్మకంగాను విషయ ప్రధానంగాను ఉంటుంది. వీరభద్రరావుగారి రచనా వ్యాసంగాన్ని ఈ క్రిందివిధంగా వింగడించుకోవచ్చు.

I. పరిశోధనాత్మకములు:- మన దేశ చరిత్ర, శాసనాలు, అముద్రిత గ్రంథాల గూర్చి వీరభద్రరావుగారు అనేక వ్యాసాలు వ్రాసినారు. అవి పరిశోధకుల పాలిటి పెన్నిధులు.

II, పరిశీలనాత్మకములు, విమర్శనాత్మకములు :- సాహిత్యం, చరిత్ర, సంస్కృతికి సంబంధించిన విషయాలు ఇంతకు పూర్వమే అవి లోకానికి తెలిసినా మరికొంత లోతుకు దిగి పరిశీలించి తమకు తోచిన విధంగా చేసిన రచనలు చాలా ఉన్నవి.

III. సమాచారదాయకములు (-Informative-) :- ఇతర భాషా గ్రంథాల్లో ఉన్న సమాచారం కానీయండి, మనభాషలో చెల్లాచెదరుగా స్వల్పంగా లభించే సమాచారం కానీయండి తెలుగు పాఠకలోకానికి, జిజ్ఞాసువులకు, ఆ

పువ్వునుండి ఈ పువ్వునుండి తేనెటీగ కొద్దిగా సేకరించి ఒకచోట చేర్చిన మధుకోశాలవంటి అనేక వ్యాసాలు వ్రాసినారు. చరిత్ర, సంస్కృతి, భూగోళం, దేవతలు, గుళ్ళు గోపురాలు, సమాధులు, నగరాలు, పర్వతాలు, ప్రదేశాలు-ఈ విధంగా ఎన్నో విషయాలగూర్చి ఎంతో శ్రమకోర్చి వ్రాసిన వ్యాసాలివి.

IV. జీవిత చరిత్రలు :- మహానుభావులు, దేశభక్తులు, విద్యావిజ్ఞాన వేత్తలైనవారి జీవితచరిత్రలు సమకాలీనులకు భావితరాల వారికి తెలియాలెననే ఉద్దేశంతో అభినివేశంతో తన్మయత్వంతో చేసిన రచనలివి.

V. సంపాదకత్వ పరిశ్రమ :— షష్టిపూర్తులకో, ప్రత్యేకమైన-విశిష్టమైన-ఉత్సవసందర్భాలప్పుడో, విజ్ఞానకోశాలకో, పత్రికలలో, కవిచరిత్రలకో, ఇతరులు వ్రాసిన రచనలను ఏరి కూర్చి సవరణలుచేసి, దిద్ది, ఒక క్రమాన గ్రంథస్థంచేయటం, సంకలనంచేయటం, సంపాదకీయాలు వ్రాయటం-సొంతంగా వ్రాయటం కంటె కష్టమైన పని. వీరభద్రరావుగారు ఇటువంటి కష్టాలు సంతోషపూర్వకంగా చాలాసార్లు పడ్డారు.

VI. బాలసాహిత్యం :- ప్రత్యేకంగా చిన్నపిల్లలకు ఆహ్లాదంతో పాటు ఆదర్శజీవితం, వినోదంతోపాటు విజ్ఞానం బోధించే ఉద్దేశంతో ఆకర్షకంగాను సరళమైన భాషలో వ్రాసిన రచనలివి.

VII హాస్యరచనలు :- పైన చెప్పినవన్నీ వీరభద్రరావుగారు గంభీరముద్ర తాల్చి వ్రాసినవి: మనం కూడా శ్రద్ధతో చదువుకోవలసినవి. ఐతే ఆహ్లాదంకోసం, హాస్యంకోసం చేసిన చిట్టి పొట్టి రచనలు Tit-bits వంటివి కూడ కొన్ని ఉన్నవి.

వీరభద్రరావుగారు వ్రాసిన గ్రంథాలు కానీయండి, వ్యాసాలు కానీయండి, జీవిత చరిత్రలు కానీయండి, సృజనాత్మకమైన కథలు కానీయండి, సమాచార దాయకంగానో, విజ్ఞానదాయకంగానో ఉపదేశకంగానో ఉంటవేగాని కాలక్షేపం కోసం ఊరకే వ్రాసినవి ఏవీ లేవు. వారి రచనలు కొన్ని పుస్తకాలరూపంలో వచ్చినవి. మరికొన్ని ఆయా పత్రికల్లోనో, ప్రత్యేక సంచికల్లోనో, విజ్ఞాన కోశాల్లోనో ఉన్నవి. కొన్ని అముద్రితంగా ఉన్నవి. కొన్ని వాయు తరంగాల్లో విశ్వాంతరాళాన పరిభ్రమిస్తున్నవి ఆకాశవాణి మూలంగా. ఇందులో పుస్తకాల రూపంగా లభ్యమయ్యే వాటి గురించి ముందుగా మనవి చేస్తాను.

(1) ఆదిరాజువారి తొలిపుస్తకం "జీవిత చరిత్రావళి". వారు విజ్ఞానచంద్రికా గ్రంథమండలి కార్యాలయం మద్రాసులో పనిచేస్తున్నప్పుడు ఆ గ్రంథమండలి సభ్యులైన వేమూరి విశ్వనాథశర్మగారి ప్రోత్సాహంతో 1910లో ఈ పుస్తక రచనకు ఉద్యమించినారు. ఈ పుస్తకంలో రావిచెట్టు రంగారావు, ఉమేశచంద్ర బెనర్జీ, రమేశచంద్రదత్తు అనే ముగ్గురి మహానుభావుల చరిత్రలున్నవి. వీటిలోముందుగావ్రాసినది ఉమేశ చంద్ర బెనర్జీ చర్త్రి. దీన్ని 1910 ఫిబ్రవరిలో వ్రాసినారు. ఆ సంవత్సరమే రావిచెట్టు రంగారావుగారు పరమపదించగా వారి జీవిత చరిత్రంకూడా వ్రాసినారు. అటుతరువాత రమేశ చంద్రదత్తు గూర్చి వ్రాసి మూడింటిని కలిపి 1911లో విజ్ఞానచంద్రికా గ్రంథమండలి పక్షాన ప్రకటించినారు. రెండవముద్రణం 1915లో జరిగింది. ఈ పుస్తకం ఆదిరాజువారు తమ తల్లి వెంకమాంబగారికి అంకితం చేసినారు. జీవిత చరిత్రావళి రచించటానికి కారణాలు వారి మాటల్లోనే మనవి చేస్తాను.

"జీవచారిత్ర పఠనము ఉత్సాహము లేనివానికి ఉత్సాహము పుట్టించును; భావశూన్యులై యున్నవారికి ఉన్నత భావములు జనింప జేయును. ఇంతియేగాక గురువు వలె ఉపదేశము చేయును; తండ్రివలె బోధించును; మిత్రునివలె సలహానిచ్చును; భార్యవలె తోడ్పడును. ప్రపంచయాత్రా సందర్భమున ఆయాఘట్టములయందు మహానుభావుల జీవితములలోని విషయముల మన మాదర్శకముగ నుంచుకొంటిమేని యవి మార్గమును నిష్కంటకముగ చేయుననుటకును, మన శ్శాంతికి సహకారి యగుననుటకును ఎంతమాత్రము సందియములేదు. ఇట్లు దేశాభ్యుదయమునకు తోడ్పడునవి కావుననే మహాపురుషుల జీవితములే దేశమందును ఏ భాషయందును ఏ కాలమందును పఠనీయములు."

వీరభద్రరావుగారు ఈ ముగ్గురినే ఎంపిక చేసికోవటానికి కారణాలు, ఆనాటి మన దేశపరిస్థితులు, మన దేశాభ్యుదయానికి కావలసిన ఆదర్శాలు.

జీవిత చరిత్రావళిలో మొదటిది రావిచెట్టు రంగారావుగారి జీవిత చరిత్ర. రంగారావుగారు గొప్ప సంపన్నులైయుండికూడా ఆంధ్ర భాషాభిమానంతో దేశాభిమానంతో వాటి భాగ్యోదయానికి అహరహమూ తహతహ పడుతూ ఒక సామాన్యకార్యకర్తవలె, చివరకు చప్రాసీవలె ఆయా సంస్థల కోసం కృషిచేసిన మహానుభావుడు. ఆయన శ్రీ కృష్ణదేవరాయాంధ్ర భాషానిలయం స్థాపకుడు;

మొదటి కార్యదర్శి. శ్రీ శంకరభగవత్పూజ్యపాద గీర్వాణరత్నమంజూషా అనే సంస్కృత గ్రంథాలయ స్థాపకుడు. హనుమకొండలోని రాజరాజనరేంద్రాంధ్ర భాషానిలయం ప్రాదుర్భావానికి (1904) ఆయన కారకుడు విజ్ఞానచంద్రికా గ్రంథమండలి త్రిమూర్తుల్లో ఒకడేకాదు, ఆఫీసు కార్యకర్త. ఆ గ్రంథమండలి మద్రాసుకు తరలిపోతే సకుటుంబంగా మద్రాసుకుపోయి ఆరుమాసాలుండి దాని కొక వ్యవస్థ కల్పించిన త్యాగధనుడు. ఆంధ్ర మహిళాసంఘం స్థాపించి తమ సతీమణి లక్ష్మీనరసమ్మగారితో కార్యదర్శిని పనిచేయించిన ఉదారాశయుడు. కలకత్తా కాంగ్రెసు తీర్మానంకంటె పదేండ్లముందే స్వదేశీయోద్యమవ్రతం పాటించిన దేశభక్తుడు. 1908లో హైదరాబాదులో సంభవించిన జలప్రళయ సంక్షోభంలో నూర్లకొలది జనానికి ఆశ్రయమిచ్చిన కరుణామయుడు. వీరభద్రరావు గారివంటి అనేక అనాథ బాలబాలికలకు చదువు సంధ్యలు చెప్పించి పెంచి పెద్ద చేసిన దీనబాంధవుడు. దైవ దుర్విపాకంమూలంగా ఆ మహానుభావుడు 32 యేటనే కీర్తిశేషుడైనాడు. అటువంటి రంగారావుగారి చరిత్రను వారి సేవలను వారి మరణకాలపు సంతాప సభా విశేషాలతో విపులంగా వీరభద్రరావుగారు వ్రాసినారు. రంగారావుగారి మరణానికి సంతాపంచెందిన కొందరు కవిపండితులు వ్రాసిన పద్యాలుకూడ అనుబంధంగా చేర్చటం ఇందులోని విశేషం. మైలవరపు నరసింహశాస్త్రి, ఎవరో పొడి అక్షరాల M.V.S., బులుసు రామజోగిరావు, మున్నంగి లక్ష్మీనరసింహాచార్యులు, వేలాల సుబ్బారావు ప్రభృతులు వ్రాసిన పద్యాలతోపాటు మాడపాటి హనుమంతరావుగారు వ్రాసిన ఐదుపద్యాలున్నవి. మాడపాటి తాతగారు తొలి కథానికా రచయితలని కొద్దిమందికే తెలిసిన విశేషమనుకుంటే పద్యాలుకూడా వ్రాసినారనేది ఇంకొక ఆశ్చర్యం.

జీవితచరితావళిలోని రెండవ జీవిత చరిత్రం ఉమేశ చంద్ర బెనర్జీగారిది (1844–1906). బాల్యంలో గొప్పవాడౌతాడనే సూచనలేవీ లేకున్నా, కష్టపడి చదివి మహామేధావంతుడై బారిస్టరై లక్షలార్జించినా దేశసేవ కంకితమైపోయిన ఆదర్శజీవి బెనర్జీ. ఆయన 'బెంగాలీ' పత్రిక స్థాపకుడు. Indian National Congress (హిందూదేశీయ మహాసభ) స్థాపకుల్లో ముఖ్యుడు. 1882 సంవత్సరం బొంబాయిలో జరిగిన మొదటి కాంగ్రెసు అధ్యక్షుడు. అప్పటినుండి వంద్రెండు కాంగ్రెసు సభలవరకు ఆ సంస్థకు ఎనలేని సేవచేసిన దేశభక్తుడు. ఎనిమిదవ కాంగ్రెసుసభకుకూడా బెనర్జీగారే అధ్యక్షులైనారు. ఆయన సంఘ

సంస్కారపరాయణత్వం, సర్వమత సామరస్యం, ఆదర్శజీవితం, దేశభక్తి, వీరభద్రరావుగారు వివరంగా చిత్రించినారు.

జీవితచరిత్రావళిలోని మూడవ చరిత్ర రమేశచంద్ర దత్తు (1845-1909) గారిది. గత శతాబ్దపు భారతీయ మేధావుల్లో వక్తల్లో రచయితల్లో అగ్రశ్రేణికి చెందిన వారీయన. పట్టపరీక్షకు చదివేకాలంలోనే ఎవరికీ చెప్పక చేయక సురేంద్రనాథబెనర్జీ బిహారీలాల్ గుప్తలతో ఇంగ్లాండుకు పోయి కష్టపడి చదివి 1869 సివిల్ సర్వీసు పోటీ పరీక్షల్లో పాల్గొన్న మున్నూరుమందిలో మూడవ వాడుగా ఉత్తీర్ణుడైన మేధావి. ఇంగ్లాండులో గ్లాడ్స్టన్, డిస్రేలీ, జాన్‌బ్రైట్, చార్లెస్ డికెన్స్‌వంటివారి పరిచయాలు సంపాదించుకొని యూరపంతా తిరిగి 1871 నాటికి స్వదేశం వచ్చి బ్రిటిషువాళ్ళుకూడా ఆశ్చర్యపడే విధంగా అత్యున్నతమైన ప్రభుత్వోద్యోగాలను అతిసమర్థంగా నిర్వహించినాడు. గతశతాబ్దంలో (1894) డివిజనల్ కమీషనరైన మొదటి భారతీయుడితడే దాదాపు 22 సంవత్సరాలు బ్రిటిషు ప్రభుత్వోద్యోగాలు చేసి, జీవిత చరమకాలాన బరోడా ముఖ్యమంత్రిగా ఉండి నాటి స్వదేశ సంస్థానాల్లోనేకాదు, బ్రిటిషిండియాలోకూడ ఎక్కడాలేని కొత్త సంస్కరణలు ప్రవేశపెట్టి ఆ సంస్థానాన్ని మేలుబంతిగా తీర్చినాడు. 1893 నుండి 1899 వరకు ఇంగ్లాడులో నివాసం ఉండి భారతదేశంగూర్చి పాటుపడ్డాడు. ఆదినాల్లో భారతీయుల పాలిటి దేవదూతగా వ్యవహరించినాడు. 1899లో స్వదేశం తిరిగివచ్చి లక్నోలో జరిగిన 15వ కాంగ్రెసు సభలకు అధ్యక్షుడైనాడు. విదేశాల్లోను స్వదేశంలోను విస్తారంగా పర్యటించి ఎన్నో విశేషాలు గ్రంథస్థం చేసినాడు. 1. The three years in Europe 2. The Peasantry of Bengal 3. The literature of Bengal 4. Rise of the Maharashtra Confederacy 5. Civilisation in ancient India 6. Economic history of British India 7. The lays cf ancient India 8. England and India వంటి మౌలిక గ్రంథాలేకాక సంస్కృత రామాయణ మహాభారతాలను ఒక్క చేతిమీదుగా ఆంగ్లానువాదంచేసి మాక్సుముల్లరుకే ఆశ్చర్యం కలిగించినాడు. 1886లోనే ఋగ్వేదాన్ని బెంగాలీలోని కనువదించి ప్రకటించినాడు. సంసార్, సత్‌బరసా, వంగవిజిత, మాధవీకంకణ గ్రంథాలు బెంగాలీలో వ్రాసినాడు. మన దేవాలయాలు, శిల్పాలు, ఆచారాలు, ప్రాచీన

విద్యావిధానం మొదలైన వాటిగూర్చి అనేక వ్యాసాలు వ్రాసి పాశ్చాత్యులకున్న దురభిప్రాయాలను పోగొట్టినాడు. ఇట్టి ముగ్గురు మహానుభావుల 'జీవిత చరితావళి' యువకులకే కాదు, దేశసేవా పరాయణులైన పెద్దలకు కూడ అవశ్యపఠనీయం.

2. ఈ కోవకు చెందిన మరొక పుస్తకం 'చైతన్యము'. వీరభద్రరావు గారు హైస్కూలు విద్యార్థులకోసం ఈ పుస్తకం వ్రాసియున్నట్లుంది. దీన్ని నవోదయ పబ్లికేషన్స్ వారు 1957లో ప్రచురించినారు. ఈ పుస్తకానికి పీఠిక వ్రాసే భాగ్యం కూడ నాకు కలిగింది. ఇందులో నాల్గు కథలున్నవి. 1. చైతన్యమహాప్రభువు 2. యులిస్సిజ్ 3. మధుకైటభులు 4. జేమ్సు గార్ఫీల్డు, విద్యార్థులకోసం ఈ కథలు ఇంతవరకెవ్వరూ వ్రాసినట్లు లేదు. ఇటు వంటి అచుంబిత వస్తువులు తీసికొని యువకుల్లో నీతి నియమాలు, శౌర్యధైర్యాది గుణాలు, సత్ప్రవర్తనం, భక్తిప్రేమలు కలిగించి చైతన్యవంతులను చేయటం వీరభద్రరావుగారి ఉద్దేశం. ఈ నాల్గు కథల్లో రెండు భారతదేశానివి: చైతన్య మహాప్రభువు నవద్వీపంలో (1485) పుట్టి సమస్త విద్యలు అభ్యసించి శ్రీ కృష్ణభక్తుడై తన భక్తితో యావద్భారతాన్ని పునీతం చేసిన మహాను భావుడు. అతణ్ణి బాల్యంలో విశ్వంభరుడని, నిమాయి అని పిల్చేవారు; అటు తరువాత గౌరాంగుడని చైతన్యుడని ప్రసిద్ధి పొందినాడు. గుజరాత్, మధ్య ప్రదేశాలో పుష్టిమార్గాన్ని స్థాపించి ప్రచారం చేసిన వల్లభాచార్యులాంధ్రులు. ఆయనకూతురు లక్ష్మీదేవిని చైతన్యులు పెండ్లి చేసికొన్నారు. ఈ పిచ్చి భక్తుడు భక్తి ప్రబోధం చేస్తూ దేశం తిరుగుతుంటే ఆమె ఇంటివద్ద పతిభజన చేస్తూ, ఎంతకాలానికి ఆయన తిరిగి రాకపోతే ఆ విరహంతో దేహం చాలిం చిన పవిత్రురాలు. చైతన్యస్వామి ఎందరో శుష్కతార్కికులను నాస్తికులను దుర్మార్గులను భక్తులుగా మార్చినాడు. కేశవస్వామి దిగ్విజయి, వాసుదేవ సార్వభౌమ భట్టాచార్యులు, ప్రకాశానందస్వామి వంటి పండితులను, నౌరోజీ అనే దొంగల నాయకుణ్ణి, బిజిలీఖాన్ అనే పఠానును హరిభక్తులుగా మార్చి నాడు. పూరీ జగన్నాథ సముద్రతీరములో శ్రీకృష్ణుణ్ణి దర్శించి ఆ నీలసముద్ర గర్భంలోనే శ్రీ కృష్ణ పరమాత్మలో లీనమైపోయిన భక్తచైతన్యుడీ స్వామి.

ఇందులోని రెండవ కథ రోమనులు యులిస్సిజ్ అని పేర్కొనే గ్రీకు పురాణ వీరుడైన ఒడిస్సిస్‌కు సంబంధించినది. మన అర్జునుని పరాక్రమం, మన్మథుని అందం, విక్రమార్కుని సాహసం మూర్తీభవించిన వాడీ గ్రీకు

పురాణవీరుడు. ట్రాయ్ యుద్ధంలో పదేండ్లు, యుద్ధానంతరం గృహోన్ముఖుడై మరో పదేండ్లు, ఈ విధంగా ఇరవైయేండ్లు మాతృభూమినీ తల్లిదండ్రులనూ భార్యాబిడ్డలను విడిచి ప్రవాస జీవితం గడిపినాడు. ట్రాయ్ రణరంగంలోను, తిరుగు ప్రయాణంలో సముద్రపు తుఫానుల్లో, సైక్లోపు దీవుల్లో, లాస్ట్రిగోని యన్ల ప్రదేశాల్లోను, శిరిసి అనే మాంత్రికురాలితో కాపురం చేయటంలోను, కాలిప్సో దేవకాంత ప్రణయంలోను-స్వగృహం (ఇథాకా) చేరుకొన్న తరువాత ఇంటి శత్రువులతో పోరాడటంలోను యులిస్సిజ్ ప్రదర్శించిన నేర్పు, ఓర్పు సాహసం, శౌర్యం, బలవేగాలు చాల మనోహరంగా చిత్రించినారు వీరభద్ర రావుగారు.

మూడవది మధుకైటభుల చరిత్ర. వీళ్ళిద్దరూ రాక్షసులు. వీరు శ్రీ మహా విష్ణువు చెవుల్లోనుంచి పుట్టినా ఆతని చేతుల్లోనే చస్తారు. జగజ్జననిచేత వరాలు పొందిన ఈ రాక్షసులు సమస్త లోకాలనూ త్రిమూర్తులనూ గడగడలాడిస్తారు. శ్రీ మహావిష్ణువు వాళ్ళను చంపినప్పుడు వాళ్ళ మేదస్సు నీటిలో పడి పెద్ద తిప్పగా పేరుకొని భూమిగా మారిందట; అందుకే భూమికి మేదిని అనిపేరు. మన్ను తినరాని వస్తువైపోయింది (ఐనా కొందరు మట్టి కరుస్తున్నారు). ఈ మధుకైటభుల చరిత్ర దేవీభాగవతంలో విపులంగా ఉన్నది. ఈ కథ వ్రాస్తూ ఆదిరాజువారు తిరుపతి వెంకటకవుల దేవీభాగవతంలోని పద్యాలు కొన్ని ఉదా హరించినారు.

నాల్గవది జేమ్సుగార్ఫీల్డు కథ (1831-1380). గార్ఫీల్డు ఉత్తర అమె రికా నిరుపేద కుటుంబంలో జన్మించినాడు. కట్టెలు కొట్టి వడ్రంగులవద్ద కూలి చేసి తల్లినీ తననూ పోషించుకొంటూ దీపం లేకపోతే పొయ్యిమంట వెలుతు రులో చదువుకొంటూ తన సౌశీల్యంతో వినయంతో ఉపాధ్యాయుల మన్ననలు పొంది సాటి విద్యార్థుల్లో మేటియైనవాడు గార్ఫీల్డు. విద్యార్థిగా హీరాం విద్యా లయం పుస్తకభాండాగారంలోని 20,000 పుస్తకాలు చదివి జీర్ణించుకొని అక్కడి ఆచార్యవర్గానికే ఆశ్చర్యం కలిగించినాడు. విలియమ్స్ కళాశాలనుండి 1856 సర్వోత్తముడుగా పట్టభద్రుడైనాడు. తాను చదువుకొన్న హీరాం పాఠ శాలలో ప్రధానాచార్యుడై రెండువేల జీతం సంపాదించినాడు. 1860లో ఓహియో మండలంనుండి సెనేటు సభ్యుడుగా ఎన్నికైనాడు. బానిస విధానం రూపుమాపే ప్రయత్నంలో అబ్రహాం లింకనుకు కుడిభుజమైనాడు. 1863

నాటి చికామాగ్వ యుద్ధంలో సైనికుడుగా పరాక్రమం ప్రదర్శించి 'జనరల్' పదవి నందుకున్నాడు. 1880 సంవత్సరం అమెరికా స్వతంత్ర రాజ్యాల అధ్యక్షుడైనాడు. ఈ విధంగా ఒక అత్యంత నిరుపేద కుటుంబంలో పుట్టి స్వయం కృషితో, తెలివితేటలతో, సౌశీల్యాది సద్గుణ సంపత్తితో, దేశసేవా భావంతో అత్యున్నతపదవికి చేరుకొన్న జేమ్సు గార్ఫీల్డు చరిత్రం అందరికీ ఆదర్శం కాగలదు. అందుకే అదిరాజు వారీతని చరిత్రం తెలుగు విద్యార్థుల కోసం సరళ సుందరంగా వ్రాసినారు.

3. విద్యార్థులకోసం వ్రాసిన మరోపుస్తకం 'లలిత కథావళి'. ఈ పుస్తకం ఆంధ్ర బుక్‌హౌస్ వారు 1950లో ప్రకటించినారు. ఇందులో నాల్గు పాఠాలున్నవి. 1. రమేశ్ చంద్రదత్తు I. C. S. 2. అజంతా—ఎల్లోరా 3. పెరుస్యూసు 4. శ్రావణి ఈ నాల్గు మానవాదర్శం, లలిత కళాభిజ్ఞత, ప్రాచీన విజ్ఞానం, పరోపకారభావ విలసనం అనే వానికి క్రమంగా ఉదాహరణలు. ఇందులో మొదటిపాఠం రమేశ్ చంద్రదత్తు "జీవిత చరితావళి"లో వచ్చినదే. అజంతా ఎలోరాలో తేదీలు చరిత్ర విషయాలు తడవకుండా ఆ గుహాలయాలు ఆక్కడి హిందూ బౌద్ధ జైన శిల్పవిశేషాలు చిత్రకళారీతులు వాటి సంప్ర దాయాలూ భంగిమలూ యువకుల మనస్సుల కెక్కే విధంగా కళాపిపాస కలిగే విధంగా చెప్పినారు

'పెరుస్యూసు' ఒక గ్రీకు—రోమను పురాణగాథ. ఆర్గోసుపాలకుడు ఆక్రిసియసు, ఆతని బిడ్డ దానయి. ఆమెకు పుట్టబోయే కొడుకు తనను చంపుతాడని జ్యోతిషులవలన విన్న ఆక్రిసియసు దానయిని చెరలో బంధిస్తాడు. జ్యూపిటరు దేవత దానయిని మోహిస్తాడు. చెరలోనే ఆమె పెరుస్యూసును కంటుంది. ఆక్రిసియసు ఈ మాతా శిశువులను సముద్రంలో విడుస్తాడు. వాళ్ళు సెఫోరసు ద్వీపం చేరుకుంటారు. డిక్టిసు అనే వాడు వాళ్ళను చేరదీసి పెంచుతాడు. పెరుస్యూసు పెరిగి పెద్దవాడై మహావీరుడౌతాడు. ఆతడు దేశాంతరం పోయినప్పుడు ఆ దీవిపాలకుడు పోలిడిక్టిసు దానయిని మోహించి ఆమె తిరస్కరించగా ఆమెను తనయింటి దాసినగా చేసుకొని అష్టకష్టాలు పెడుతుంటాడు. పెరుస్యూసు వచ్చి తల్లిని విడిపిస్తాడు పెరుస్యూసును చంపించటానికి కుట్రపన్ని బుజ్జగించి పొగడి పోలీడిక్టిసు ఆతణ్ణి మెడ్యూసా శిరఃఖండనం చేసి తీసుకరమ్మని పంపిస్తాడు. పెరుస్యూసు నానా కష్టాలు పడి దేవతల సహాయంతో మెడ్యూసా

శిరఃఖండనం చేసి తిరిగివస్తూ మార్గంలో ఆంద్రొమెడా అనే అందాలరాశిని పెండ్లాడి ఏడేండ్లకు ఇల్లు చేరుకొంటాడు. మెడ్యూసా శిరోదర్శనంతో పోలీడిక్టిసు చనిపోతాడు. పెరుస్యూసు తల్లితో భార్యతో ఆర్గోసు చేరుకొంటాడు. క్రూరుడైనతాతను, వానితమ్ముణ్ణి, వాని అనుచరులైన సైక్లోపులను చంపి రాజౌతాడు. చాలాకాలం చక్కగా ప్రజలను పాలిస్తాడు. అంద్రొమెడా పెరుస్యూసు దంపతులు చనిపోయి నక్షత్రాలై ఈ నాటికి ఆకాశాన వెల్గుతున్నారు.

నాల్గవది 'శ్రావణి' కథ. శ్రావణి అందమూ, చదువు సంస్కారాలు గల అమ్మాయి. 'దరిద్ర నారాయణ' పత్రిక సంపాదకురాలు. ఆమె రామాపురంలోని దరిద్రులను కూలీలను అభిమానించి వారిని ఉద్ధరించటానికై రామాపురం జమీందారు రాజా రామభూషణరావు బహద్దరును నిశితంగా నిందాత్మకంగా విమర్శిస్తూ సంపాదకీయాలు వ్రాస్తుంది. ఐతే ఆ జమీందారు శ్రావణికంటె ఎక్కువ సంస్కారం కలవాడు, అందగాడు. ఆమెకు విరుద్ధంగా ఏ చర్య తీసుకోడు. తన సంపదను భవనాలను ఉద్యానవనాలను దీనజనోద్ధరణ కోసం వసతులకోసం అంకితం చేస్తాడు. శ్రావణిని ప్రేమించి పెండ్లి చేసికొంటాడు. భగవంతుడు ఐశ్వర్యం ఇచ్చింది స్వార్థంకోసం కాదనీ, సోదర మానవుల పక్షాన ధర్మకర్తగా వ్యవహరించటానికే ఆ ఐశ్వర్యం అని ఈ కథలోని గుణపాఠం. ఈనాడు ధనికులు పేదలమధ్య జరిగే సంఘర్షణలూ వాని సమస్యలూ ఈ కథలో సామరస్యంతోను మనోహరంగాను తీర్మానించిబడ్డవి. శ్రావణి వంటిదే ఆదిలక్ష్మి, సౌగంధి, సుభద్ర అనే కల్పిత కథలు ప్రయోజనం ఉద్దేశించి పంతులుగారు వ్రాసినవి.

4. 'రత్నప్రభ' అనే పుస్తకం గూడ 'ఆంధ్ర బుక్‌హౌస్' వారే 1950 లో ప్రకటించినారు. అరేబియన్ నైట్స్ కథల్లోని అలాఉద్దీన్ విచిత్ర దీపంకథ భారతీయ వాతావరణంలో చిత్రించినారు వీరభద్రరావుగారు. కోసల దేశంలోని రత్నగిరి ఇందులోని కథాస్థానం. అలాఉద్దీన్ వసంతుడుగా, అతని తల్లి పార్వతిగా, అరబ్బు మాంత్రికుడు సింహళదేశీయుడైన సుదర్శనుడుగా అవతరిస్తారు. కోసలాధీశ్వరుడైన విక్రమసింహుని ఒకే సంతానం రత్నప్రభ. సుదర్శనుడు అమాయికులైన వసంతుణ్ణి అతని తల్లి పార్వతిని మోసగిస్తాడు, పినతండ్రిగా నటిస్తాడు. వసంతుని ద్వారా విచిత్రదీపం సంపాదించ ప్రయత్నిస్తాడు. కాని వసంతుడు సుదర్శనుని కపటం తెలిసికొని అంగుళీయకాన్ని

దీపాన్ని కొలిచే భూతాల సహాయంతో రత్నప్రభను పెండ్లి చేసికొంటాడు. సమస్తైశ్వర్యాలు సంపాదించుకొంటాడు. ఒకప్పుడు వసంతుడు ఇంటలేని సమయాన సుదర్శనుడు విచిత్రదీపం సంపాదించి రత్నగిరిలోని వసంతుని ఇల్లును సింహళానికి తరలిస్తాడు. పాపం రత్నప్రభ పార్వతి మొదలైన వాళ్ళంతా సుదర్శనునికి బందీలై పోతారు. వసంతుడు అంగుళీయకభూతం సహాయంతో సింహళం చేరుకొని సుదర్శనుని చంపి విచిత్రదీపం స్వాధీనం చేసుకొని మళ్ళా రత్నగిరికి తిరిగివస్తాడు. చివరకు కోసలాధీశ్వరుడుగా కూడ పట్టాభిషిక్తుడౌతాడు.

5. 'ప్రాచీన ఆంధ్ర నగరములు' (మొదటి భాగం) :- ఇది ఆదిరాజువారి పరిశోధనకు పరిశీలనకు ఉదాహరణంగా చెప్పుకోదగిన గ్రంథం; ఆంధ్ర చంద్రికా గ్రంథమాలలో నాల్గో కుసుమంగా రావిచెట్టు రంగారావుగారికి అంకితంగా నరోత్తమరెడ్డిగారి భూమికతో 1950లో మొదటిసారి ప్రకటింపబడింది. మళ్ళా 1951లోనే పుట్టపర్తి శ్రీనివాసాచార్యులవారి ఇంగ్లీషు పీఠికతో రెండవముద్రణం పొందింది. రెండోముద్రణం ప్రతులు కొన్ని మిగిలితే వట్టికోట ఆళ్వారుస్వామిగారు 1956లో తెలంగాణం మూడవ భాగంగా తమ దేశోద్ధారక గ్రంథమాలలో 27వ ప్రచురణగా కొత్త అట్టతో ప్రచారం చేసినారు. పంతులుగారు దీనిని ఆంధ్రనగరములు మొదటిభాగం అన్నారు. రెండోభాగం కూడా ప్రకటించాలెననే ఉద్దేశం ఉండేదన్నమాట. మనం ఆ రెండోభాగానికి నోచుకోలేదు. ఈ పుస్తకం వ్రాయటానికి కొమర్రాజు వారిమాటలు ప్రేరకాలు. ఈ శతాబ్దపు ప్రారంభంలో కొమర్రాజువారు "ఆంధ్రదేశమును గురించియు ఆంధ్ర రాజులను గూర్చియు, ఆంధ్రవాఙ్మయమును గూర్చియు నెక్కుడు పరిశోధనలుచేసి క్రొత్త వింతలను గనుగొనదలచిన వారికి హైదరాబాదునందలి తెలుగు భాగమొక బంగారుగని వంటిది" అన్నారు. అది ఈనాటికీ పరమసత్యంగా ఉండటం మనకు సంతోషంతోపాటు విచారంకూడ కలిగిస్తుంది. కొమర్రాజువారి ఈ ప్రవచనంతో ఆవేశం పొంది ఎంతో పరిశ్రమకోర్చి పరిశోధన చేసి ఆదిరాజువారీ గ్రంథం వ్రాసినారు. అటువంటి పుస్తకం ఈనాటి వరకు మళ్ళా రాలేదు.

ఈ పుస్తకంలో 1. ఆలంపురం 2. ఆనెగొంది 3. కల్యాణి 4. కొండాపురం 5. కొలనుపాక 6. గోలకొండ 7. పానుగల్లు 8. ప్రతిష్ఠానము 9. భోన

గిరి 10. రాచకొండ 11. వరంగల్లు 12. వేల్పుగొండ అనే పన్నెండు ప్రాచీన నగరాల చరిత్ర 13. పటాలతో ప్రకటితమైనది. ఒకప్పుడు ఆంధ్ర నగరాలైనా ఇందులోని ఆనెగొంది, కల్యాణి ఈనాటి కర్ణాటకంలోను, ప్రతిష్ఠానం మహారాష్ట్రలోను ఉన్నవి. ఈ పన్నెండు నగరాలు వాటి పుట్టుపూర్వోత్తరాలు, వాటిని పాలించిన రాజులు రాణులు, అక్కడి ప్రజానీకపు సాంఘిక ఆర్థికజీవితం, మతం, వాణిజ్యం, వింతలు వినోదాలు, గుళ్ళుగోపురాలు, శిల్పాలు చిత్రాలు, కోటలు కొత్తళాలు. శిథిలాలు దిబ్బలూ ఇంకా ఇంకా చాలా విశేషాలు వ్రాసినారు. ఈ గ్రంథంలో, వాటిగూర్చి ఇక్కడ వ్రాయటం ఆ పుస్తకమంతా ఉదాహరించటమే ఔతుంది. ఐతే ఒక్క విషయం చెప్పక తప్పదు. ఈ పట్టణాల్లోనో వాటి పరిసరాల్లోనో ఈనాడుంటున్న వారికి నూటికి తొంభై మందికి వాటి ప్రాచీన చరిత్ర వైభవం, ఇప్పటికీ మారుమూలలో అక్కడ మిగిలి ఉన్న అవశేషాలు తెలియవు. కనుక ఆదిరాజువారి గ్రంథాల్లో ఇది పునర్ముద్రణమై బహుళ ప్రచారం కావటం అవసరం.

6. మన తెలంగాణము :- వట్టికోట ఆళ్వారుస్వామిగారు 1956 లో ఆంధ్ర ప్రదేశం అవతరణం కనుచూపు మేరలో ఉండగా దేశోద్ధారక గ్రంథమాల 34వ ప్రచురణంగా పదిమంది రచయితలు వ్రాసిన 19 వ్యాసాల సంకలనం తెలంగాణం (మొదటి భాగం) పేరుతో ప్రకటించినారు. ఇందులో పది వ్యాసాలు వీరభద్రరావు గారివి. మొదటి 81 పుటల్లో తొమ్మిది వ్యాసాలు, చివరన 205 నుండి 218 వరకున్న పుటల్లో పదవ వ్యాసం ఉన్నవి. ఈ పది వ్యాసాలున్న ఫారాలనే చివరి వ్యాసం పుట సంఖ్యలు మార్చి "మన తెలంగాణము" అనే పేరుతో 95 పుటల పుస్తకం వేరుగా కుట్టి శ్రీనివాస సోదరుల తొలిపలుకుతో వేరే ముఖపత్రంతో ఆళ్వారుస్వామిగారే వీరభద్రరావుగారికి పారితోషికంగా సమర్పించినారు.

ఇందులోని మొదటి వ్యాసం కాకతీయ రాజవంశము. సాతవాహనుల తరువాత అంటే దాదాపు వెయ్యేండ్ల తరువాత తెలుగు దేశాన్నంతటినీ ఒక గొడుగు క్రిందికి తెచ్చిన కాకతీయుల పుట్టుపూర్వోత్తరాలు, ఆ వంశపురాజులు, వారి కాలాలు ఇందులో క్లుప్తంగా ఉన్నవి. రెండోవ్యాసం కాకతీయుల సాంఘిక చరిత్ర. ఇందులో కాకతీయుల నాటి మతం దేవాలయాలు, సాంఘిక వ్యవస్థ, వాణిజ్యం, ప్రజాసౌకర్యాలు క్లుప్తంగా చెప్పినారు. మూడోవ్యాసం తాళపత్ర

గ్రంథములు. ఇందులో టాటిచెట్టు, దాని ప్రయోజనం, వ్రాతకుపయోగించే తాటాకులు, తెలంగాణంలో లక్ష్మణరాయ పరిశోధకమండలి వారు సేకరించిన తాళపత్ర గ్రంథాల వివరాలు ధనంజయ విజయ వ్యాయోగం. అర్థ చిత్ర మీమాంస, అనంగమంగళభాణం వంటి సంస్కృత గ్రంథాలు, శాల్మలీకంద నంద నందన విలాసం, దశరథరాజ నందన చరిత్ర, శ్రీ కృష్ణశతానందీయం, చిలువ పడగరేని పేరణం, తాలాంకనందినీ పరిణయం, చాడవీరరాఘవరెడ్డి ద్విపద రామాయణం, కట్టా వరదరాజు ద్విపదరామాయణం, మధురవాణీ విలాసంవంటి తెలుగు గ్రంథాల పరిచయం ఉన్నది. నాలుగోది నాణెములు అనే వ్యాసం, హైదరాబాదు అర్కిశాఖవారు సేకరించిన వెండి బంగారు తదితర లోహాల 60,000నాణాలు, వాటి చారిత్రక విశేషాలు, ఆనాటి టంకసాలలు మొదలైన విశేషాలీ వ్యాసంలో చెప్పినారు. ఇది బహుశః వారి రేడియో ప్రసంగం కావచ్చు. ఐదవవ్యాసం శాసనాలు. హైదరాబాదు అర్కిశాఖవారు ప్రకటించిన ఆంధ్ర చరిత్రకు సంబంధించిన సంస్కృతాంధ్రశాసనాలు, అందులో వచ్చే చారిత్రక వ్యక్తులు, వారి బిరుదాలు, కవిపండితులు, గుళ్ళు గోపురాలు, వాణిజ్యం పన్నులు మొదలైన విశేషాలు ఇందులో ఉన్నవి. ఇది ఒకప్పుడు రేడియో ద్వారా ప్రసారమైనదే. ఆరోవ్యాసం పాకాలసరస్సు. కాకతీయుల కాలంలో నిర్మాణమైన పాకాలసరస్సు, దానికి సంబంధించిన గాథలు, అక్కడి పూర్వ పట్టణాలు, జనపదాలు, నేటి అరణ్యాలు, వనమృగాలు, జలచరాలు, నీటికాలువలు, వాటి క్రింద సాగయ్యే పొలాల విస్తీర్ణం విపులంగా వర్ణించినారు. చెరువుకట్ట మీద ఉన్న శాసనంలోని శ్లోకాలుకూడ ఉదాహరించినారు, ఏడవ వ్యాసం దేవాలయాలు. తెలంగాణంలో ఉన్న 641 దేవాలయాలు వివిధ జిల్లాలలో వాటి సంఖ్య, ప్రముఖ దేవాలయాల శిల్ప ప్రశస్తి ఇందులో ఉంది. ఎనిమిదవది గోలుకొండ పట్టణము. 'ప్రాచీనాంధ్ర నగరములు' గ్రంథంలో ఉన్న గోలకొండ వ్యాసం కంటె ఇది భిన్నమైనది, ఖుతుబ్షాహిలనాటి గోలకొండ పట్టణ వైభవం, రాజప్రాసాదాలు, ఆరామాలు, వీధులు, అంగళ్ళు, జలాశయాలు, ఉమ్రావులఆడంబరాలు, సరదాలు ఇందులో విపులంగా వివరించినారు. ఆనాటి గోల్కొండలో ప్రకటించిన మార్కెటు ధరలు శాసనాల ఆధారంగా పేర్కొన్నారు. ఆనాటి ధరలు కలలోని వింతలవలె ఉంటవి. ఆనాడు వాడుకలో ఉన్న నాణాలు హొన్నులు, పణాలు. హొన్ను అంటే నాల్గు రూపాయలకు సమానం. పణం హొన్నులో పదహారవభాగం అంటే మన పావలా. గోధుమలు పుట్టికి 4

మన పురాణేతిహాసాలలోని దేవతలు, దేవజాతికి చెందిన గరుడ యక్ష గంధర్వ కిన్నరాదులు, రాక్షసులు, స్వర్గనరకాలు, పునర్జన్మలు మొదలైనవాటితో కొన్ని పోలికలు కనిపిస్తవి. ఈ గ్రీకు రోమను పురాణాలు వాటిలోని పేర్లు పోలికలు సరిచూచుకొంటూ అనువదించటానికి ఆదిరాజు వారెంత శ్రమపడ్డారో స్థాలీపులాకంగనైనా ఈ గ్రంథం చదివితే తెలుస్తుంది. అముద్రితంగా మిగిలిపోయిన గాథలు కూడ ముద్రిస్తే తెలుగు భాషలో ఇదొక అపూర్వ గ్రంథం ఔతుంది.

8. తెలంగానా శాసనములు (మొదటి సంపుటం) :- లక్ష్మణరాయ పరిశోధకమండలి ప్రధాన శేషాద్రిరమణ కవులు తెలంగాణమంతటా తిరిగి నూర్లకొలది శాసనాలు తాళపత్రగ్రంథాలు నాణాలు సేకరించినారు. అందులో కొన్ని శాసనాలు మండలి కార్యదర్శిగా వీరభద్రరావుగారు సంపాదించి 1935లో ప్రకటించినారు. ఈ ప్రథమ సంపుటంలో మొత్తం 123 శాసనాలున్నవి, ఇందులో 57 కాకతీయులవి, 42 చాళుక్యులవి, 24 ఇతరులవి. ఇవి తెలుగు, సంస్కృతం, కన్నడం మూడు భాషల్లోను ఉన్నవి. మొదటి సారిగా ఇందులో ఎన్నో విలువైన శాసనాలు ప్రకటించటం జరిగింది. శేషాద్రిరమణ కవులు, ఆదిరాజువారు ఈ శాసనాల పఠనంలో, ప్రకటనంలో చేసిన కృషికి పరిశ్రమకు ఆంధ్రదేశం ఎల్లప్పుడూ కృతజ్ఞతాబద్ధమై ఉండాలె.

9. షితాబుఖాను అను సీతాపతి రాజు ;— 16వ శతాబ్దం ప్రారంభంలో ఓరుగల్లును పునరాక్రమించి దాని పూర్వవైభవాన్ని పునరుద్ధరించటానికి ప్రయత్నించిన ఈ మహావీరుడు షితాబ్ఖాన్ బిరుదంగల సీతాపతిరాజు. ఈతని శాసనం ఓరుగల్లు కోటలో ఉన్నది. దీన్ని మొదటిసారి లోకానికి తెలియజేసిన వారు కొమఱ్ఱాజు వారు. అటు తరువాతివారు డా. హీరానందశాస్త్రిగారు. ఈ యిరువురి వ్రాతలను సమన్వయించి సంస్కృత శాసన శ్లోకాలకు తెనుగు అనువాదంతో తెలుగుకావ్యాధారాలతో ఆచార్య ఖండవల్లి లక్ష్మీరంజనంగారి ఇంగ్లీషు పీఠికతో పది ప్రకరణాల గ్రంథంగా లక్ష్మణరాయ పరిశోధక మండలి ప్రధాన వీరభద్రరావుగారు 1961లో ప్రకటించి ఆంధ్ర చరిత్రకు పరిశోధనకు మహోపకారం చేసినారు.

10. తెలంగాణ శాసనములు (రెండవ సంపుటం) :- ఇందులో 85 శాసనాలున్నవి చాలాభాగం శేషాద్రిరమణ కవులు సేకరించినవే. మరికొన్ని

త్రం తమపేరు పెట్టుకోకుండా వ్రాసింది వారే. వారి పేరుతో ఇందులో (238-270 పుటల్లో) 'షితాబుఖాన బిరుదాంకితుడగు సీతాపతిరాజు' అనే వ్యాసం వేరొకటుంది. 1934లో సురవరం ప్రతాపరెడ్డిగారు గోలకొండకవుల సంచికను ప్రకటించినారు. రెడ్డిగారి భారాన్ని చాలాభాగం పంచుకొని ఆ సంచికను ఒక ఆకర గ్రంథంగా తీర్చి దిద్దినారు ఆదిరాజువారు.

ఆదిరాజు వీరభద్రరావుగారి మరొక మహత్తరకృషి సంగ్రహాంధ్ర విజ్ఞానకోశం ఎనిమిది సంపుటాలు ఈ సారస్వత యజ్ఞానికి ఖండవల్లి లక్ష్మీరంజనంగారు సోమయాజులైతే వీరభద్రరావుగారు బ్రహ్మ, వివిధ సంపాదకులు ఋత్విజులు, రచయితలు మంత్రపాఠకులు. ఒక్కొక్కప్పుడు బ్రహ్మగారే ఋత్విజుల పని, మంత్ర పాఠకులపని చేసేవారు. తెలుగులో వచ్చిన వ్యాసాలు సరిగా ఉన్నాయో లేవో చూచుకొని సవరణలు చేర్చటంలోను, ఇంగ్లీషు వ్యాసాలైతే వాటి అనువాదాలు సవరించుకోవటంలోను, సమయానికి వ్యాసాలు అందకపోతే తామే వ్రాయటంలోను, అందినవి సమగ్రంగా లేకపోతే ఆ కొరవలు పూర్తిచేయటంలోను-చివరకు ప్రూఫులు దిద్దటంలోను 1955 నుండి 1970 వరకు వారు చేసిన కృషి. వారు పడిన శ్రమ అసామాన్యమైనది. ఆ విజ్ఞానకోశంలోని "ఆంధ్రదేశము-విశేషశీర్షికలు" అనే భాగానికి వారే సంపాదకులు. ఈ యెనిమిది సంపుటాల్లో వారి పేరుతో ఉన్న వ్యాసాలు 45. వాటి వివరాలు.

I సంపుటంలో :- 1. అనంతపురం జిల్లా, అనంతపురం పట్టణం 2. అల్లూరి సీతారామరాజు

II సంపుటంలో:- 1. ఉమామహేశ్వరము 2. ఎలిఫెంటాగుహాలయములు 3. కార్లీగుహాలయములు.

III సంపుటంలో :- 1. కొండాపురం 2. కొమర్రాజు వెంకటలక్ష్మణరావు 3. కోడూరు V 4. ఖమ్మముజిల్లా 5. గాజులబండ 6. గారిబాల్డీ 7. చంద్రగుప్తచక్రవర్తి 8. చంద్రవంక 9. చతురంగబలములుII 10. చిత్తూరు జిల్లా 11. చైతన్య మహాప్రభువు.

IV సంపుటంలో :- 1. జేమ్సుగార్ఫీల్డు 2. తాడిపత్రి I చరిత్ర.

V సంపుటంలో:- 1. నల్లగొండజిల్లా 2. నాగార్జునకొండ 3. నిజామాబాదు జిల్లా 4. నెల్లూరు జిల్లా 5. నేపాలు దేశములోని శిల్పకళ 6. పండరంగడు.

VI సంపుటంలో :- 1. ఫణిగిరి 2. బడుగరులు 3. బయకార రామప్పయ్య-ం 4. బౌద్ధదేవతలు.

VII సంపుటంలో :- 1. భైరవకొండ 2. మహబూబునగరు జిల్లా 3. మహానంది 4. మహాబలిపురము 5. మహావీరుడు 6. మెదకుజిల్లా 7. మొహంజదారో 8. యక్షగానము (సాహిత్య సంబంధము) 9. యాదగిరి 10. యేలేశ్వరము 11. రామప్పదేవాలయము 12. రామప్రధాని 13. రామయ భాస్కరుడు 14. రాయన భాస్కరుడు.

VIII సంపుటంలో:- 1. వరంగల్లుజిల్లా 2. శేషాద్రిరమణకవులు 3. హైదరాబాదు జిల్లా.

పై వ్యాసాలలోని విషయమూ వాటి వైవిధ్యమూ చూస్తే ఆదిరాజువారి బహుముఖ పరిశ్రమ మనకు తెలుస్తుంది.

తెలుగుభాషా సమితి వారి విజ్ఞాన సర్వస్వం మూడవ సంపుటంలో 'నాయని వెంకట రంగారావు' అనే వ్యాసం ఒక్కటి మాత్రమే వ్రాసినారు.

ఇక ప్రత్యేక సంచికలో వ్యాస సంకలనాలో వారి రచనలు

1. 'ఖుతుబ్షాహి సుల్తానుల కాలములో ఉర్దూ సాహిత్యము'
   ఖుతుబ్షాహి సుల్తానులు - ఆంధ్రసంస్కృతిలో — 1962
2. 'గోలకొండ కుతుబుషాహి సుల్తానుల కాలములో తెలుగు సాహిత్యము'
   శ్రీ కృష్ణదేవరాయాంధ్ర భాషానిలయం వజ్రోత్సవ సంచికలో—1962
3. కుతుబ్‌షాహీల తెలుగు సాహిత్యపోషణము.
   నరేంద్రనాథ సాహిత్యమండలి (తణుకు) వారి సాహితీ వాల్లభ్యములో—1968
4. మన చారిత్రక సంపద
   ఆలంపుర సాహిత్య సభల ప్రత్యేక సంచిక సుజాతలో —1958
5. సౌగంధి (కథ)
   గోలకొండ పత్రిక విభవ సంవత్సరాది సంచికలో 1928
6. తిథి గోలకొండ 9వ సంవత్సరాది సంచికలో మే-1934
7. ఇంగ్లీషు తారీఖునుబట్టి వారమును కనుగొనుట
   గోలకొండ 12వ సంవత్సరాది సంచికలో మే-1937

8. జనసామాన్య ప్రయోజనాదులకు ఉద్దిష్టమైన మహోన్నతకృషి-నాడు నేడు-గోలకొండ ఉత్తమాదర్శాలు-గోలకొండ 36వ సంవత్సరాది సంచికలో మే-1962

వీరభద్రరావుగారు గోలకొండ పత్రికకు తరుచుగా వ్రాస్తుండేవారు. ప్రత్యేక సంచికలోనేకాక వారం వారం వచ్చే సాహిత్యానుబంధంలోను, గోలుకొండ గ్రంథాలయం అనే పుస్తక సమీక్షలోను అప్పుడప్పుడు దిన పత్రికల్లోను అనేక వ్యాసాలు కథలు గ్రంథసమీక్షలు వ్రాసినారు. ఈ నాడా పత్రిక సంపుటాలు సరిగా లభించటంలేదు. నాకు లభించిన సమాచారం కొందిమాత్రం నివేదిస్తున్నాను.

1. 'బిజిలి' సంపాదనము (సుభద్ర) కథ గోలకొండ 20-10-1336 ఫసలి
2. వివాహ సంస్కారకథ గోలకొండ 7-9-1937
3. రాజాబహదరు వెంకటరామరెడ్డి జీవితచరిత్ర-సమీక్ష ,, 5-10-1939
   (కర్త:- సు. ప్ర. రెడ్డి)
4. త్రిదోషములు-సమీక్ష (కర్త:- భా. రామమూర్తిశాస్త్రి) ,, 31-8-1939
5. జాతకకథాగుచ్ఛము-సమీక్ష (కర్త:- సం. సూ. శాస్త్రి) ,, 31-8-1939
6. హిందువుల పండుగలు - సమీక్ష
   (కర్త:—సు. ప్ర. రెడ్డి) ,, ?
7. విజయనగర సామ్రాజ్య స్థాపనకథ ,, 22-10-1945
8. గాంధీ జీవిత రహస్యము ,, 12-2-1948
9. గద్వాల సంస్థానము ,, 1-3-1958
10. జంగంకథలోని కళాభిజ్ఞత—సమాజ సాన్నిహిత్యం ,, 21-10-1951
11. ప్రాచీన కదన పాండితి—ఆయుధవిశేషాలు
   సంగ్రామశైలులు ,, 15-8-1957
12. వేములవాడ తిరునాళ్ళు ,, 10-5-1959
13. కుతుబ్షాహీ రాజుల కాలములోతెలుగు సాహిత్యము ,, 13-11-1960
14 కుతుబ్షాహీల కాలములో ఉర్దూ సాహిత్యము ,, 11-12-1960
15. శాతవాహనులు జయప్రదులైనచో ,, 8-1-1961
16. తెలుగుదేశంలో ఊళ్ళపేర్లు ,, 12-3-1961
17. శేషాద్రిరమణ కవులు-వారి భాషాసేవ ,, 21-1-1962

13. కొమఱ్ఱాజువారి చరణ సన్నిధిని ,, 6-1-1964
19. గోలకొండ (స్థలపురాణము) ,, 19-2-1964
20. తెలంగాణ శాసనములు -1 ,, 15-3-1964
21. తెలంగాణ శాసనములు-2 ,, 18-3-1964
22. ఉత్తర కాకతీయ యుగ చారిత్రము-1 ,, 20-3-1964
23. ఉత్తర కాకతీయ యుగ చారిత్రము-2 ,, 23-3-1964
24. ఉత్తర కాకతీయ యుగ చారిత్రము-3 ,, ?
25. ఆంధ్ర మహాభారతము ,, 9-5-1964
26. కొమఱ్ఱాజు వెంకటలక్ష్మణరావు ,, 1-4-1965

వీరభద్రరావుగారు నీలగిరి, మీజాన్, భాగ్యనగర్, తెలుగుదేశం, దేశ బంధు, ప్రగతి, కాకతీయ, తెలంగాణ పత్రిక. పద్మశాలి, ఆంధ్రాభ్యుదయము, ఆంధ్రపత్రిక, తెలుగుతల్లి మొదలైన పత్రికల్లో అనేక వ్యాసాలు ప్రచురించి నారు. అందులో నాకంట పడినవి కొన్ని.

1. నిజాంరాష్ట్రాంధ్ర జనసంఘముల పరస్పర సంబంధము నీలగిరి 21-8-1921
2. ఇంగ్లీషు తారీఖును బట్టి వారము కనుగొనుట తెలుగుతల్లి 22-10-1939
3. సర్వజ్ఞ శేఖరుడు లక్ష్మణరావు ,, ?
4. హైద్రాబాదు రాష్ట్రంలో విద్యాభివృద్ధి- (పత్రిక పేరు తెలియదు) ,, 22-11-1930
5. కొండవీడు దేశబంధు 23-7-1946
6. తాలాంకనందినీ పరిణయం—1 తెలంగాణపత్రిక 26-5-1946
7. తాలాంకనందినీ పరిణయం-2 ,, 2-6-1946
8. కొండవీడు కథనము ,, 23-7-1946
9. ఆనగొందిపురకథనము శోభ జూన్ 1947
10 ఆంధ్ర సారస్వత పరిషత్తు తూపురాన్ సభల అధ్యక్షోపన్యాసము ,, ఫిబ్రవరి 1950
11. పల్లె పదాలు ,, జూన్ 1950
12. యక్ష గానములు-1 ,, జులై 1950
13. యక్ష గానములు-2 ,, అక్టోబర్ 1950
14. భారతీయ విద్యాపీఠములు ,, డిసెంబర్ 1950
15 శ్రీ కృష్ణదేవరాయల సాంఘిక అభిప్రాయములు సుజాత నవంబర్ 1927

16. గ్రీకు పురాణదేవతలు-1 ,, నవంబర్ 1950
17. గ్రీకు పురాణదేవతలు-2 ,, డిసెంబర్ 1950
18. గ్రీకు పురాణదేవతలు-3 ,, మార్చి 1951
19. గ్రీకు పురాణ దేవతలు -4 ,, ఏప్రిల్ 1951
20. గ్రీకు పురాణ దేవతలు-5 ,, మే 1951
21 గ్రీకు పురాణ దేవతలు-6 ,, జులై 1951
22. ఆంధ్రప్రదేశ్ రాజధాని హైదరాబాద్ నగరము
తెలుగుదేశం 1-11-1956

అచ్చైనవో లేదో తెలియదు గాని ఆదిరాజువారి వ్రాతలో వారింట లభించిన కొన్ని రచనల గూర్చి మనవి చేస్తాను.

1. ఆముక్తమాల్యదలోని విశేషాలు (ఆదర్శము):- ఇది నలభై పుటల వ్యాసం. దీనిపై 20-2-1916 తేది కలదు. ఈవ్యాసం చివరన ఆముక్తమాల్యదలోని చతుర్థాశ్వాసాంతపద్యాన్ని చివర చరణం మార్పుతో ఇట్లా వ్రాసిపెట్టినారు.
"ఇది సింహాచల దంభకేసరి పదాభీష్టార్చనా పుణ్యల
బ్ధదురుట్టంకణ పొట్టునూరి విజయ స్తంభోపలోట్టంకితాం
క దృఢాష్టాక్షర కృష్ణరాయధరణీ కాంతకృతాముక్త మా
ల్యద యాదర్శము వీరభద్రునిది హృద్యంబై మహిం బొల్పగున్
2. గేయ సాహిత్య సంపద అనే శీర్షికతో ముప్ఫయి పుటల వ్యాసం.
3. నిజాం రాష్ట్రాంధ్ర సారస్వత ప్రదర్శనము-ఓరుగల్లు; పండిత ఆదిరాజు వీరభద్రరావుగారి ప్రారంభోపన్యాసము-ఎనిమిది పుటలు
4. రాణీ అ (న) సూయ—ఎనిమిది పుటలు
5. బాలశిక్ష:— చిన్నయ్య-చిక్కుడు తీగ (కథ)-రెండు పుటలు
6. M. G. రానడే జీవిత చరిత్ర-ఐదు పుటలు
7. ఒక విదేశీయ కథ. ఇది ఒక నోటుబుక్కు నిండా ఉంది. 21-4-1919 నాడు ప్రారంభించినారు. 1565 నాటి New borough అనే స్కాట్లాండ్ రేవు పట్టణంలో జరిగిన కథ.
8. పరోపకారము (కథ) :— ఇది బాలభటులకోసం వ్రాసిన కథ. పంతులుగారు స్కౌట్ మాస్టరుగా ఉండేవారు. కనుక బాలభటులకు అవసరమైన ప్రథమచికిత్స మొదలైన విషయాలు పొందుపరుస్తూ వ్రాసిన నీతికథ యిది. ఇందులో శంకరయ్య అనే పేద విద్యార్థి సీత అనే అమ్మాయిని పిచ్చికుక్క బారినుండి కాపాడుతాడు. ఊరిలో అగ్ని ప్రమాదం సంభవిస్తే అదనుకు వచ్చి

అందరినీ మేలుకొల్పి ఆదుకుంటాడు. చివరకు సీతతో శంకరయ్యకు వివాహం జరుగుతుంది వీరభద్రరావుగారు "శంకరునివంటి పురుషుడు పంకజముఖి సీతవంటి పడతులు గలరే" అని కథ ముగించినారు.

9. 31-1-1942 నాడు జరిగిన "శ్రీ కృష్ణదేవరాయాంధ్ర భాషానిలయపు భువనవిజయ సప్తాహము" అధ్యక్షభాషణం. ఈ అధ్యక్ష భాషణం చేసింది రాజా నాయని వెంకట రంగారావుగారు. పంతులుగారు రాజా గారికి ఈ ఉపన్యాసం వ్రాసిపెట్టినట్లున్నారు—ఎనిమిది పుటలు.

10. ఆంధ్రుల నాగరికత—26 పుటల వ్యాసం. పంతులుగారు 26—2—(19?) నాడు ఖమ్మంలో చేసిన ఉపన్యాసం.

11. సౌగంధి (కథ)—30 పుటలు.

12. కీ. శే. కొ. ల. పంతులు. ఎంఏ—17 పుటలు.

13. 'విస్మృపము':-బహుశః ఇది శ్రీ ఖండవల్లి బాలేందు శేఖరంగారి 'విస్మృత సామ్రాజ్యములు' అనే గ్రంథానికి పీఠిక కావచ్చు. 6 పుటలు. చిట్ట చివరన 'జై ఆంధ్ర' అని కలదు.

14. ఆంధ్రులారా! మేల్కొనండి. ఇది అచ్చైన కరపత్రం. శ్రీ బొజ్జం నర్సింలుగారు చాదర్ఘాట్ నియోజకవర్గంనుండి M. L. A. గా పోటీ చేసినప్పుడు కాంగ్రెసుకు వ్యతిరేకంగా శ్రీ బొజ్జం నర్సింలుగారిని గెలిపించవలసిందిగా ఆదిరాజువారు శ్రీ కృష్ణదేవరాయాంధ్ర భాషానిలయం కార్యదర్శిగా ప్రకటించిన కరపత్రం. దీనిపై నర్సింలుగారి ఎన్నికలగుర్తు రైలు ఇంజను బొమ్మ ఉంది. కాంగ్రెసువారు హైదరాబాదు నగరంలో ఆంధ్రేతరులకే ఎక్కువసీట్లు కేటాయించినందున, ఆంధ్రాభిమానంతో పంతులుగారు ఈ పని చేసినట్లున్నారు.

వీరభద్రరావుగారు దాదాపు నూటయాభై రేడియో ప్రసంగాలు చేసినారు. దక్కన్ రేడియోలో తెలుగు విభాగం ఆరంభించినప్పుడు వారితో తొలి ప్రసంగ చేయించింది కీ. శే. భాస్కరభట్ల కృష్ణరావుగారు. పంతులుగారు తమరేడియో ప్రసంగాల ప్రతులన్నీ దాచిపెట్టి ఒకసారి నాకు చూపినారు. ప్రసంగాల శీర్షికలు తేదీలవారిగా వారే ఒకచోట వ్రాసిపెట్టుకొన్నారు. ఏయే ప్రసంగానికి రేడియో వారెంత పైకం ఇచ్చింది కూడ ఆ పట్టికలో ఉంది. కొన్ని ప్రసంగాలు వివిధ పత్రికల్లో అచ్చైనవి కూడ. ఈ ప్రసంగాలు మనచరిత్ర, సంస్కృతి, సాహిత్యం, స్థలవిశేషాలు, చిత్రశిల్ప కళావిశేషాలు, తటాకాలు, నిర్మాణాలు మొదలైనవాటికి సంబంధించినవి. ఇందులో చాలా ప్రసంగాలు బరువైనవి, విషయబాహుళ్యం గలవి. పది రూపాయల రేడియో ప్రసంగంకోసం హైదరా

బాదు సికింద్రాబాదు లైబ్రరీలన్నీ గాలిస్తూ వాళ్ళిచ్చిన పైకంకంటె ఒక్కోసారి ఎక్కువే ఖర్చుపెట్టి పుస్తకాలు సంపాదించి రేడియో ప్రసంగం వ్రాసేవారు. వారికి కవలసిన పుస్తకం ఈ పట్టణంలో లభించకపోతే కొని తెప్పించుకొని రేడియో ప్రసంగం వ్రాసేవారే కాని ఎట్లాగూ ఆకాశవాణి కదా అని ఏదో గాలి మూట కట్టేవారు కాదు. ఇందులో మొదటి 44 ప్రసంగాలు నిజాముల కాలపు దక్కన్ రేడియోకు సంబంధించినవి. 45 నుండి 103 వరకున్న ప్రసంగాలు పాత హైద్రాబాదు రాష్ట్రం ఆలిండియా రేడియోకు సంబంధించినవి. అటు తరు వాతివి ఆంధ్రప్రదేశ్ అవతరించిన తరువాతి ఆలిండియా రేడియోకు సంబంధిం చినవి. రేడియో ప్రసంగాలు, వాటి తేదీలు, వారి ముద్రితాముద్రిత రచనల గూర్చి నిశితంగా పరిశీలించవలసిన అవసరం చాలా ఉంది.

| | | | |
|---|---|---|---|
| 1. | చారిత్రక సాధనములు | రూ. 10/- | 8-9-1943 |
| 2. | ఆర్షశాఖవారి-ఆంధ్రచరిత్ర కృషి | 10/- | 15-4-1944 |
| 3. | ఆర్షశాఖవారి-శాసన పరిశోధన కృషి | 10/- | 3-6-1944 |
| 4. | ఆర్షశాఖవారి—ఆంధ్ర నాణెములు | 10/- | 23-12-1944 |
| 5. | శాతవాహన, పల్లవ, చాళుక్యవంశములు | 10/- | 21-4-1945 |
| 6. | కాకతీయ రాజవంశము | 10/- | 26-6-1945 |
| 7. | విజయనగర రాజ్యస్థాపనము | 10/- | 7-8-1945 |
| 8. | కొండాపురము | 10/- | 18-12-1945 |
| 9 | ప్రతిష్ఠానము | 10/- | 2-2-1946 |
| 10. | రాచకొండ | 10/- | 11-6-1946 |
| 11. | కొండవీడు | 10/- | 23-7-1946 |
| 12. | కల్యాణి | 10/- | 16-11-1946 |
| 13. | ఆనెగొంది | 10/- | 18-2-1947 |
| 14. | గోలకొండ | 10/- | 27-5-1947 |
| 15. | భోనగిరి | 10/- | 9-8-1947 |
| 16. | కొలనుపాక | 10/- | 30-9-1947 |
| 17. | వేల్పుగొండ | 10/- | 5-10-1947 |
| 18. | ఆలంపురము | 12/- | 11-11-1947 |
| 19. | కెయిరనులు | 12/- | 11-12-1947 |

| | | | |
|---|---|---|---|
| 20. | నిజాంరాష్ట్రము | రూ. 12/- | 16-1-1948 |
| 21. | తెలంగాణము | 12/- | 17-1-1948 |
| 22. | గద్వాల సంస్థానము | 12/- | 19-2-1948 |
| 23. | పాల్వంచ సంస్థానము | 12/- | 20-2-1948 |
| 24. | వరంగల్లు జిల్లా | 12/- | 23-2-1948 |
| 25. | గుల్బర్గాజిల్లా | 12/- | 4-5-1948 |
| 26. | గుల్బర్గా సుల్తానులు | 12/- | 22-5-1948 |
| 27. | అవురంగాబాదు నగరము | 12/- | 24-5-1948 |
| 28. | స్వతంత్ర హైదరాబాదు | 15/- | 12-6-1948 |
| 29. | మహబూబునగరు జిల్లా | 12/- | 19-6-1948 |
| 30. | నల్లగొండ జిల్లా | 12/- | 29-6-1948 |
| 31. | మెదకుజిల్లా | 15/- | 3-7-1948 |
| 32. | ఎల్లోరా | 15/- | 15-1-1949 |
| 33. | దీనజనోద్ధారక గాంధీ | 20/- | 30-1-1949 |
| 34. | హంపీ క్షేత్రము | 15/- | 12-3-1949 |
| 35. | పల్లెపదాలు I | 15/- | 19-7-1949 |
| 36 | పటన్‌చెరువు, మైసరం, షాహపురం | 15/- | 22-8-1949 |
| 37. | కరీంనగరుజిల్లా | 15/- | 5-9-1949 |
| 38. | పల్లెపదాలు II | 15/- | 19-9-1949 |
| 39. | ఆమనగల్లు, మక్తల, ఉజ్జలి | 15/- | 30-9-1949 |
| 40. | హైదరాబాదుజిల్లా | 15/- | 3-10-1949 |
| 41. | కొండాపురము II | 20/- | 8-11-1949 |
| 42. | భోనగిరి II | 20/- | 22-11-1949 |
| 43. | మైసూరునగరము. | 25/- | 9-12-1949 |
| 44. | అలంపురము II (Deccan Radio closed) | 20/- | 23-12-1949 |
| 45. | అజంత (All India Radio Series) | 25/- | 2-4-1950 |
| 46. | బుఱ్ఱకథలు | 15/- | 22-4-1950 |
| 47. | యక్షగానములు | 15/- | 9-5-1950 |
| 48. | గోలకొండ II | 25/- | 30-5-1950 |

| | | | |
|---|---|---|---|
| 49. | చాణక్యుడు | 10/- | 2-7-1950 |
| 50. | అజంతా—ఎల్లోరా | 15/- | 14-8-1950 |
| 51. | సర్దారు పాపారాయడు | 15/- | 26-12-1950 |
| 52. | గుఱ్ఱం గుడ్డిదే కాని దాణాకు లోటు లేదు | 15/- | 4-2-1951 |
| 53. | ఆలంపురక్షేత్రము III | 15/- | 15-4-1951 |
| 54. | చెఱువులు | 15/- | 17-5-1951 |
| 55. | మన రాష్ట్రచరిత్ర గాథ | 15/- | 23-7-1951 |
| 56. | గోలకొండ III | 15/- | 6-8-1951 |
| 57. | పైఠను చేతిపనులు | 15/- | 21-9-1951 |
| 58. | నేపాలు-టిబెట్టు కళావ్యాప్తి | 15/- | 4-12-1951 |
| 59. | ఇటలీ ప్రజలు-ఆచారాలు | 15/- | 29-12-1951 |
| 60. | ధంసా | 25/- | 15-1-1952 |
| 61. | గ్రీకు పురాణగాథలు (ఇతరులచే చదివించినది) | 11-4-0 | 31-1-1952 |
| 62. | షితాబుఖాను | 25/- | 11-3-1952 |
| 63. | కోహినూరు వజ్రము | 15/- | 12-6-1952 |
| 64. | ప్రజాకవులు—పాలకురికి సోమన | 15/- | 8-7-1952 |
| 65. | జానపదగీతాలలో సాంఘికాచారములు | 20/- | 13-8-1952 |
| 66. | రాణా ప్రతాపసింహుడు | 15/- | 19-10-1952 |
| 67. | తాటియాకు గ్రంథాలు | 25/- | 20-12-1952 |
| 68. | తోలుబొమ్మలాట | 25/- | 24-1-1953 |
| 69. | కొప్పులు-జడలు-అజంతాస్త్రీలు | 20/- | 11-2-1953 |
| 70. | పుష్కరాలు | 15/- | 19-3-1953 |
| 71. | జానపద గీతాలలో చరిత్ర | 20/- | 29-4-1953 |
| 72. | వింత మృగజాలము-గ్రీకు | 15/- | 4-6-1953 |
| 73. | శివాజీ-వంశస్థాపకులు | 15/- | 17-6-1953 |
| 74. | మధుకైటభులు | 15/- | 25-7-1953 |
| 75. | రెండు నగరాల మనుగడ-గోలకొండ పట్టణము | 25/- | 12-9-1953 |
| 76. | బాటసారి సౌకర్యములు—చలివేంద్రలు, సత్రాలు | 15/- | 12-10-1953 |
| 77. | ప్రాచీనకదన పాండితి-ఆయుధాలు, సరఫరా, ఇతర సమస్యలు | 25/- | 6-11-1953 |

| | | |
|---|---|---|
| 78. ఇది హైదరాబాదు—కొత్తది-పాతది | 25/- | 4-12-1953 |
| 79 ఎంతో మంచిది-కృతజ్ఞత | 15/- | 21-2-1954 |
| 80. పాకాలచెరువు | 25/- | 2-4-1954 |
| 81. గోలకొండ | 15/- | 6-5-1954 |
| 82. బీదరు | 15/- | 3-6-1954 |
| 83. హైదరాబాదు చరిత్ర | 25/- | 29-6-1954 |
| 84. Story of excavation at Kondapur | 20/- | 29-7-1954 |
| 85. తెలంగాణము | 20/- | 13-8-1954 |
| 86. ఇది హైదరాబాదు-తాలుకాలు, జిల్లాలు, పట్టణాలు | 15/- | 5-9-1954 |
| 87. Estimate of Gandhi | - | 2-10-1954 |
| 88. మా జిల్లా-హైదరాబాదుజిల్లా గాథలు, చరిత్ర | 15/- | 16-10-1954 |
| 89. పల్నాటివీరచరిత్ర, కాటమరాజుకథ, బొబ్బిలికథ, బాలనాగమ్మకథ | 10/- | 3-12-1954 |
| 90. తెలంగాణములోని దేవాలయాలు | 15/- | 18-2-1955 |
| 91. గ్రామస్థుల ఉగాది | 15/- | 25-3-1955 |
| 92. సు. ప్రతాపరెడ్డిగారి ఆంధ్రుల సాంఘిక చరిత్ర సమీక్ష | 25-/ | 11-4-1955 |
| 93. కాకతీయుల సాంఘిక చరిత్ర | 15/- | 26-4-1955 |
| 94. నల్లగొండజిల్లా కథ | 25/- | 5-6-1955 |
| 95. వాఙ్మయములో చరిత్రసామగ్రి | 20/- | 30-9-1955 |
| 96. రాణీ తారాబాయి | 10/- | 30-3-1956 |
| 97. గోలకొండ | 15/- | 15-4-1956 |
| 98. ఆలంపుర దేవాలయాలు | 15/- | 7-5-1956 |
| 99. ఆంధ్రసీమలో బౌద్ధమతవ్యాప్తి | 25/- | 22-5-1956 |
| 100. ఉమా మహేశ్వరము | 15/- | 18-6-1956 |
| 101. సాహిత్యము-దేశచరిత్ర | 25/- | 19-8-1956 |
| 102. ఆంధ్రులపై ముస్లిం ప్రభావం | 25/- | 6-9-1956 |
| 103. యాదగిరి | 15/- | 17-9-1956 |
| 104. అవశేషాలు | 20/- | 29-12-1956 |
| 105. కర్ణుని స్వార్థత్యాగము | 15/- | 17-2-1957 |

| | | | |
|---|---|---|---|
| 106. | మహావీర జయంతి | 15/- | 12-4-1957 |
| 107. | బుద్ధుని అష్టాంగమార్గము | 15/- | 13-5-1957 |
| 108. | జాతీయ అంతర్జాతీయత | 15/- | 20-6-1957 |
| 109. | రామప్ప | 25/- | 2-9-1957 |
| 110. | తెలంగాణములోని చరిత్ర ప్రదేశాలు (వాడపల్లి, మెదకు, ఫణిగిరి, కొయ్యలకొండ) | 10/- | 11-12-1957 |
| 111. | వేములవాడ తిరునాళ్ళు | 12/- | 2-5-1959 |
| 112. | కొండాపురము | 20/- | 15-10-1959 |
| 113. | శాతవాహనులు జయప్రదులైనచో | 20/- | 21-1-1960 |
| 114. | ఆర్యుల నాగరకత | 15/- | 22-3-1960 |
| 115. | ఉర్దూకవులు | 20/- | 21-5-1960 |
| 116. | తెలుగుదేశంలో ఊళ్ళపేర్లు | 20/- | 16-6-1960 |
| 117. | కుతుబ్షాహీల కాలంలో తెలుగుసాహిత్యం | 20/- | 17-10-1960 |
| 118. | ఆలంపుర క్షేత్రము | 15/- | 5-12-1960 |
| 119. | జానపదగేయాలలో ప్రకృతి చిత్రణ | 20/- | 26-12-1960 |
| 120. | కొమర్రాజు చరణసన్నిధిని | 20/- | 29-5-1961 |
| 121. | యాత్రాస్థలాలు-వేములవాడ | 15/- | 31-7-1961 |
| 122. | ఆంధ్రలో దర్శనీయస్థలాలు | 20/- | 18-9-1961 |
| 123. | ఆర్యుల నాగరకత | 20/- | 6-3-1962 |
| 124. | కొమర్రాజు లక్ష్మణరావు | 20/- | 27-6-1962 |
| 125. | శేషాద్రిరమణకవులు—వారి భాషాసేవ | | 9-1-1962 |
| 126. | ఆంధ్రచరిత్ర చతురానన చిలుకూరి వీరభద్ర రావుగారి చరిత్ర కృషి | 20/- | 8-9-1962 |
| 127. | మల్లంపల్లి సోమశేఖరశర్మ | | 7-1-1963 |
| 128. | మేము చదువుకొన్న రోజులు | 25/- | 13-11-1963 |
| 129. | ప్రాచీన భారతములో గ్రామపంచాయతి | 25/- | 4-6-1964 |
| 130. | ఆంధ్రలో దర్శనీయ ప్రదేశాలు | 25/- | 14-11-1964 |
| 131. | కొలనుపాక | 25/- | 2-2-1965 |
| 132. | ఏలేశ్వరము | | 5-3-1965 |
| 133. | ఆంధ్రవాఙ్మయము-ఆంధ్రచరిత్రము | | 13-3-1967 |

పై పట్టికలో చివరి నాలుగైదు నేను చూచి చేర్చినవే. 1964 నుండి వీరభద్రరావుగారు తమ రేడియో ప్రసంగాల వివరాలు వ్రాసిపెట్టుకున్నట్లు లేదు. వారింకొక ఏడాదికి కీర్తిశేషులౌతారనగా కూడ రేడియో ప్రసంగం చేసినారు. కనుక పై పట్టికలో చేరనివి ఇంకొక ఇరవై ఉండవచ్చు. ఈ రేడియో ప్రసంగాలలో కొన్నింటినైనా ఎంపికచేసి ప్రత్యేక వ్యాస సంపుటంగా ప్రకటించవచ్చు. ఆదిరాజు వీరభద్రరావుగారి రచనలనుగూర్చి ఇది స్వల్ప పరిచయం మాత్రమే. పాత పత్రికల సంపుటాలన్నీ తిరగవేస్తే ఇంకా ఎన్నో వ్యాసాలు లభిస్తవి. వారి రచనలగూర్చి ఎం. లిట్ కో పి. ఎచ్. డికో థీసిస్ వ్రాయదగినంత అవకాశం ఉన్నది.

ప్రాతస్స్మరణీయులైన ఆదిరాజు వీరభద్రరావుగారిగూర్చి ఈ ప్రసంగం చేసే అవకాశం నాకు కలిగించిన సాహిత్య ఆకాడమీ వారికి కృతజ్ఞుడను.

——

# డాక్టర్ మాడపాటి హనుమంతరావుగారి జీవితము

- ఇల్లిందల సరస్వతీదేవి

స్వాతంత్ర్యానికి పూర్వము భారతదేశమంటే మహాత్మా గాంధీ, రవీంద్ర నాథ టాగూరు, రాధాకృష్ణ పండితుడు, పండిత జవహర్‌లాల్ నెహ్రూలు ఉండే దేశమని విదేశీయులు గుర్తు పెట్టుకునే వారు.

తెలంగాణాను గురించి చెప్పవలసివస్తే - మాడపాటి హనుమంతరావు పంతులుగారు, రాజా బహద్దరు వెంకట్రామారెడ్డిగారు, సురవరం ప్రతాపరెడ్డి గారు ఉన్న ప్రాంతమని చెప్పాలి.

మహాత్మాగాంధీ సౌత్ ఆఫ్రికాలో తెల్లవారిచేత అవమానింపబడి - ఆ అవమానం తన ఒక్కడిదీ కాదు - తన దేశానిదిగా భావించి, తనజాతి గౌరవాన్ని నిలబెట్టటానికి తన జీవిత కాలాన్ని వెచ్చించి విజయం పొందాడు. అలాగే హనుమంతరావుగారు తమకొక బహిరంగసభలో జరిగిన అవమానాన్ని ఆంధ్రభాషకు జరిగినట్టుగా భావించి తన జీవితకాలాన్ని ఆంధ్ర భాషోద్యమానికి ధారపోసి కృతకృత్యులయ్యారు. ఉద్యమాలు నడపటంలో అకుంఠిత మైన దీక్ష, పట్టుదల-నిదానంగా అయినా గట్టిపని జరగాలని ఆకాంక్ష - ప్రజాధనాన్ని వినియోగించటంలో నిజాయితీ - అతివాదులపట్ల ఉదాసీనం - తన నెవరైనా ఆక్షేపణ చేస్తే వెంటనే తగిన జవాబు సౌమ్యంగా వాళ్ల మనసుకు నచ్చేటట్లుగా పత్రికా ముఖంగా ఇవ్వటం వంటి మహాత్ముడి లక్షణాలు హనుమంతరావుగారి వద్ద నూటికి నూరుపాళ్లు ఉన్నాయి.

మహాత్ముడు బ్రిటిషువారిని ఎదుర్కొని సత్యాహింసలతో తన ఉద్యమాన్ని నడిపి దేశాన్ని దాస్య శంఖలాలనుండి విముక్తను చేశాడు. హనుమంతరావుగారు నిరంకుశులయిన నిజాం ప్రభుత్వాన్ని ఎదుర్కొని తాబేటినడకతో ఉద్యమాన్ని నడిపి ఆంధ్రభాషను దాస్య విముక్తను చేశాడు.

మహాత్ముడి పేరు జాతిపితగా అజరామరంగా నిలుస్తుంది.

హనుమంతరావుగారి పేరు ఆంధ్ర పితామహుడిగా అజరామరంగా నిలుస్తుంది.

రావుగారు అతిసామాన్య కుటుంబంలో సామాన్యుడిగా 1871లో కృష్ణా జిల్లా నందిగామ తాలుకా పొక్కునూరు గ్రామంలో వేంకటప్పయ్య వేంకట సుబ్బమ్మగార్లకు జన్మించిన రెండవ కుమారుడు. తండ్రిని ఐదవ ఏటనే పోగొట్టుకుని, తల్లీ అన్నలతో సూర్యాపేటలో ఉన్న మేనమామ జమలాపురం వేంకటరావుగారి వద్ద ఉండి విద్యనార్జించారు. మేనమామ ప్రభుత్వోద్యోగి కావటంచేత వారు ఏ ఊరికి వెళ్ళితే ఆ ఊళ్లో చదువు సాగించవలసి వచ్చింది. ఇబ్రహీంపట్నం, జడిచర్ల గ్రామాల్లో విద్యా సౌకర్యాలు లేకపోవుటంచేత రెండవ మేనమామ అయిన రామచంద్రరావుగారి వద్దకు నల్లగొండ వెళ్లవలసి వచ్చింది. అప్పటికి రావుగారికి సుమారు పది సంవత్సరాల వయసు.

నల్లగొండ పాఠశాలలో రావుగారు ఉరుదూ మిడిల్ పరీక్ష ప్యాసయినారు. ఆ కాలానికి ఆ చదువు చాలా గొప్పది. పై చదువులు చదవాలంటే ఆంగ్లభాష అవసరం. కనుక అప్పుడు, అంటే 1900 A.D. లో, ఆంగ్లభాషను అభ్యసించి ఇంగ్లీష్‌మిడిల్ పరీక్ష ప్యాసయ్యారు. ఆ తరువాత - హనుమకొండలోని ఉన్నత పాఠశాలలో ప్రవేశించి ప్రిమెట్రిక్, మెట్రిక్ పరీక్షలలో ఉత్తీర్ణులయ్యారు. ఆకాలములో రావుగారికి నిజాం ప్రభుత్వమునుండి నెలకు ఐదు రూపాయల వంతున విద్యార్థి వేతనము లభించేది. వారు మిడిల్ పరీక్ష చదువుతూనే పారశీకభాష కూడా అభ్యసించారు. మెట్రిక్ ప్యాసయ్యేటప్పటికి వారికి ఉరుదూ, ఫార్సీ, ఇంగ్లీషు, తెలుగు-ఈ నాలుగు భాషలలో మంచి పరిజ్ఞానం అలవడ్డది. ఆ వయసులో ఉన్న విద్యార్థుల మాదిరిగా కాక—బహుగ్రంథ పఠనం చేసి జనరల్ నాలెడ్జిని అభివృద్ధి చేసుకున్నారు.

అతి సామాన్య కుటుంబంలో జన్మించి ఐదవ ఏటనే పితృహీనులైన రావుగారికి చదువు పూర్తిచేసిన వెంటనే ఉద్యోగంచేసి ధన మార్జించ వలసిన అవసరం కలిగింది. 1904లో విద్యాశాఖలో 40 రూపాయల వేతనంగల ఉద్యోగంలో ప్రవేశించారు. ఎనిమిది సంవత్సరాల తరువాత దానిని వదిలిపెట్టి హైదరాబాదు నగరానికి వచ్చి లా క్లాసులలో చేరారు.

హనుమకొండలో రావుగారున్నప్పుడు, 1904లో, హైదరాబాదునుండి మునగాల రాజాగారైన శ్రీ నాయని వేంకట రంగారావుగారు మరో ఇద్దరితో

వచ్చి, రాజరాజనరేంద్ర ఆంధ్ర భాషా నిలయాన్ని స్థాపించారు. రావుగారు ఆ గ్రంథాలయములో ఉన్న గ్రంథాలను చదవటమేకాకా హైదరాబాదునుండి వచ్చే వారితో, 1901లో స్థాపితమయిన శ్రీకృష్ణదేవరాయ ఆంధ్రభాషానిలయము నుండి పత్రికలు తెప్పించుకుని చదివేవారు. ఆ నిలయపు కార్యక్రమాలనూ వాటి వివరాలనూ గురించి తెలుసుకుని ఉత్సాహవంతులైయేవారు.

హైదరాబాదునగరంలో లా చదివి 50 రూపాయల ఉద్యోగంలో మూడు నెలలు పనిచేసిన తరువాత, దానిని వదలిపెట్టి, నిజాంరాష్ట్రంలో శాసననిర్మాణ శాఖలో ఇంగ్లీషు, ఉరుదూ, తెలుగుభాషల్లో ప్రవీణుడయిన అనువాదకుడు కావలె నన్న ప్రకటనకు దరఖాస్తుపెట్టిన వారిలో రావుగారొకరు. గ్రాజ్యుయేట్లను వదలి రావుగారిని ప్రభుత్వము ఎన్నిక చేసింది. ఆ కాలంలో అది నూరురూపాయల జీతంగల ఉద్యోగము. దానిలో ఐదుసంవత్సరాలు పనిచేశారు.

స్వతంత్రంగా జీవించ గలిగినదీ, ప్రజాహిత కార్యాలలో పాల్గొనటానికి వీలయినదీ వకీలువృత్తి. 1917లో లా ప్యాసయి ఆ ఉద్యోగాన్ని వదలుకున్నారు. రాయ్ విశ్వేశ్వరనాథ్‌గారివద్ద జూనియరుగా చేరి సంవత్సరం తరువాత-స్వతంత్రంగా ప్రాక్టీసు చేశారు. కక్షిదారులను కూర్చోబెట్టుకుని ప్రాపంచిక జ్ఞానం - రాష్ట్రంలోని విద్యా, వ్యావసాయక, వాణిజ్య, సాంఘిక పరిస్థితులను ముందు బోధించి - తరువాతనే వాళ్లు చెప్పే వ్యాజ్యాలను గురించిన వివరాలు వినేవారు.

న్యాయవాదికి న్యాయశాస్త్రమేకాకుండా యుక్తి ప్రయుక్తులు, వాదకౌశల్యమూ, సమయస్ఫూర్తీ, తార్కిక విజ్ఞానమూ, ప్రపంచానుభవము, నిర్భీతి మొదలైన శక్తులు ఉంటేనేగాని వారు రాణించరు. రావుగారు వీటన్నిటినీ చేజిక్కించుకుని, చిన్నలకు ఆదర్శప్రాయంగానూ పెద్దవాళ్ళకు గౌరవనీయంగానూ మెలగటం అలవరచుకున్నారు.

మెట్రిక్యులేషను ప్యాసయి లా చదువుకున్న న్యాయవాదికి B.A,B.L.; M.A.B.L. చదివిన న్యాయవాదులతో సమానంగా తిరగటం సామాన్యమైన పని కాదు. రావుగారిని న్యాయవాదులే కాకుండా న్యాయమూర్తులుకూడా గౌరవించేవారు. పోలీసు రెవిన్యూశాఖలమంత్రి టాస్కరుగారికి రావుగారిపట్ల అమితమైన గౌరవభావం ఉండేది. తీరికవేళల్లో రావుగారిని పిలిచి అన్ని విషయాలను గురించీ అడిగి తెలుసుకునేవారు.

ఒక పర్యాయము రావుగారెంత ప్రజ్ఞతో వాదించినా ఆ కేసు గెలవలేదు. విచారంతో క్రుంగిపోయిన రావుగారి ముఖం చూసి న్యాయమూర్తి అయిన అక్బర్ యార్ జంగు వారిని తన చేంబర్‌కు పిలిచి "మీరు చాలా బాగా వాదించారు. కాని కేసు గెలవటానికి అదొక్కటే చాలదు. ధర్మసూక్ష్మాలనుకూడా తెలుసుకొని ఉండాలి" అని ధైర్యం చెప్పారు. ఆ సూచన రావుగారి జీవితంలో చాలా ఉపయోగపడ్డది. అప్పటికి రావుగారికి సుమారు 600 రూపాయలు వచ్చే ప్రాక్టీసు ఉన్నది. ఆ వృత్తిలోనే ఉంటే వేలకువేలు సంపాదించి ఉండేవారేమో! కాని - 1941లో ఆ వృత్తి వదలుకున్నారు.

రావుగారు హనుమకొండలో ఉండగా రాజరాజనరేంద్ర భాషానిలయంలో కందుకూరి వీరేశలింగంగారి రచనలు పది సంపుటాలూ బాగా చదివిన తరువాత వారి హృదయం సంఘసంస్కరణలపట్ల ఉరకలు వేయసాగింది. కందుకూరి సందేశాలు రావుగారి హృదయంలో హత్తుకుపోయాయి. ఏకేశ్వరోపాసన, వర్ణవ్యవస్థ, వితంతూద్వాహాలు, ప్రౌఢవివాహాలు, వర్ణాంతర వివాహాలూ, సర్వమానవ సోదరభావము, వేశ్యానిగర్హణ, సంఘ దురాచారాలు, సంఘీభావము, మతసహనము-మొదలైన వాటిమీద కందుకూరి చేసిన విమర్శలు రావుగారి హృదయంమీద చెరగని ముద్రలు వేశాయి. హనుమకొండలోని యువకులు కొందరు ప్రఖ్యాతి గాంచిన నాయకుల పేర్లు పెట్టుకుని చర్చలు చేస్తూ ఉండేవారు. ఆయువకులు రావుగారికి గోఖలే అని పేరు పెట్టారు. ఆ పేరున పిలువబడే రావుగారు ఆయన అడుగుజాడలలో నడవటానికి సంకల్పించుకున్నారు.

రావుగారు హైదరాబాదు వచ్చిన తరువాత నిజాంరాష్ట్రంలోని అరవై లక్షలమంది ప్రజలలో అవిద్యా, అజ్ఞానం తాండవిస్తున్నవని గ్రహించారు. ఇతర ప్రాంతాలలోని, ఆంధ్రుల పరిస్థితిని నిజాంరాష్ట్రంలోని ఆంధ్రుల పరిస్థితినీ పోల్చిచూస్తే తమది మరీ అధ్వాన్నంగా ఉన్నదని తెలుసుకున్నారు. నిజాం రాష్ట్రంలో ఉన్న మహారాష్ట్ర కర్నాటకులకంటె కూడా అధమస్థితిలో ఉన్నదని గ్రహించారు. రావుగారికి విచారం పొంగి పొరలిపోయింది. రాష్ట్రానికి కంతటికీ ఒక్కటే ఇంగ్లీషు హైస్కూలు. తెలంగాణావాసుల విద్యాదారిద్ర్యము భరించరానిదిగా ఉండేది. ప్రజలలో విద్యాభివృద్ధికి సహకారం చేసేవారు లేరు. పత్రికా ప్రచారము పత్రికాపఠనేచ్ఛ ప్రజలలో మృగ్యము. దేశభాషమీద అభిమానం ప్రజలకూ లేదు-ప్రభుత్వానికంతకంటె లేదు. ఆంధ్రులుకూడా రాజభాషయైన

ఉరుదూలోనే ఇండ్లల్లో సంభాషణలు సాగించేవారు. కొందరు ఉరుదూభాషలో తెలుగు కలిపి మాట్లాడేవారు. ఆదిపూడి సోమనాథరావుగారొక పర్యాయము "ఒకప్పుడు అత్యంత వైభవంతో అలరారిన తెలుగుభాష ఇక్కడ చాలా దుస్థితిలో ఉన్న''దని శ్రీ కృష్ణదేవరాయల ఆంధ్రభాషానిలయంలో సోదాహరణంగా ఉపన్యసించారు. దానితో రావుగారి మనసు కలవరపడ్డది.

తెలంగాణావాసులు మానసిక, శారీరక పుష్టిలేక అభివృద్ధి మార్గాలు లేక-ధార్మిక, సామాజిక, పారిశ్రామిక, రాజకీయాదులు తెలియక, అజ్ఞానాంధకారంలో ఉన్నారు. ఒక మాటలో చెప్పాలంటే ప్రజలు నిద్రాముద్రితులై ఉన్నారు. ఈ దౌర్భాగ్యపు పరిస్థితులు రావుగారిని చింతాక్రాంతులను చేశాయి.

ఆంధ్రుల పూర్వచారిత్రక వైభవమూ – దానిపట్ల గౌరవమూ, భావి భాగ్యోదయమూ-దానిపట్ల విశ్వాసమూ తెలుగువారి హృదయ క్షేత్రాలలో అంకురించికపోతే భావిసంతానము గతేమిటన్న ప్రశ్న రావుగారిని వేధించసాగింది.

ప్రపంచంలోని ప్రజోద్యమాలన్నీ సామాన్య ప్రజలే నిర్వహించారన్న విషయము దేశచరిత్రలన్నీ చదివి అవగాహన చేసుకున్న రావుగారికి కర్తవ్యము గోచరించింది. రావుగారికి చెప్పుకోతగినంత పాండిత్యంగాని-పలుకుబడిగాని-భాగ్యంగానిలేవు. ఈ లోపాలేవీ వారు తీసుకున్న పథకాలను అమలుపరచటానికి అవరోధాలు కావని తెలుసుకున్నారు, అచంచలమైన నిశ్చయంతో-అనుపమానమైన త్యాగదీక్షతో కార్యరంగంలోకి దూకారు.

పూర్వ వైభవాన్నీ, వర్తమాన సాంఘిక ఆర్థిక పరిస్థితులనూ ప్రజలకు తెలియజేయాలంటే గ్రంథాలయ మొక్కటే సాధనము. అది కలిగించే విజ్ఞానాన్ని-అది ప్రబోధించే కర్తవ్యాన్ని వెయ్యిమంది పండితులైనా చెయ్యలేరన్నది కఠోర సత్యము. ఈ ధర్మ రహస్యాన్ని అనుసరించే హైదరాబాదు నగరంలో శ్రీ కృష్ణదేవరాయాంధ్ర భాషానిలయమూ, హనుమకొండలో రాజరాజ నరేంద్ర ఆంధ్రభాషా నిలయమూ నెలకొల్పబడ్డాయి. రావుగారికి హనుమకొండ భాషా నిలయంలో పనిచేసిన అనుభవం కొంత ఉన్నది.

అప్పుడు శ్రీ కృష్ణదేవరాయాంధ్ర భాషానిలయము నాలుగున్నర రూపాయలకు తీసుకున్న ఒక చిన్న అద్దెగదిలో ఉండేది. కార్యక్రమాలను సక్ర

మంగా నడపాలంటే స్వంత భవనం కావాలని సభ్యులు ప్రయత్నాలు చేస్తు న్నారు. 1914–15లో నిలయానికి కార్యాదర్శిగా రావుగారు ఎన్నుకోబడ్డారు. భవన నిర్మాణం ఎలాగా అని అందరూ ఆందోళన పడుతున్న సమయంలో రావుగారి కొక ఆలోచన కలిగింది.

నిలయాన్ని స్థాపించిన వారిలో ఒకరైన రావిచెట్టు రంగారావుగారు అప్పటికి చనిపోయారు. వారి భార్య లక్ష్మీనరసమాంబగారిని ప్రోత్సహించి రంగరాయ స్మృతి చిహ్నంగా నాలుగువేల రూపాయలు విరాళముగా ఇప్పించు కుని మందిర నిర్మాణానికి రావుగారు పూనుకున్నారు. అది మొదలు కంటికి కనబడిన మనిషినీ - ఎదురయిన అవకాశాన్నీ జారవిడువకుండా నిర్మాణ మాటంగా ఉపయోగించుకొని భవన నిర్మాణాన్ని పూర్తి కావించారు రావుగారు. ఆ నిలయ పరిపాలన-గ్రంథ సేకరణ మొదలైన విషయాలలో రావుగారు అనుసరించిన పద్ధతులూ, పెట్టిన కఠిన నియమాలూ సాటిలేనివి. నిలయ వార్షి కోత్సవాలూ రజతోత్సవమూ జరిపేటప్పుడు రావుగారి పలుకుబడీ-దూరదృష్టీ-ప్రతిభా-సమాలోచనా నిలయానికి పెట్టని కోటగా ఉండేవి.

రావుగారికి ప్రియమైన వాటిలో ఆ నిలయమొకటి. ఆ సభ్యులకు రావు గారు ప్రత్యక్షదైవము. గౌలిగూడెంలోని బాలసరస్వతీ ఆంధ్రభాషానిలయమూ, నాంపల్లిలోని వేమన గ్రంథాలయమూ రావుగారి సేవాభాగ్యానికి నోచుకున్నవే. బాలసరస్వతీ గ్రంథాలయానికి భవననిర్మాణంలో కూడా రావుగారు శ్రమించారు.

ప్రజలలో చైతన్యము కలిగించాలన్న ప్రబలమైన వాంఛకు రావుగారు మరొక సాధన కనిపెట్టారు. ఎన్ని కులాలు ఉన్నాయో వాటన్నిటికీ-యాదవ, ముదిరాజ, మున్నూరు, హరిజన, పద్మశాలి, గౌడ మొదలైన వర్గాలను మేలు కొలిపి-వాళ్లకు సంఘాలుపెట్టి-ఆ కులాలలో ఉత్సాహవంతులైన వారిని ఆయా సంఘాలకు పెద్దలను చేసి-తాను దూరంగా ఉండి సలహాలిస్తూ నడిపించారు. దీని వెనుక ఒక రహస్యమున్నది. ఇతర ప్రాంతాలలో బ్రాహ్మణ-బ్రాహ్మ ణేతర భావాలు సంఘంలో ప్రబలంగా ఉండి విద్వేషానికి ఆటపట్టవు తున్నాయి. కనుక-ఆ వర్గాలు తనను అధ్యక్షులుగా ఉండమని ప్రాధేయపడినా సమ్మతించక-తాను వెనుక ఉండి నడిపించటానికి గల ప్రబలమైన కారణం.

రావుగారికి గ్రంథాలయాలే కాకుండా అప్పుడు నగరంలో ఉన్న సంస్థలు—జీవరక్షా ప్రచారిణీ సంఘము, హిందూ సంఘ సంస్కారసభ, ఆది హిందూ సేవాసమితి మొదలైన వాటితో ప్రత్యక్ష సంబంధం లేకపోయినా సానుభూతీ—పరోక్ష సంబంధమూ ఉండేవి.

ప్రజలలో చైతన్యం కలిగించాలని హృదయంలో సాగర మథనం జరుగుతూ ఉంటే మనశ్శాంతి ఎక్కడిది? సికిందరాబాదులో సీతమ్మగారు నడిపే పరోపకారిణి బాలికా పాఠశాలనుంచి పిలుపు రాగానే వెళ్లి దాని యాజమాన్యాన్ని చేతిలోకి తీసుకున్నారు. తెలంగాణాలో ప్రచురితమయ్యే నీలగిరి పత్రిక పట్ల రావుగారికి ఎనలేని అభిమానము. గోలకొండ వారపత్రిక, సుజాత మాసపత్రిక రావుగారి సహకార సంప్రతింపులతో స్థాపితమయ్యాయి. వాటిలో రావుగారు ప్రజలకు విద్యా,సాంఘిక సాంస్కృతిక పరంగా మేల్కొలిపే రచనలు అధికంగా చేస్తూ ఉండేవారు.

నిజాం రాష్ట్రంలో హిందువులు అంటే—ఆంధ్ర కర్నాటక మహారాష్ట్రులు—అందరూ కలిసి మెలిసి ఉండేవారు. ఒకరిపట్ల ఒకరు గౌరవ భావంతో మెలగేవారు. ఆకాలంలో పత్రికాస్వాతంత్ర్యము, వాక్స్వాతంత్ర్యము, సమావేశాలు జరిపే స్వాతంత్ర్యమూలేవు. సమావేశ ప్రతిబంధక ప్రకటనకు వ్యతిరేకంగా ఆందోళన చేయటానికి ఏర్పడిన సంఘానికి రావుగారు కార్యదర్శిగా ఎన్నుకో బడ్డారు. ఇదిగాక—స్టేట్ రిఫార్మ్ ఎసోసిఏషన్, కాంగ్రెసు కమిటీ, హిందూ మహాసభ మొదలైన సంస్థలలో అధికారపదవులను నిర్వహించారు.

రావుగారి కృషిఫలితంగా ప్రజలలో చైతన్యం క్రమంగా కలుగుతూ వచ్చింది. వారు పెట్టిన సంస్థలు దిన దిన ప్రవర్థమానంగా ఉన్నాయి. యువకులు ఉత్సాహంతో పనిచేస్తున్నారు. కాని నిక్కమైన నాయకుడు అంతటితో తృప్తి పడతాడా? ఈ పరిస్థితులూ ఈ సంస్థలూ పర్పర విరుద్ధ భావాలు లేకుండా నడిచేటట్టుగా చేయాలంటే—పాయలు పాయలుగా ఉన్న వివిధోద్యమాలను ఏకోన్ముఖం చేయటం చాలా అవసర మనిపించింది రావుగారికి.

అందుకు వారు ఆలోచిస్తూ ఉండగా రావుగారిలో నిబిడీకృతమైన ప్రజ్ఞను వెలికి తీయటానికా అన్నట్టు ఒక సంఘటన జరిగింది.

అది 1921 నవంబరు 12వ తేదీ శనివారం రాత్రి. గౌలిగూడెంలోని వివేకవర్ధనీ థియేటరులో హిందూ సంస్కార మహాసభ జరుగుతున్నది. పూనా నుంచి సంఘ సంస్కరణ పరాయణులూ మహిళా విద్యాలయ ప్రతిష్ఠాపకులూ అయిన ధోండే కేశవ కార్వే మహాశయుడు ఆనాటి సభకు అధ్యక్షులు. అధ్యక్షులు ఆ మహాసభ నిర్వాహకులూ మహారాష్ట్రులు. ఆ థియేటరు, దాని వాతావరణమూ మహారాష్ట్రలది. ప్రేక్షకులలో మహారాష్ట్రులే అధికంగా ఉన్నారు. రావుగారు పెద్దలందరితో వేదికనలంకరించారు. సభా చర్చలలో ఆంధ్ర, మహారాష్ట్ర, కర్నాటక భాషలలో ప్రసంగాలు జరపాలని విషయ నిర్ణయసభవారు తీర్మానించారు. ఆంధ్ర భాషలో ఉపన్యసించటానికి రావుగారు కాక మరొకరు కూడా నియామకమైనారు కాని హిందూ సంస్కారసభవారి నిర్ణయము-నక్రమ సామరస్య పద్ధతి ప్రేక్షకులకు ఏవగింపు కలిగించింది. తెలుగుభాషలో ప్రసంగాలు మొదలు కాగానే అల్లరి చేయటం మొదలు పెట్టారు. ప్రసంగాలు ఆపివేయవలసి వచ్చింది. అక్కడ సమావేశమయిన ఆంధ్రులు జరిగిన ఆ అవమానము తమకు కాదు - ఆంధ్రభాషకు జరిగినట్టుగా బాధపడ్డారు. ఉద్రిక్తులై నిరసన ప్రకటిస్తూ సభను రావుగారితో పన్నెండు మంది బహిష్కరిస్తూ వెళ్లిపోయారు.

అవమానింపబడిన ఆ పన్నెండుమందీ ఆ రాత్రి ఇళ్లకు వెళ్లలేదు. ట్రూపు బజారులో ఉన్న టేకుమాల రంగారావు హైకోర్టు వకీలుగారింట్లో సమావేశమయి "ముందేం చెయ్యాలి?" అని ఆలోచించటం మొదలు పెట్టారు. ఆ ఆలోచనల ఫలితమే ఆంధ్ర జనసంఘ స్థాపన. దానికి రావుగారు కార్యదర్శిగా ఎన్నికయినారు. ఈ విధంగా ఆ రాత్రి ఆంధ్రుల అవమాన జ్వాలలో నుండి ఆంధ్ర జనసంఘం ఉద్భవించింది.

ఆ తరువాత దానికి శాఖోపశాఖలు మూడు నాలుగేళ్లలో 50 వరకూ స్థాపితమయ్యాయి. 90 గ్రంథాలయాలు స్వతంత్రంగా ఏర్పడి, విద్యా ప్రచారం చేయటం మొదలుపెట్టాయని తెలుగు సమాచార్‌లో రావుగారే వ్రాశారు. వీటన్నికీ కేంద్రసంఘ మొకటి కూడా స్థాపనయింది.

రావుగారు తమకు భాషాభేదంలేదని వ్యక్తం చేయటానికి మహారాష్ట్రులను గాని కర్నాటకులనుగాని సభలకు అధ్యక్షులుగా ఆహ్వానించటమూ వారి సభలనూ సమావేశాలనూ కూడా వీటితో కలుపుతూ నిర్వహించటమూ

వంటివి చేస్తూ ఉండేవారు. తరువాత—తరువాత-మహారాష్ట్రిలూ కర్నాటకులూ అంత శ్రద్ధ కనబరచ పోవటంలో ఆ శాఖలు నిలిచి పోయాయి.

పది పది హేను ఆంధ్ర మహాసభలు జరిగేటప్పటికి ఆంధ్రులలో కొందరు ఛీలి అభివృద్ధిపక్షమన్న పేరుతో ఒక సంఘాన్ని స్థాపించారు. అది ఉడుకు రక్తపు పొంగు అని తెలిసినా రావుగారు మొదట కొంత బాధపడ్డారు. అయితే అది ఎట్లా పుట్టిందో అట్లాగే నశించిపోయింది.

ఆంధ్ర మహాసభలు నిర్వహించటంలో రావుగారి కొండంత నేర్పూ ఓర్పూ ఆశాభావమూ ప్రస్ఫుటమవుతూ ఉండేవి.

ఆంధ్ర మహాసభలతో రావుగారిలో ఉన్న ఆర్తి శాంతించలేదు. ఆంధ్ర మహాసభలు పురుషులకు సంబంధించినవి. స్త్రీ జనాభివృద్ధికి కూడా కందుకూరి మాదిరిగా కృషి చేయాలనీ వారిలోకూడా చైతన్యాన్ని కలిగించాలనీ ఆ సభ లతోపాటు మహిళా సభలు కూడా నిర్వహించటానికి పూనుకున్నారు.

హరిజనుల విద్యా విషయంలో రాయ్ శ్రీ కిషన్ బారిష్టరుగారికి సహాయ కార్యదర్శులుగా రావుగారు పనిచేశారు.

ప్రజలు అన్ని విషయాలూ తెలుసుకోవటానికి అనువుగా లఘు పుస్తక ప్రకటనా ప్రణాళికను ప్రారంభించారు. ఈ ప్రణాళికలో—నిజాం రాష్ట్రాంధ్రులు, వర్తక స్వాతంత్ర్యము, వెట్టి చాకిరి, వ్యవసాయదారులకు కొన్ని సూచనలు, మద్యపానము, గ్రంథాలయాలు, మన వాక్స్వాతంత్ర్యము, ఋణబాధా నివారణ వంటి అంశాలపై అందరికీ లభ్యమయ్యేటట్టుగా - అణా, అర్ధణాలకు లభించే టట్టుగా - ఆ ప్రణాళికను నడిపించారు, ఇవన్నీ కేంద్ర సంఘపక్షాన - దేశాభి మానులైన కార్యకర్తలు రచించేవారు. వీటిని చదివి సామాన్య ప్రజలు చైతన్య వంతులయ్యారు.

ఆంధ్ర మహిళోద్యమము చక్కగా కొనసాగాలంటే స్త్రీలు విద్యావతులు కావాలి. ప్రభుత్వ విద్యా ప్రణాళిక ఆంధ్ర బాలికల మాతృభాషాభివృద్ధికి భంగ కరంగా ఉన్నది. విద్యాబోధ అంతా మాతృభాషలోనే జరగాలని ప్రభుత్వం వారు ఉరుదూ బోధనాభాషగా పాఠశాలను నెలకొల్పారు. మన మాతృభాష తెలుగు కదా. తెలుగు బోధనా భాషగా పాఠశాలలుండాలని రావుగారి ఆశయము.

ఈ కారణంచేతనే పరోపకారిణీ పాఠశాలకు అధిపత్యము వహించారు. ఈ పాఠశాల కొంతకాలము బాలసరస్వతీ నిలయంలో నడుపబడ్డది.

ప్రభుత్వంవారి విద్యాప్రణాళిక, బోధనాభాషా విషయంలోనే కాకుండా ప్రైవేటుగా పాఠశాలలు స్థాపించే విషయంలో కూడా కఠిన నియమాలను అమలుపరచింది. దీనివల్ల బాలికల విద్య ఒక సమస్యగా పరిణమించింది.

రావుగారిది అందరినీ కలుపుకుని ముందుకు సాగాలన్న పద్ధతి. కనుక-శ్రీరామచంద్ర నాయక్ బారిష్టరు, రాయ్ విశ్వేశ్వరనాథ్, అహల్యాబాయి మల్లన్న, సులోచనాబాయి, వాసుదేవ హార్డీకర్, కృష్ణస్వామి ముదిరాజుగార్లతో ఒక సంఘాన్ని స్థాపించారు. రెసిడెన్సీ బజారు బ్రిటిష్‌వారి ఆధిపత్యంలో ఉండటంచేత విద్యావిషయంలో ఎటువంటి చిక్కు ఉండదనీ-స్వేఛ్ఛాయుతమైన వాతావరణము ఉంటుందనీ, మహారాష్ట్రి, ఆంధ్ర భాషలలో విద్య గరపటానికి ఒక బాలికా పాఠశాలను రెసిడెన్సీ బజారులో ఈ సంఘం స్థాపించింది. కొంతకాలం తరువాత మహారాష్ట్రి శాఖకు అంతగా ప్రోత్సాహం లేకపోవటంచేత ఒక ఆంధ్రశాఖే నిలిచింది. అలా మూడవఫారం వరకూ నడచిన పాఠశాలను ఆర్థిక సౌకర్యాలు లేకపోవటంచేత కమిటీవారు వదలుకున్నారు.

కాని-రావుగారు ఆశావాది. వడ్లకొండ నరసింహారావుగారి తోడ్పాటుతో ఆ పాఠశాలభారాన్ని వహించి ఆంధ్ర బాలికోన్నత పాఠశాలగా మార్చి నడపటం మొదలు పెట్టారు. దానికి కొంతకాలము ఆంధ్రజన కేంద్ర సంఘంనుండి కొంత ధన సహాయం లభించేది. ఆ తరువాత రావుగారు తమ పలుకుబడినీ మంచితనాన్నీ వినియోగించి విరాళాలు సేకరించీ-చందాదారులను చేర్చి-పాఠశాలను నిర్వహించేవారు. రావుగారి అవిరళ కృషివల్ల ఆ పాఠశాల వేలకొద్దీ బాలికలకు విద్యాదానం చేసింది. ఆ పాఠశాలే నారాయణగూడెంలో నాలుగు బజార్ల కూడలిలో అంబరచుంబితాలయిన భవనాలను నిర్మించుకుని బాలికలతో కిటకిటలాడుతూ ఉంటున్నది.

ఈ పాఠశాలను రికగ్నైజు చేయమని కోరుతూ ఉస్మానియా-నాగపూర్-ఆంధ్ర విశ్వవిద్యాలయాలకు రావుగారు విసుగులేకుండా ఎన్నిజాబులు వ్రాశారో చెప్పటం కష్టము. ఉస్మానియావారు ఉరుదూ తప్ప మరొక భాషకు అమోదించమన్నారు. నాగపూరు విశ్వవిద్యాలయంవారు ఆంధ్రభాషకు తాము సౌక

ర్యాలు కలిగించలేమన్నారు. ఆంధ్ర యూనివర్శిటీవారు నేటివ్ స్టేట్సుతో తమకు సంబంధం లేదన్నారు. ఇన్ని విధాలుగా ఆశాభంగం కలిగినా రావుగారిలో ఆశ నశించలేదు. పూనాలో ఉన్న నాతీబాయి దామోదర్ థాకర్సే భారత మహిళా విశ్వవిద్యాలయంవారు "తాము, ప్రభుత్వామోదం పొందిన సంస్థ కాకపోయినా స్త్రీలకు ఎం. ఏ. వరకూ మాతృభాషలో విద్యాబోధచేసే వ్యవస్థను నెలకొల్పు కున్నారు కనుక ఆంధ్రభాషలో పరిక్షలు జరిపి యోగ్యతాపత్రాలను ఇవ్వ టానికి ఆమోదిస్తామ''ని తెలిపారు. ఈ కారణంచేత కర్వేయూనివర్సిటీకి అను బంధంగా ఈ పాఠశాలను మలచారు. ఇది ఉన్నత పాఠశాల అయినా కళాశాల విద్య కావాలనుకున్నవారికి ప్రైవేటుగా చదివి పరిక్షకు వెళ్లే సౌకర్యాలు చేయ బడ్డాయి. ఆ యూనివర్శిటీవారు బి.ఏ. డిగ్రీకి మారుగా జి.ఏ. డిగ్రీ యిచ్చేవారు.

కాని-ఒక ఇబ్బంది వచ్చింది. ఈ పాఠశాలలో చదివిన బాలికలకు ప్రభుత్వోద్యోగాలు లభించక పోవటంతో బాధ కలిగింది. రావుగారి కృషి ఫలితంగా ఆంధ్రా యూనివర్సిటీవారు తమ నియమాలను సడలించుకొని, కొంత సౌకర్యం కలిగించినందున 1945లో ఈ పాఠశాల బాలికలకు ఆంధ్రా మెట్రిక్ పరీక్షకు వెళ్లే సౌకర్యం కలిగింది.

శూన్యహస్తాలతో స్థాపితమయిన ఈ విద్యాసంస్థ రాజాబహదూర్ వెంక ట్రామారెడ్డిగారి పోషకత్వములో క్రమాభివృద్ధి చెందింది. మహోదారులయిన ఆంధ్రుల, ఆంధ్రేతరుల అభిమానాన్ని చూరగొన్నది. ఆర్థిక పుష్టిని చేకూర్చు కున్నది. ఈ సంస్థకు రావుగారు కార్యదర్శి, రాజాబహదూర్‌గారు అధ్యక్షులు.

రావుగారికి ప్రాంతీయభేదం లేదు. కనుకనే గ్రంథాలయములో తిక్కన్న, పోతన్న మొదలైనవారి వర్ధంతులు జరిపేటప్పుడు పెద్దలు ఆధిపత్యం వహిం చాలన్న విశాలభావంతో సర్కారాంధ్రులను అధ్యక్షులుగా ప్రాసంగికులుగా ఆహ్వానించేవారు. వారికి తమయింట్లో ఆతిథ్యమిచ్చి, నగరంలోని విశేషాలన్ని టినీ చూపించి—వారికి రాకపోకల ఖర్చులేకాకుండా సన్మానాలు జరిపి 116రూ. సమర్పించి సాగనంపేవారు. దాని కయేఖర్చులు చందాలుగా విరాళాలుగా సేక రించేవారు. రావుగారిపట్ల గల భక్తిశ్రద్ధలతో ఆ ధనం అట్లా సమకూరేది గాని, ఇచ్చినవారంతా ధనవంతులైకాదు. అటువంటి విశాల హృదయంగల రావుగారికి ఒక గడ్డుసమస్య ఎదురైందొకసారి.

మహాసభలపట్ల ప్రభుత్వంవారు పెట్టిన ఆంక్షలను క్రమంగా తొల గించుకుంటూ వచ్చిన రావుగారికి ఆంధ్రులే ఎదురు తిరిగారు. హైదరాబాదులో నిజాం రాష్ట్రాంధ్ర జనసంఘం స్థాపితమైనప్పుడు కొందరు "మేము బ్రిటిషు ఆంధ్రులము-మా బ్రిటిష్ ఆంధ్రత్వాన్ని మేము వదలుకోము" అని సభ్యులుగా చేరటానికి నిరాకరించారు. అంతటితో ఆగక నీలగిరి పత్రికలో "ఆంధ్ర మహా సభలు రాజకీయసభలే నని" వ్యాసాలు వ్రాశారు-వ్రాయించారు. దానికి రావు గారు చాలా బాధపడ్డారు. కాని ధైర్యాన్ని కోల్పోలేదు. వాటిని ఖండిస్తూ ఆ పత్రికలోనే వ్యాసాలు వ్రాశారు. అయినప్పటికీ వ్యతిరేక ప్రచార ఫలితంగా ప్రభుత్వం "మీలో మీకే అభిప్రాయభేదా లున్నాయ"ని మహాసభలనూ గ్రంథా లయ సభలనూ ఆపు చేయించింది.

ఒక పర్యాయము 'బ్రిటిషు ఆంధ్రులు—నిజాం రాష్ట్రాంధ్రులు' అన్న నినాదాన్ని లేవదీసి శ్రీకృష్ణదేవరాయాంధ్ర భాషానిలయములో ఒకదుమారాన్ని కొందరు లేవదీశారు. కాని-ఆ దుమారాన్ని రావుగారూ, మునగాల రాజాగారూ మేరు పర్వతాలలా నిలబడి పటాపంచలు కావించారు.

ఇలా ప్రతిఘటించినవారు నిజాంరాష్ట్రాంధ్రులను ఆశ్రయించి అక్రమ మైన ముల్కీ సర్టిఫికేట్లను పుట్టించుకొని, ప్రభుత్వోద్యోగాలు సంపాదించిన ధీరులు.

సభలపట్ల ప్రభుత్వం ఎట్లా ప్రవర్తించిందో పత్రికలపట్ల కూడా ఆ విధంగానే నడిచింది. రావుగారు ఎన్ని పర్యాయాలు పత్రిక స్థాపించాలని ప్రభుత్వాజ్ఞను కోరినా లభించలేదు. ప్రభుత్వం దృష్టిలో రావుగారు అపాయ కరమైన వ్యక్తి. కాని—తరువాత ఎప్పుడో "అనుజ్ఞ ఇస్తా" మంటూ ప్రభుత్వం ఇచ్చిన జవాబుకు రావుగారు జవాబివ్వలేదు. బుక్కపట్నం రామానుజాచారి B. A. B. L. ప్రభుత్వానుమతిని పొంది తెలంగాణా పత్రికాభారం వహించి రావుగారి సహాయాన్ని అర్థించారు. రావుగారు తమకు పత్రికలతో ప్రత్యక్ష సంబంధం లేకపోయినా తెలుగు పత్రికలలో వ్యాసాలు వ్రాసేవారు. ముషీరి దక్కను పత్రికకు ఉరుదూలో సంపాదకీయాలు వ్రాసేవారు.

రావుగారు ఆంధ్ర ఆంగ్ల ఉరుదూ భాషలో అనర్గళంగా ఉపన్యసించ

గల శక్తిమంతులు. అనువాదం కూడా భావం చెడకుండా చేయగలరన్న పేరు ఉన్నది. పత్రికా రచనలో వారిది అందెవేసిన చెయ్యి.

రావుగారు హనుమకొండలో ఉండగానే వచనరచనా, కవిత్వమూ వ్రాయటం మొదలుపెట్టారు. రెండు ప్రఖ్యాత గ్రంథాలు అనువాదం చేశారు. కాని రావుగారు ప్రచురించే లోపల వాటినెవరో ప్రచురించారు. కనుక-అవి అంతటితో తెరమరుగై పోయాయి. రావుగారు 1910 నాటికే కథారచయిత అని తెలంగాణా సాహిత్య చరిత్రవల్ల తెలుస్తున్నది.

రావుగారు ఎవరిపయినా సరే-పొరబాట్లను సహించేవారు కారు. వాస్తవాన్ని తలక్రిందులు చేసిన రచనలను వెంటనే ఖండించేవారు. నిజాం రాష్ట్రానికి సంబంధించిన గ్రామాలనూ కవులనూ తారుమారుచేసి ఎవరో వ్రాసినట్లు రావుగారికి తెలిసింది. ఆ రచయితదృష్టిలో "తెలంగాణావారు అసలు ఆంధ్రులు కారు. తెలంగాణా ఆంధ్రదేశం కాదు. తెలంగాణావారు వలస పోయిన ఆంధ్రులు" అని ఒక పత్రిక ప్రకటించగా రావుగారు పౌరుషంతో వెంటనే కలం చేతబట్టి సోదాహరణంగా వ్యాసంవ్రాసి ఆ వాదాన్ని ఖండించారు.

నిజాం ప్రభుత్వము రాజ్యాంగ ప్రణాళికను నిర్మించటానికి ఒక కమిటీని నియమించి దానికి ఆరవముదయ్యంగారిని అధ్యక్షులుగా ప్రకటించింది. ఆ కమిటీకి ప్రజాభిప్రాయాన్ని వ్యక్తం చేయటానికి ఒక సమితి ఏర్పడ్డది. దానిలో మహమ్మదీయులూ, ఆంధ్ర కర్నాట మహారాష్ట్ర నాయకులున్నారు. వారంతా విద్యాధికులు రెండు మూడు డిగ్రీలున్నవారు. అయినప్పటికి ఏ డిగ్రీ లేని రావుగారు ఆ సమితికి అధ్యక్షులుగా ఎన్నికైనారు. దానికి కారణం రావుగారు "నిజాం రాష్ట్రంలో రాజ్యాంగ సంస్కరణలు" అనే ప్రజా పరిషత్తు వలన ఏర్పడిన కమిటీ నివేదికను ఆంగ్లభాషనుండి తెలుగుభాషలోకి అనువదించటమే. దానిలో కూడా అనుభవం సంపాదించిన వారు కావటంచేత ఆంధ్రేతరులకు కూడా వారిపట్ల అపారమైన గౌరవాభిమానాలు ఉండేవి.

రావుగారి ఆశలూ ఆశయాలూ అసమానమైనవి. యువకులయందు కార్యోత్సాహాన్ని పెంపొందించాలనీ ప్రజ్వలింపచేయాలనీ వారి ఆశయము. దేశసేవ చేయాలన్న ఉద్దేశ్యంతో ఉద్రేకానికి లోబడకూడదు. మన రాష్ట్ర పరిస్థితు

లను ముందు బాగా గమనించాలి. హిందూ మహమ్మదీయ క్రైస్తవాది మతాలు గలది మన రాష్ట్రము. మహారాష్ట్ర ఆంధ్ర కర్ణాటక ఉరుదూ లైన భాషలున్నాయి. వీటన్నిటినీ దృష్టి యందుంచుకొని సమరస భా ఆదర్శంగా పెట్టుకుని—తొందరపాటు మాని మందంగానైనా సరే—పట్టు ముందంజ వేయాలని యువతీయువకులకు ప్రబోధిస్తూ ఉండేవారు.

గాంధీజీ మాదిరి రావుగారికి యువతరం తొందరపాటును ఒ నవ్వుతో త్రోసిపారేసే అలవాటు.

హైదరాబాదులో విద్యావిజ్ఞానోద్యమాలకు రాజా బహద్దరు వెంక| రెడ్డిగారు సంపూర్ణంగా రావుగారికి తోడ్పడ్డారు. సర్వశ్రీ కొండా రంగారెడ్డి, సురవరం ప్రతాపరెడ్డి, మాదిరాజు రామకోటేశ్వరరావు, గడ్డం కృష్ణారెడ్డి, మందుముల నరసింగరావు, రామచంద్రరావు, బూరుగుల కృష్ణారావుగారు అమిత విశ్వాసంగల సహచరులు.

నిజాం రాష్ట్రాంధ్రులకు ఎనలేని సేవచేసిన ప్రియతమ నాయకుడి పూర్త్యుత్సవము చేయాలని పెద్దలు సంకల్పించారు. పెద్దలంతా వార చరులే. ఒక రూపాయి మొదలుకొని వెయ్యి రూపాయల వరకూ ప్రజల విరాళాలు సేకరించారు. ఉత్సవనిధి మొత్తము 11113-7-0 వసూలు 1946 ఫిబ్రవరి 6,7 తేదీలలో రెడ్డి హాస్టలు ఆవరణంలో ఈ మహోత జరిగింది. ఆహ్వానసంఘాధ్యక్షులు రాజా బహదూర్ వెంకట్రామారెడ్డి ఉత్సవ కార్యదర్శి కొండా వెంకట రంగారెడ్డిగారు.

అది కన్నుల పండుగయిన ఉత్సవము. తెల్ల గుఱ్ఱాల బగ్గీలో హన చేక్షీలో ఉన్న రావుగారి ఆంధ్రకుటీరంనుండి రెడ్డిహాస్టలు వరకూ ఊరే జరిగింది. దారి పొడుగునా వర్తక సంఘాలు రావుదంపతులకు పూలమా వేస్తునే ఉన్నాయి.

సభకు రాజా బహద్దరు వెంకటరామారెడ్డిగారి స్వాగతవచన ఆరవముదయ్యంగారి ప్రారంభోపన్యాసము - కడప కోటిరెడ్డిగారి అధ న్యాసము—రావుగారి సేవను గురించీ, గుణగణాలను గురించే ప్రశంసలూ - మధ్య హర్షధ్వానాలూ-సురవరం ప్రతాపరెడ్డిగారి సన్మానపత్ర సమర్ప వాటి ఉత్సవమొక డాక్యుమెంటరీ చిత్రమువంటిది. నిజాం రాష్ట్ర

ఆంధ్రులూ ఆంధ్రేతరులూ కూడ రావుగారిని ప్రశంసించి పూలమాలలు వేశారు. శిరోమణి రంగాచార్యులుగారు రావుగారి జీవితకథను బుర్రకథగా రచించి గానం చేశారు.

ఈ ఉత్సవం ప్రత్యేకత తులాభారము. పెద్ద త్రాసులో వారిని కూర్చొబెట్టి తూకం రూపాయ నాణేలతో వేశారు. అక్కినేపల్లి జానకి రామారావుగారు, ఆదిరాజు వీరభద్రరావుగారు "మరొక రూపాయ వేయండి" అంటూ కొసరి కొసరివేయగా రావుగారి బరువు 6400 రూ. తూగింది. ఆ ధనాన్ని రావుగారికి సమర్పించింది ఆహ్వాన సంఘం

రాష్ట్రమంతటా రావుగారి ఫోటోబెట్టి షష్టిపూర్త్యుత్సవాన్ని జరుపుకున్నారు అభిమానులు.

షష్టిపూర్తిసంచిక ఆహ్వాన సంఘం పక్షాన వెలువడ్డది. ఆ సందర్భంలో రావుగారికి సన్మాన పూర్వకంగా లభించిన మొత్తము రూ. 8420-15-0. దానిని రావుగారు ఆంధ్ర సారస్వత నిక్షేపంగా స్వీకరించారు. దానికి ట్రస్టీలు సర్వశ్రీ కొండా వెంకటరంగారెడ్డి, కొమ్మవరపు సుబ్బారావు, ఆదిరాజు వీరభద్రరావు, నరోత్తమరెడ్డి, బిదురు వేంకట శేషయ్యగారలు. దీని పక్షాన గ్రంథాలు వెలువడ్డాయి. మిగతా ధనాన్ని విద్యాప్రచారానికి వినియోగించారు.

రాజా బహదూర్ వెంకట్రామారెడ్డి మహిళాకళాశాల రావుగారి కృషి ఫలితంగా స్థాపితమయింది. దానికి ఉస్మానియా యూనివర్సిటీకి అనుబంధ కళాశాలగా అనుమతి పొందటానికి సారస్వత నిక్షేపంలో గ్రంథ విక్రయంవల్ల వచ్చిన ధనాన్ని మొత్తం 19000 రూపాయలను రావుగారు ఉదార భావంతో సమర్పించారు.

భారతదేశానికి స్వాతంత్ర్యము వచ్చిన తరువాత-నిజాం రాష్ట్రంపై పోలీసు చర్య జరిగిన తరువాత-పూర్వపు పరిస్థితులు మారిపోయి-ప్రజారాజ్యంలో 1951లో, సంపూర్ణాధికారంగల పురపాలక సంఘం శాసనబద్ధంగా అవతరించింది. ఆంధ్ర కర్ణాటక మహారాష్ట్రల కూడలి అయిన హైదరాబాదు నగరంలో ఈ సంఘానికి ఎవరిని అధ్యక్షులుగా ఎన్నుకోవాలన్న సమస్య పొటమరించింది. అందరూ ఏకగ్రీవంగా రావుగారిని ఎన్నుకొని నగరపితను

చేసి గౌరవించారు. మేయరు పదవికి ఒక సంవత్సరం మాత్రమే గడువు. కాని ప్రతి సంవత్సరం జరిగే ఎన్నికలలో రావుగారే తిరిగి తిరిగి ఎన్నిక అవుతూ 1951 నుండి 54 ఏప్రిల్ వరకూ ఆ పదవిలో ఉన్నారు. వారు మేయరుగా ఉన్న కాలంలో ప్రజల సౌకర్యార్థం గ్రీవెన్సు కమిటీని నెల కొల్పారు. నగరంలో ఉన్న అన్ని గ్రంథాలయాలకూ ధనసహాయంచేసే సంప్రదాయాన్ని నెలకొల్పారు. ప్రైమరీ పాఠశాలలలో సాంఘిక విద్యాభి వృద్ధికిగాను ప్రణాళికాబద్ధంగా పాఠశాలలు ఏర్పాటుచేశారు. సన్మానపత్రాలు ఆంధ్రభాషలో రచితమయ్యేటట్టుగా నియమం పెట్టారు.

రావుగారి కార్యాచరణా, వారి ఆలోచనలూ నగరంలో ఉన్న అన్ని జాతుల వారికీ-అన్ని రాజకీయ పర్గాలవారికీ ఆదరణీయంగానూ-శిరోధార్యం గానూ ఉండేవి. వారికి ప్రత్యక్షంగానో నిజాంరాష్ట్రంలోని అన్ని సంఘాల తోను సంబంధం ఉండేది.

1952లో జరిగిన సాధారణ ఎన్నికలలో రావుగారికి నగర నియోజక వర్గంలో టికెటు లభిస్తుందని అందరూ విశ్వసించారు. కాని—కమ్యూనిష్టు ప్రాబల్యమున్న గద్వేలు నియోజకవర్గానికి వారిని కేటాయించటంతో అది విజయవంతం కాలేదు.

1958లో శాసనమండలి ఏర్పడినప్పుడు ఎసెంబ్లీ నియోజకవర్గం నుండి కౌన్సిలుకు ఎన్నికయినారు. సభాపతిగా 58 నుండి 64 వరకూ పని చేశారు. తరువాత రెండు సంవత్సరాలు సామాన్య సభ్యులుగా ఉన్నారు. 6 సంవత్సరాలు సభాపతిగా ఉన్నకాలంలో సకల జనసమ్మతంగా సభ నడి పారు. వారికి వీడ్కోలు ఇచ్చేటప్పుడు కౌన్సిలులో ఉన్న అన్ని పక్షాలూ వారి మేధావిత్వమూ - కార్యదీక్షా - న్యాయతత్పరతా-సమయస్ఫూర్తి-సౌజన్యాలను కొనియాడారు.

1955లో మాజీ రాష్ట్రపతి రాజేంద్రప్రసాదుగారు రాష్ట్రపతినిలయం లో స్వయంగా రావుగారికి పద్మభూషణ బిరుదు పతకాన్ని తొడిగారు. వారు ఎప్పుడు హైదరాబాదు వచ్చినా రావుగారిని కలుసుకుని "మనిద్దరి పుట్టిన రోజు ఒకటే కదూ?" అంటూ కులాసా కబుర్లు చెప్పుకునేవారు.

బూరుగుల రామకృష్ణారావుగారు ఛాన్సలర్‌గానూ సూరి భగవంతంగారు వైస్ ఛాన్సలరుగానూ ఉండగా రావుగారు ఉస్మానియా విశ్వవిద్యాలయానికి శాశ్వత సెనేట్ సభ్యులుగా నియామకమయినారు. 4 సంవత్సరాల కాలము సిండికేటు సభ్యులుగా సేవచేశారు. ఉస్మానియా యూనివర్సిటీలోనూ బయటా విద్యారంగానికి చేసిన సేవను పురస్కరించుకొని 1956 లో జరిగిన స్నాతకోత్సవంలో ఛాన్సలర్ గా ఉన్న రామకృష్ణారావుగారు "Dr. of Literature-వాఙ్మయ ధురంధర" పట్టాన్ని ఇచ్చారు.

రావుగారు ఇతరులకొక సూత్రమూ తనకొక సూత్రమూ గలవారు కారు. తెలుగు బోధనభాషగా గల పాఠశాలను స్థాపించినప్పుడు తనభార్య మాణిక్యమ్మగారిని దానిలో చేర్చారు. ఆమె కర్వే యూనివర్సిటీ ఇంటర్ మీడిఏటు పరీక్షనిచ్చిన విద్యావతి. సిరిసిల్ల ఆంధ్ర మహాసభలతో పాటు జరిగిన మహిళా సభకు అధ్యక్షత వహించారు.

రావుగారిని వారి అనుయాయులూ, ఇంకా ఇతరులూ వారిది "తాబేటి నడక పాలిసీ" అని పేరు పెట్టారు. దానికి వారి చిరునవ్వే సమాధానము. చేసే పని ఆలస్యమయినా నిర్మాణాత్మకంగా ఉండాలన్న పద్ధతి వారిది. గట్టి పట్టుదలతో-ముందడుగు వేయాలన్నది వారి సూక్తి. తాను తలపెట్టిన కార్యము పూర్తి అయ్యేవరకూ ఎక్కిన గడపే ఎక్కుతూ దిగిన గడపే దిగుతూ శ్రమించేవారు.

రావుగారి ప్రజ్ఞాపాటవాలు పల్లెసీమలకు కూడా ప్రాకాయి. వారంతా సలహా సంప్రతింపులకు రావుగారి వద్దకు వస్తూ ఉండేవారు.

రావుగారు ఆంధ్రులను నిద్రావస్థనుండి మేల్కొలిపి వారిలో దేశాభిమానాన్ని-ఆత్మగౌరవాన్ని-రాజ్యాంగభావాన్ని వృద్ధిచేసిన మహాపురుషులు. Seasoned workers ను ఎందరినో తయారుచేసిన నాయకులు.

రావుగారు సకల జనసమ్మతమైన నాయకులు. వారిది నిష్కల్మషమైన చిత్తము. స్వార్థరహితమైన చింతన. స్వచ్ఛమైన ఆదర్శము. అనేకమంది వీరి ఆదర్శాలను ఆచరణలో పెట్టబోయి పొరబాట్లు చేశారు. అప్పుడు వారిని సరిదిద్దటం రావుగారి వంతుగా ఉండేది.

సురవరం ప్రతాపరెడ్డిగారు "రావుగారిలో ఒక గొప్ప లక్షణమున్నది. ఎవరిలో ఏ శక్తి ఉన్నదో గ్రహించి వారిచేత ఆ పని చేయిస్తారు. సహాయకులనూ అనుయాయులను తయారుచేయటంలో వారికి వారే సాటి" అని భక్తులాడేవారు.

రావుగారిది ప్రశాంత గంభీర ప్రజ్ఞాశక్తి. వారి నిరంతర కృషివల్ల తెలుగునాడు వెలుగునాడైనది.

ఆంధ్రజ్యోతి అమరజ్యోతి అయింది.

స్త్రీవిద్యాప్రచారమూ స్త్రీలలో చైతన్యమూ కలిగించిన సంస్కర్త.

రాజకీయాలతో సంబంధం పెట్టుకుంటే సంఘాలు చిరకాలము మనజాలవనే విశ్వాసము గలవారు. ఆంధ్ర సారస్వత పరిషత్తు ఇంత ఉజ్వలంగా వెలగటానికి గల కారణము రాజకీయాలకు దూరముగా ఉండటమే.

ప్రజా సభ్యతను పోషించిన మహావ్యక్తి.

తన అఖండజ్యోతితో ఎన్నో చిన్న చిన్న జ్యోతులను వెలిగించిన మహాజ్యోతి.

రావుగారికి మొదటభార్యవల్ల కలిగినది స్త్రీ సంతానము. రెండవ భార్యవల్ల కలిగినది పురుష సంతానము.

రావుగారిది సంపూర్ణాయుర్దాయము. వారు ఎనభై సంవత్సరాలకు పైగా జీవించారు. వారి జీవిత కాలములో కుటుంబము సుఖశాంతులతో కళకళలాడుతూ ఉండేది.

వారు వకాలత్ చేసేటప్పుడు హనుమాన్ టేక్డీలో అనాథ శరణాలయంగా ఉన్న ఇంటిని కొన్నారు. దానికి క్రొత్త క్రొత్త అలంకారాలు చేసి ఆంధ్ర కుటీరమని పేరు పెట్టారు. ఆ కుటీరములో ఉండే రావుగారు తెలుగు భాషను దాస్య శృంఖలాలనుండి విముక్తను చేశారు. ఆ కుటీరములో ఉండే తెలుగువారిని సుషుప్తావస్థనుండి మేల్కొలిపి చైతన్యవంతులను చేశారు. ఆ కుటీరంలో ఉండే లెక్కలేనన్ని సంస్థలకు నిర్మాణయుతమైన ప్రణాళికలను రచించారు. ఆ కుటీరంలో ఉండే ప్రజలకు సమరస భావాన్ని ప్రబోధం చేశారు.

నిజాం రాష్ట్రంలో కంటకాలను తొలగించి ఆంధ్రులకు వెలుగుబాటలు వేసిన రావుగారి ఆ కుటీరము వారు లేక-నిర్జీవంగా ఉన్నది. వారి సతీమణి మాటలలో చెప్పాలంటే "ఒకనాటి అనాథశరణాలయము తిరిగి ఇప్పుడు అనాథ శరణాలయమై పోయింది".

ఇప్పుడు తెలుగువారి హృదయాలలో వెలిగేది ఆ దివ్యతేజస్సే మరి !



# "ఆంధ్ర పితామహ" "పద్మభూషణ" మాడపాటి హనుమంతరావు పంతులుగారి భాషాసేవ - దేశసేవ

— డా॥ జి. వి. సుబ్రహ్మణ్యం

తెలుగువారు 'తాత' గౌరవాన్ని అంత తేలిగ్గా ఎవరికీ ఇవ్వరు. అల నాడు జాతినీ సాహిత్యాన్నీ సముద్ధరించిన తిక్కన సోమయాజిని 'కవిబ్రహ్మ' బిరుదంతో గౌరవించారు. ఆ తరువాత ప్రబంధ రచనా ప్రక్రియకు ప్రాణం పోసిన అల్లసాని పెద్దనను 'ఆంధ్ర కవితా పితామహు' డని ప్రశంసించారు. వీరుగాక ఒకరిద్దరు పితామహులు వినబడతారుగాని వారికి చిరకీర్తి లభించలేదు. ఏమైనా, వీరంతా సాహిత్యరంగానికి మాత్రము సంబంధించిన వారే. ఈ శతాబ్దంలో జాతిపితగా భారతీయుల హృదయాల్లో సమున్నత స్థానాన్ని సంపాదించుకొన్న గాంధీమహాత్ముడు తెలుగు బిడ్డలచేత 'తాతా!' అని పిలిపించుకొన్నాడు. ఆ తరువాత పండిత జవహర్‌లాల్ నెహ్రూ 'చాచా నెహ్రూ' గా బాలల హృదయాలలో నిలిచిపోయాడు. అయితే, తెలుగు నాయకుల్లో 'ఆంధ్ర పితామహ' గౌరవాన్ని పొందిన ఏకైక నాయకులు కీ. శే. మాడపాటి హనుమంతరావు పంతులుగారు. తెలుగువారు పితామహ బిరుదగౌరవాన్ని ఒక నూత్న సృష్టి చేసిన వారికి గాని, ఒక నూత్న ప్రక్రియను ప్రవర్తింపజేసిన వారికిగాని, జాతిలో ఒక నూతనోత్తేజాన్ని కల్పించిన వైతాళికునికి గాని ఇచ్చి తమ కృతజ్ఞతను వ్యక్తం చేసుకుంటారు. అందులో మరో విశేషం కూడా ఉంది. పితామహశబ్దం మూడుతరాల ఉనికిని వ్యంజింపచేస్తుంది. తాతనుండి మనుమని దాకా మూడు తరాలు ఉంటాయి. మనుమడు చేసే గుర్తింపే తాత గౌరవం. అంటే ఏ మహాపురుషుని సేవలు ఆయన జీవితకాలంలోనే మూడుతరాల వ్యక్తుల్ని ఉత్తేజపరిచి ఒక మహాప్రయోజనం సాధింపచేస్తాయో ఆయనే పితామహ బిరుదాని కర్హుడౌతాడన్న మాట! 'ఆంధ్ర పితామహ' హనుమంతరావు పంతులుగారట్టి దేశసేవ చేసిన మహనీయులు కాబట్టే ఆ బిరుదం ఆయనకు సార్థకమైంది. తెలంగాణంలో ప్రతి తెలుగువాడి గుండె ఆయనపేరు చెప్పంగానే భక్తివినమ్ర

భావంతో జోహారులర్పిస్తుంది. తరతరాల తెలుగువారు చిరకాలం తలచుకొనే దేశసేవ, భాషాసేవ చేసిన మహితాత్ముడు పంతులుగారు! ఆయనకు ప్రజలు భక్తిప్రపత్తులతో ఇచ్చిన బిరుదం 'ఆంధ్ర పితామహ'; ప్రభుత్వం, వారి సేవలను గుర్తించి ఇచ్చిన బిరుదం 'పద్మభూషణ'.

"సాంస్కృతికంగా, భాషారీత్యా అణచబడిన తెలంగాణా ప్రజల్లో తెలుగు గ్రంథాలయాలు, పఠనమందిరాలు స్థాపించి. తెలుగు పత్రికలు ప్రకటించి, ఆంధ్రచరిత్ర పరిశోధన జరిపించి తెలుగు ప్రజలలో ఆంధ్రభాషపైన ఆసక్తి, వారి జాతీయ సాంస్కృతిక వికాసానికి దోహద మివ్వటం జరిగింది ముఖ్యంగా గ్రంథాలయోద్యమము బాగా వ్యాపించింది. తెలంగాణా వివిధ ప్రాంతాలలో సభలు, సమావేశాలు జరిపి ప్రజలో చైతన్యం కలుగజేయు కృషి జరిగింది. ఈ ఉద్యమాని కంతటికీ 'పద్మభూషణ' శ్రీ మాడపాటి హనుమంతరావు పంతులుగారు వెన్నెముక వంటివారు. ఆంధ్రోద్యమాన్ని తెలంగాణంలో స్థాపించింది వారే. అందుకే వారికి 'ఆంధ్ర పితామహ' డనే పేరు వచ్చింది. వారితో ప్రస్తుతం భేదించే వారు కూడా, ఆరోజుల్లో వారు చేసిన కృషిని ప్రశంసించకుండా ఉండలేరు"[1] అని పంతులుగారి మితవాద వైఖరిని సమర్థించని శ్రీ రావి నారాయణరెడ్డిగారు చేసిన ప్రశంస గమనింపదగినది.

పంతులుగారు తెలుగుదేశానికి అవిచ్ఛిన్నంగా అరవైయేళ్ళ సేవ చేశారు (1904 నుండి 1964 వరకు). ఈకాలాన్ని మూడు ఘట్టాలుగా విభజింపవచ్చు. మొదటి ఘట్టం 1904 నుండి 1930 దాకా. రెండవ ఘట్టం 1930 నుండి 1950 దాకా. మూడవ ఘట్టం 1951 నుండి 1964 దాకా. 1904 లో హనుమకొండలో శ్రీ రాజరాజ నరేంద్ర ఆంధ్ర భాషా నిలయం స్థాపింపబడింది. ఆ గ్రంథాలయ స్థాపనానికి కృషిచేసిన పెద్దలలో పంతులుగారు ముఖ్యులు; వారి ప్రజాసేవా జీవితానికి అది ఒక మహారంభం.

ఇరువదవ శతాబ్ది ప్రారంభదశలో తెలంగాణంలోని తెలుగుప్రజల స్థితిగతుల్ని తెలుసుకుంటే గ్రంథాలయ ప్రారంభ ప్రాముఖ్యం తేటపడుతుంది. శ్రీ దేవులపల్లి రామానుజరావుగారి మాటల్లో-"రెండునూర్ల పాతిక సంవత్సరాల ఆసఫ్జాహి పరిపాలన ఫలితముగ హైదరాబాదు రాష్ట్రములో ఆంధ్రుడు తౌర

1. తెలంగాణం (వ్యాసాలు) రెండవ భాగం. సంకలనం. శ్రీవట్టికోట ఆళ్వారు స్వామి; వ్యాసం: 'తెలంగాణా రాజకీయోద్యమము-చరిత్ర'-పుట 16-17.

క్యాంధ్రుడైనాడు. అతనికి అరబ్బీ, ఫారసీ భాషలతో అక్షరాభ్యాసము కావించు దుస్థితి కలిగినది. ఉర్దూభాషయే రాజభాష; మరియు ప్రాథమిక దశనుండి విశ్వవిద్యాలయ దశవరకు బోధనాభాష అయినందున ఆంధ్రభాషకు కొన్ని శతాబ్దాల అజ్ఞాతవాసము ప్రాప్తించినది. ఈకాలమున ఆంధ్రుడు అన్నిరంగము లందు వెనుకబడినాడు. పరిపాలనా రంగమున అతనికి తగినస్థానము లభింప లేదు. పరదా, వరశుల్కము మొదలైన సాంఘిక దురాచారాలు ప్రబలియుం డెను. తెలుగురైతు పన్నుల భారముతో క్రుంగి దరిద్రదేవత పాదాలక్రింద నలిగిపోయెను. చదువుకున్నవారి సంఖ్య నూటికి మూడింటివరకు దిగజారెను. తెలంగాణమున పాఠశాలలు, కళాశాలలు, చాల కొద్దిగా ఉండెను.''[3] అంటే నైజాంపాలనలో తెలుగువారు ఆర్థికంగా, సాంస్కృతికంగా వెనుకబడియున్నా రన్నమాట; వారు తమమాతృభాషలో వ్యవహారాలు జరుపుకోవడానికిగాని, పత్రికలు నడుపుకోవడానికిగాని, తమ సాహితీ సంస్కృతుల అభ్యుదయానికి కృషి చేసుకోవటానికిగాని ప్రభుత్వ విధానాలు ప్రతిబంధకాలుగా ఉన్నాయన్నమాట; విద్యావంతులే నూటికి ముగ్గురైతే అందులో తెలుగులో విద్యావంతులు ఏకొందరో ఉండేవారు. హైదరాబాదు రాష్ట్రంలో అధికసంఖ్యాకులు తెలుగువారే కాని వారి భాషకుగాని, సాంస్కృతిక వికాసానికిగాని ఎట్టి ప్రోత్సాహమూ లేక పోవటంవల్ల ఒక విధంగా వారు అంధకార యుగంలో నివసిస్తూ ఉండేవారని చెప్పాలి తెలంగాణానికి వెలుపలఉన్న ఆంధ్రులు ఆంగ్లాంధ్ర భాషా వికాసాన్ని సాధించుకుంటూ, అఖిలభారతంలో ఆరంభమైన స్వాతంత్ర్యోద్యమంలో భాగస్వాములై జాతివికాసానికి తోడ్పడుతుండేవారు. అట్టి అవకాశం హైదరాబాదు రాష్ట్రాంధ్రులకు లేకపోయింది. అందువల్ల తెలుగుప్రజ మూగబాధ పడింది యిక్కడ.

జాతివికాసం, దేశసౌభాగ్యం విద్యావంతులమీద ఆధారపడి ఉంటుంది. "The prosperity of a country depends, not on the abundance of its revenues, not on the strength of its fortifications, nor on the beauty of its public buildings; but it consists in the number of its cultivated citizens, in its men of education, enlightenment and character" అని మార్టిన్ లూథర్ అన్నాడు అందువల్ల హైదరాబాదు రాష్ట్రంలో ప్రజల మానసిక వికాసంగాని, రాజకీయ చైతన్యంగాని

3. తెలంగాణాలో జాతీయోద్యమాలు పుట. 44.

వారిని విద్యావంతులుగా తీర్చిదిద్దడంమీద ప్రధానంగా ఆధారపడి ఉందని అప్పటి తెలుగుపెద్దలు భావించారు. ప్రజలలో విద్యాభివృద్ధి కలిగితే సమస్యల సదవగాహనం, పరస్పరభావ వ్యక్తీకరణం, సంఘీభావం, జాతీయచైతన్యం, దేశస్వాతంత్ర్యం, స్వయం పరిపాలనశక్తి, న్యాయాన్యాయ వివేచనం, అభ్యుదయంమీద విశ్వాసం క్రమంగా కలుగుతాయని తలంచారు. జేమ్స్ ఎ. గార్ఫీల్డ్ అన్నట్లుగా 'Next in importance to freedom and justice is popular education, without which neither freedom nor justice can be permanently maintained' తెలంగాణంలో తెలుగువారికి అప్పుడు స్వాతంత్ర్యం ఎలాగూ లేదు; సాంఘికన్యాయం కరువైపోయింది; ఇక మాతృభాషలో విద్యాభ్యాసమన్నా లేకపోతే పై రెండూ సాధించే అవకాశమే సున్న. విద్యావ్యాప్తిలో మాతృభాషకు ప్రాధాన్యం ఇవ్వబడింది. ఎందువల్లనంటే-మేలుకోవలసింది ప్రజలు. అందరికీ అందుబాటులో ఉండేది మాతృభాష. ప్రతివాడికీ తల్లిమీద లాగా తన భాషమీద కూడా ఆదరాభిమానాలు ఉంటాయి. మాట్లాడటం ఉగ్గుతోనే వస్తుంది; కాస్త కృషిచేస్తే చాలు వ్రాయటం చదవటం కూడా సులభంగా వస్తాయి. అవగాహనశక్తి. అభివ్యక్తిశక్తీ అధికమౌతుంది పత్రికలు చదవగలడు, దేశస్థితిని తెలుసుకోగలడు, తాను పెదగగలడు; పదిమందికి తన అభిప్రాయాన్ని చెప్పి ఒప్పించగలడు. సాంఘిక, సాంస్కృతిక చైతన్యానికి సాధనంగా నిలవగలడు. జాతివికాసం అప్పుడు సులభతరమౌతుంది. ఈ దృష్టిలో తెలంగాణలో మొదట గ్రంథాలయోద్యమం మొదలైంది. గ్రంథాలయం మౌన విద్యాలయం. పదిమంది ఒకచోట చేరి ప్రపంచాన్ని చదువుతారు; విజ్ఞానాన్ని పంచుకుంటారు, సాహిత్యాన్ని ఆస్వాదిస్తారు, సంఘీభావానికీ, సాహిత్యారాధనకూ దేవాలయం లాంటిది గ్రంథాలయం. తెలుగువారి కప్పట్లో కావలిసింది ఆ రెండూను. 'అన్ని విధములగు నౌన్నత్యము నలవడజేయ నత్యవసరమగు సంఘీభావము, పూర్వచరిత్రను గూర్చిన గౌరవమును, భావిభాగ్యోదయ విషయమున విశ్వాసమును తెలుగువారి హృదయక్షేత్రములం దంకురింపనిచో మృతతుల్యులుగా నున్న వీరి భావి సంతానము గతి యేమి కావలయును?' (తెలుగు పత్రిక) అని మాడపాటి హనుమంతరావు పంతులుగారు అప్పట్లో బాధపడినారు.

తెలంగాణంలో ఈ శతాబ్ది ప్రారంభంలో గ్రంథాలయోద్యమం ద్వారా, ప్రజావిజ్ఞానానికి తోడుపడే గ్రంథాల ప్రచురణంద్వారా తెలుగువారిలో జాతీయ

చైతన్యాన్ని తీసుకొని రావటానికి ప్రయత్నించిన ప్రముఖుల్లో అగ్రగణ్యులు శ్రీ కొమర్రాజు వెంకట లక్ష్మణరావు పంతులుగారు. "హైదరాబాదు నగరమున 1901వ సంవత్సరమున స్వర్గీయ శ్రీ కొమర్రాజు వెంకట లక్ష్మణరావు ప్రోత్సాహముతో శ్రీ కృష్ణదేవరాయాంధ్ర భాషా నిలయము స్థాపితమైనది. ఈ ప్రయత్నమున లక్ష్మణరావుగారి సహచరులుగా నిలచి పనిచేసినవారు శ్రీ మునగాలరాజాగారు, మరియు స్వర్గీయరావిచెట్టురంగారావుగారు. కృష్ణదేవరాయాంధ్ర భాషా నిలయమును తెలంగాణమందే కాక, సకలాంధ్రమందును మొట్టమొదటి గ్రంథాలయముగా పేర్కొనవచ్చును. తెలంగాణమున హనుమకొండ మొదలైన పట్టణాలలో 1901 నుండి 1910 వరకు మరికొన్ని గ్రంథాలయాలు లక్ష్మణరావుగారి ప్రోత్సాహమున స్థాపితమైనవి. ఈ కాలముననే విజ్ఞాన చంద్రికా గ్రంథమండలి కూడ హైదరాబాదులో స్థాపితమైనది. విజ్ఞాన చంద్రికా గ్రంథమండలిని ఆంధ్ర తెలంగాణాల మధ్య దృఢమైన సాంస్కృతిక బంధముగా ఏర్పాటుగావించిన లక్ష్మణరావుగారే విశాలాంధ్ర ఉద్యమానికి కూడ పునాదులు వేసిరని చెప్పవచ్చును. హైదరాబాదులో ఆంధ్రోద్యమము ఈ విధముగా ఈ శతాబ్ద ప్రారంభమున వైజ్ఞానికోద్యమముగా పరిణమించింది, ఆనాడు గ్రంథాలయోద్యమముద్వారా తెలంగాణమును ప్రబోధించిన వారిలో కీ. శే. ఆదిపూడి సోమనాథరావు, కీ. శే. మైలవరపు నరసింహశాస్త్రి గారలను ప్రత్యేకముగ స్మరించవలసియున్నది. శేషాద్రి రమణకవుల 'నిజాంరాష్ట్ర ప్రశంస" అను ఖండకావ్యమును ప్రత్యేకముగ పేర్కొనవలసియున్నది".[3] సోమనాథరావుగారప్పటి ఆంధ్ర భాషాయోష దీనస్థితిని చిత్రించిన యీ పద్యం చూడండి.

'అచ్చ తెనుంగు కబ్బమున కాదిపదంబయి పొల్చుభాగ్యమున్
హెచ్చుగఁ గన్న దేశ మిది యే దురదృష్టమొ యాంధ్రభాష నే
డిచ్చట సొంపు నింపు చెడి హీనదశార్తినిఁగుందె నక్కటా !
అచ్చపు టాంధ్రపుత్రులకు నందఱకున్ తలవంపు లౌనటుల్!

పొన్నికంటి తెలగనార్యుని అచ్చతెనుగు కావ్యం పుట్టిన తెలంగాణంలో స్వచ్ఛమైన తెలుగు పలుకుబడికి కరువై పోయినందుకు కవి విచారాన్ని వ్యక్తం చేశాడీ పద్యంలో. మైలవరపు నరసింహశాస్త్రిగారు మాతృభాషాభ్యసనాన్ని మానవద్దని తెలుగు వారికి ప్రబోధం నిర్వహించారు.

---

• తెలంగాణలో జాతీయోద్యమాలు. పుటలు 46-47.

'పరభాష లభ్యసింపఁగ వచ్చు హెచ్చుగా
  మాతృభాష నదేల మానవలెను?
ద్రవ్యంబు గడియించు దారి చూడగవచ్చు
  మాతృభాష నదేల మానవలెను?
పరమర్మ భేదనోపాయంబు గనవచ్చు
  మాతృభాష నదేల మానవలెను?
సఖ్యమార్గంబునఁ జరియింపగావచ్చు
  మాతృభాష నదేల మానవలెను?

మానరాదని మన మభిమాన ముంచి
గారవించిన మనతల్లి గౌరవంబు
సూర్యచంద్రుల త్రోవలు సురిగెనేని
సురిగిపోవునె భువి నాంధ్రసూనులార!''.

హైదరాబాదులో ప్రారంభమైన గ్రంథాలయోద్యమ ప్రభావం అప్పట్లో హనుమకొండలో ఉద్యోగం చేస్తున్న హనుమంతరావు పంతులుగారి మీద పడి, రాజరాజ నరేంద్ర గ్రంథాలయ స్థాపనకు ప్రేరేపించింది. పంతులుగారి ప్రజా జీవితానికది ప్రాతిపదికగా నిలవటమే కాకుండా భావిజీవితానికి ప్రస్తావనగా పరిఢవిల్లింది. ఆదిరాజు వీరభద్రరావుగారు—పంతులుగారి హనుమకొండ నివాస కాల ప్రాముఖ్యాన్ని యిలా పేర్కొన్నారు-"అప్పుడు హనుమకొండలో ముఖ్యముగా మూడుద్యమములు ప్రజల నుర్రూత లూగించుచుండెను. మొదటిది ఆంధ్ర భాషావికాసోద్యమము. రెండవది సంఘసంస్కరణోద్యమము. మూడవది రాజకీయోద్యమము. ఈ మూడు ఉద్యమములందును అభిమానపూరితులయి హనుమంతరావుగారు మిత్రులతో సహకరించి కృషి సల్పసాగిరి. శ్రీ హనుమంతరావుగారు తమ యుత్తర జీవితమునందు ఈ యుద్యమత్రయ సంసిద్ధి కొరకే తమశక్తి త్రయమును వినియోగించి ధన్యజీవులయిరి".[4] పంతులుగారి ప్రజాజీవితాన్ని ప్రస్తావించవలసివచ్చినప్పుడు ఈ మూడు ఉద్యమాల త్రివేణీ సంగమం ముప్పేటగా సాగుతుందనే విషయం గమనింపదగిన అంశం.

---

4. మాడపాటి హనుమంతరావు జీవితచరిత్ర, పుట 17-18.

## 2

పంతులుగారి ప్రజాజీవితంలో కనబడే మూడు ఘట్టాలను ఈ విధంగా భావించవచ్చు. మొదటిది వికాసదశ; రెండవది ఉద్యమదశ; మూడవది నిర్మాణదశ. ఈ విభాగం ప్రధాన వివక్షతో చేసిందే. విషయ విశ్లేషణకు తోడ్పడేది మాత్రమే. ఒక్కొక్క దశలో మిగిలిన దశలు అంగాలుగా భాసించే అవకాశం లేకపోలేదు.

వికాసదశలో ప్రధానంగా కనవచ్చే అంశాలు: గ్రంథాలయోద్యమం, రచనావ్యాసంగం, ఆంధ్ర జనసంఘ నిర్వహణం. హనుమకొండలోని రాజరాజ నరేంద్ర గ్రంథాలయం మంచి పఠనాలయంగా కూడా ప్రజల నాకర్షించింది. విలువైన గ్రంథాలతోపాటు, దిన వార పక్ష మాస పత్రికలు చదువరుల అందు బాటులోకి వచ్చినవి. పఠనాసక్తి ప్రజల్లో పెరిగింది. ఉపన్యాస కార్యక్రమాలు వినోద విజ్ఞాన చర్చా కార్యక్రమాలు కూడ గ్రంథాలయంలో జరిగేవి. వంగ రాష్ట్ర విభజనంవల్ల కలిగిన ఉద్యమం, బిపిన్ చంద్రపాలు ఉపన్యాసాలవల్ల కలిగిన ఆంధ్ర యువకులోని ఉత్సాహం, స్వదేశోద్యమం, విదేశవస్తు బహిష్కారం, వివిధ రాజకీయార్థిక నైతిక సమస్యల సమాలోచనం, ఇండియన్ నేషనల్ కాంగ్రెస్ కార్యకలాపాలు, ఈ గ్రంథాలయం ద్వారా తెలుగువారికి తెలుస్తుండేవి. హనుమంతరావు పంతులుగారు ఈ గ్రంథాలయంద్వారా ప్రపంచ చరిత్రకు, భారతీయ సంస్కృతి వికాసానికి సంబంధించిన గ్రంథాలను ఎన్నో చదివారు. ఒక నాయకునికి కావలిసిన విజ్ఞానసారం హనుమకొండలోనే హనుమంతరావుగారు సంపాదించారని చెప్పవచ్చునేమో !

1912లో పంతులుగారు హైదరాబాదుకు వచ్చిన తరువాత శ్రీ కృష్ణ దేవరాయాంధ్ర భాషా నిలయం వారి సేవలకు నోచుకున్నది. 1914-15 సంవత్సరాలలో వారాసంస్థకు కార్యదర్శిగా పనిచేసి భవన నిర్మాణానికి ధన సేకరణంచేశారు. రావిచెట్టు రంగారావుగారి ధర్మపత్ని లక్ష్మీనరసమాంబగారు పంతులుగారి ప్రోత్సాహంతో నాల్గువేల రూపాయలు విరాళంయిచ్చి భవనానికి అంకురార్పణం చేశారు. ఆంధ్ర భాషా నిలయం గ్రంథాలయంగా పైకి కన

వడినా అప్పటిలో ఆంధ్రులకందరికీ ఆశాకిరణం; సమావేశ మందిరం; చర్చా సదస్సు! ఒక్కొక్కసారి రాజకీయ సమాలోచనలకు రహస్యమందిరం-అలా హైదరాబాదు రాష్ట్రాంధ్రోద్యమ చరిత్రలో ఆయువు పట్టైన పాత్రను నిర్వహించింది. ఇన్ని బహుళ ప్రయోజనాలను సాధించి, జాతి జీవితంలో భాగమైన గ్రంథాలయం తెలుగు దేశంలో అరుదంటే సత్యదూరం కాదేమో! పంతులుగారు పరమపదించేవరకూ ఆ గ్రంథాలయం వారి మాటను సుగ్రీవాజ్ఞగా తల దాల్చినడిచింది. ఆయనకు ప్రియమైన సంస్థల్లో అది యొకటి. వీరి సహాయాన్ని పొందిన మరికొన్ని గ్రంథాలయాలు :- బాలసరస్వతీ ఆంధ్ర భాషా నిలయం, వేమన ఆంధ్ర భాషా నిలయం. గ్రంథాలయాలే కాక నీలగిరిపత్రిక, తెనుగు పత్రిక, మొదలైన పత్రికలు వారి అభిమానాన్ని చూరగొన్నాయి. గోలకొండ పత్రిక, సుజాతపత్రిక వీరి సహాయసహకారాల్ని, రచనల గౌరవాన్ని పొందాయి.

పంతులుగారి సేవారంగం ఒక్క తెలుగువారికే అంకితం కాలేదు. రాష్ట్రీయులందరికీ సంబంధించిన వివిధ ఉద్యమాలతో, సంస్థలతో కూడ వారికి సంబంధం ఉండేది. 'గస్తీ నిషాన్ తిర్పన్' ప్రకటన ప్రతిఘటన సంఘానికి కార్యదర్శిగా, స్టేట్ రిఫారం అసోసియేషన్, కాంగ్రెస్ కమిటీ, హిందూ మహాసభల కార్యవర్గ సభ్యుడుగా. జీవరక్షా ప్రచారిణీ సంఘం, హిందూ సంఘ సంస్కారసభ, ఆది హిందూ సేవాసమితి, ఆర్యసమాజం, బ్రహ్మసమాజం, దివ్యజ్ఞాన సమాజం మొదలైన సంస్థలకు హితవరులుగా-ఎన్నో సంస్థలకు ఎన్నో హోదాలతో, ఎంతో సహాయం చేశారు. పంతులుగారి దృక్పథంలో నిలిచింది ప్రజాచైతన్యం. సమాజంలో వివిధ సంస్థలుండవచ్చు. వాటి ధ్యేయాలూ వేరు కావచ్చు. కాని, విజ్ఞాన వికాసం, రాజకీయ స్వాతంత్ర్యం ప్రజలందరికీ కావలిసిందే. ఆ పిలుపుకు ఆ సంస్థలన్నీ వేదికలే. ఆ వేదికల మీద తన పాత్రను ఆ ప్రయోజనానికి నిపుణంగా ఉపయోగించుకొనేవారాయన. పూసలో దారంలాగా అందరి మనసుల్లో దూరేవారు. అందరినీ ఆకట్టుకునేవారు. అందువలన అందరికీ వారే నాయకుడైనారు. ఆదిరాజు వీరభద్రరావుగారు వారి సర్వసమ్మతమైన నాయకత్వాన్ని యిలా అభివర్ణించారు-'సకల జన సమ్మతుడయిన పురుషపుంగవుడు శ్రీవారొక్కరే. కారణమేమి? శ్రీవారి నిష్కల్మషమైన చిత్తము, స్వార్థరహితమైన చింత; స్వచ్ఛమయిన ఆదర్శములు. శ్రీవారి

యాదర్శములను ఒజ్జబంతిగా పెట్టుకొని పలువురు ప్రయత్నింపసాగిరి. అట్టి వారి పొరపాట్లను గణింపక ప్రోత్సాహవాక్యములే పలుకుచుండిరి.[5]

పంతులుగారి గొప్పతనం తాము ప్రజాసేవకు అంకితమై అహోరాత్రాలు కృషిచేయటంలోనే లేదు, తమవలె ఉత్సాహంతో సేవారంగంలోదూకి ఉద్యమాన్ని ముందుకు తీసుకుపోయే సమర్థుల్ని తయారుచేసి కార్యరంగాన్ని శక్తిమంతంగా రూపొందించటంలో కూడా ఉంది. కీ.శే. సురవరం ప్రతాపరెడ్డిగారు పంతులుగారిలో ఉన్న ఈ విశిష్ట నాయక గుణాన్ని 'ప్రబుద్ధాంధ్ర' లో యిలా కీర్తించారు-"వీరిలో ఒక గొప్ప లక్షణము కలదు. ప్రజాసేవకులను, వ్రాయసకాండ్రను గుర్తించుటలో వీరికి పక్షిచూపు (eagle's eye) కలదు. అట్టి వారిని జారిపోద మన్నను జారిపోనీయక తమ దృక్పథమునందే యుంచుకొని ప్రోత్సాహపరచి రంగములోనికి లాగుచుందురు. సహాయకులను, అనుయాయులను సిద్ధము చేసికొనుట నాయక లక్షణములలో ఒకటి." పంతులుగారు ప్రజాసేవలో రెండు శక్తిమంతమైన సాధనాలను గుర్తించారు. ఒకటి–కార్యకర్తలు; రెండురచయితలు. ఒకరు పని చేసేవారు; మరొకరు ప్రేరణ నిచ్చేవారు. ఈ రెండు తెగలవారిని ఎన్నికచేసి కార్యోన్ముఖులనుగా చేయటం వారి సూత్రధార లక్షణం. పంతులుగారిలో ఈ రెండు శక్తులూ ఉన్నాయి. వారు కలంపట్టి ప్రబోధించారు; కార్యరంగంలో దూకి తమతో పాటు వేలాది జనాన్ని నడిపించారు. **ఆరోజుల్లో తెలంగాణలో కలం పట్టిన వారందరికీ పంతులుగారు కులపతి; సేవానిరతి కల వారందరికీ సభాపతి!**

## 3

పంతులుగారి రచనావ్యాసంగం కూడా మొదట హనుమకొండలోనే ప్రారంభమైంది. ఉత్తమ రచయితకుండవలసిన అర్హతలన్నీ వారి కున్నాయి. తెలుగు, ఉర్దూ, ఫారసీ, ఇంగ్లీషుభాషల్లో రచనచేసే శక్తి ఉంది; హిందీ మహారాష్ట్రి భాషా సాహిత్యాలతో మంచి పరిచయముంది. దానికి తోడు హృద్యమైన పద్యరచన చేసే ఒడుపూ ఉంది; సరళ సుందరమైన గ్రాంథికభాషలో వచన రచనచేసే నేర్పూ ఉంది. అయితే, అంతటి శక్తిని ఏవిధంగా రచనావ్యాసంగంలోకి తీసికొని రావాలి అన్నదే అప్పటికి వారికి గల ప్రశ్న. వస్తుతః పంతులు

5. మా. హ. జీ. చరిత్ర. పుట 82.

గారు భావాంబర వీథుల్లో విహరించి, స్వాప్నిక జగత్తులకు రూపకల్పనంచేసే మనః ప్రవృత్తి కలవారు కారు. వారి జీవితం సమాజ సమస్యలతో ముడిపడి పోయింది. సమాజస్పృహ లేని సాహిత్యాన్ని వారు భావించలేక పోయారు. అందులో ఒక విధంగా హనుమంతరావు పంతులుగారికి ప్రేరణ కల్పించినది— ఒకవైపు కొమర్రాజు వారి సాహిత్య దృక్పథమూ, మరొకవైపు కందుకూరి వీరేశలింగం పంతులుగారి సాహిత్యదృష్టీ అని పేర్కొనవచ్చు. కొమర్రాజు వారు చారిత్రక దృష్టితో రచనలు సాగించినవారు; వారి విజ్ఞానచంద్రికా గ్రంథమాలలో వెలువడిన ప్రచురణలూ, ముఖ్యంగా వారి హిందూ మహాయుగము, మహమ్మదీయ మహాయుగము అన్న గ్రంథాలు పంతులుగారి దృష్టిని బాగా ఆకర్షించినాయి. గత చరిత్ర వైభవం చాటే గ్రంథాలు, ఆదర్శ మహాపురుషుల జీవితచరిత్రలూ సమకాలీన సమాజానికి ఒక నూత్నోత్సాహాన్ని కల్పించగలవన్న దృక్పథం పంతులుగారికి ఏర్పడింది. మరొకవైపు - వీరేశలింగం పంతులుగారు వివిధ సారస్వత ప్రక్రియల్లో సంఘసంస్కరణ శంఖా రావాన్ని పూరిస్తున్నారు. ఆ పద్ధతి పంతులుగారిని ఆకర్షించింది. వీరేశలింగంగారి రచనల్లో ఎంతో వైవిధ్యముంది. అనువాద నాటకాలు, నవలలు, ప్రహసనాలు, పత్రికా వ్యాసాలు, చర్చాగ్రంథాలు, స్వీయచరిత్ర, కవులచరిత్ర, కావ్యాలు— ఇలా ఎన్నో శాఖల్లో వారి సాహిత్యకృషి సాగింది. నవ్యసాహిత్య యుగ కర్తగా వారు ప్రస్థానభేరి మ్రోగించారు. వీరేశలింగం పంతులుగారి రచనల్లో హనుమంతరావుగారికి ప్రేరణ కల్పించింది వారి పత్రికారచన, వ్యాసరచన అని చెప్పాలి. వితంతూద్వాహం. ప్రౌఢా వివాహాలు, వర్ణాంతర వివాహాలు, సర్వమానవ సౌభ్రాతృత్వం, వేశ్యానిగ్రహణం, సంఘదురాచారాలు, సంఘైక్యం, మతసహనం, ఏకేశ్వరోపాసనం—మొదలైన ఎన్నో విషయాలమీద వీరేశలింగం పంతులుగారు వ్రాసిన వ్యాసగ్రంథ రచనావ్యాసంగం హనుమంతరావుగారిని ఉత్తేజపరిచింది. ఆ పంతులుగారి స్త్రీజనాభ్యుదయ సేవాదృక్పథం ఈపంతులు గారి ప్రజాసేవా రంగంమీద ప్రబల ప్రభావం వేసింది. వారి నవలా రచన ప్రక్రియ పంతులుగారిచే కథా రచనకు ప్రోత్సాహం కల్పించింది. అంతకంటె ముఖ్యమైన విషయం—సాంఘిక ప్రయోజనాన్ని సాధించవలసి వచ్చినప్పుడు పద్యంకంటె గద్యం శక్తిమంతంగా పనిచేయగలదన్న దృక్పథంలో వీరేశ లింగంగారు కవితారంగంలో కంటె వచనరచనా రంగంలోనే తమకృషిని

విస్తారంగా సాగించి 'గద్య తిక్కన' బిరుదాంచితులైనారు. ఈ పంతులుగారు కూడ అందులో ఆ పంతులుగారి మార్గాన్నే అనుసరించారు.

హనుమకొండలో ఉన్నప్పుడు హనుమంతరావుగారు కవిత్వాన్ని వ్రాశారు. కొన్ని ఖండ కృతులను పత్రికల్లో ప్రకటించారు. రచయిత చిత్తవృత్తి రచనల్లో ప్రతిబింబిస్తుంది. శైలిలో మూర్తీభవిస్తుంది. పంతులుగారి ప్రవృత్తికి సూటిదనం, సారళ్యం సహజ లక్షణాలు, వారి కవితకు కూడ ఆ గుణాలు సంక్రమించాయి. వారి జీవితం నీతికి, సద్వర్తనకు. నిరాడంబరతకు దర్పణం లాంటిది. వారి కవితా వస్తు గ్రహణంలోను, చెప్పే రీతిలోను ఆ పద్ధతి కనబడుతుంది. శృంగారం జోలికి వారెన్నడూ పోలేదు. అలంకార ఆడంబరాలను ఎన్నడూ ఆదరించలేదు. చుట్టూ ఉన్న మంచిని ప్రోగుచేసే వారి స్వభావం తమకు సన్నిహితంగా ఉన్న పారసీ ఉర్దూ సాహిత్యాల్లోని ఆణిముత్యాల్లాంటి కవితాఖండికలను అనువదించే ప్రయత్నానికి దోహదం చేసింది. అందులోనూ వారి దృష్టి సూక్తిముక్తావళి వైపే ప్రసరించింది. అట్టి అనువాద కవితలో మచ్చుకొకటి మనవిచేస్తాము.

"హీనుల మహోన్నతపదవి కెత్తుటయును
ఎత్తి వారి యుపకృతి నాశించుటయును
స్వీయమాన ధనము బుగ్గి సేయుటగును
సర్పమును దనజేబులో సాకుటగును",

ఇది ఫిరదౌసీ పారసీ పద్యాని కనువాదం. ఇందులో—ప్రజల కోర్కెలను, శ్రేయస్సును గమనింపని నైజాం ప్రభుత్వాన్ని పరోక్షంగా అధిక్షేపంచేసిన గడుసుదనం కనపడుతుంది. హైదరాబాదు రాష్ట్రంలో తెలుగువారి దుస్థితినంతా సర్పమును తమ జేబులో సాకుచున్నట్లున్నదని వ్యంగ్యంగా వ్యాఖ్యానిస్తున్నట్లున్నది. ప్రజల దృష్టిని ప్రభుత్వ దురంతాలవైపు మళ్లించటానికి ప్రచ్ఛన్న సాధనంగా కవిత్వాన్ని ఉపయోగించి ప్రజాచైతన్యాన్ని మేల్కొల్పారు పంతులుగారు.

పంతులుగారి కవితాఖండాల్లో అనువాదాలే కాక స్వతంత్రాలు కూడా ఉన్నాయి. వారు తుఫానుమీద వ్రాసిన కవిత పేర్కొనదగింది.

"ఫలములచేత గొన్నిటిని బల్లవసంతతిచేత గొన్నిటిన్
నలలిత సౌఖ్యదాయి యగు ఛాయను గొన్నిటి వేవిధాల నీ
యిలను ననేకప్రాణుల కహీన సుఖంబిడు వృక్షరాజమున్
బలువడి పీకివైచితె తుఫానః వినాశము చేసివైచితే"

వేరూని నిలిచిన వృక్షరాజ్యాన్ని ఒకటివేళ్లలో పెరికివైచిన గాలివానను అధిక్షేపించే పద్యమిది. పైకి ప్రకృతి వర్ణనంలా కనపడినా ప్రతీకాత్మకంగా ప్రభుత్వపు కిరాతక చర్యల్ని గర్హించే ప్రవృత్తి ఉంది ఈ కవితలో. ఆ వృక్షరాజం తెలుగుభాషకు ప్రతీక. ఆ పద్యంలోని ప్రాణులు తెలుగువారు. తెలుగు భాషఅనే దొడ్డవృక్షం ఫలాలనిచ్చి కొందర్ని పోషించేదటః అంటే తెలంగాణంలో తెలుగుప్రజలకు మాతృభాషలో చదువుకుంటే పూర్వం ఆదరగౌరవాలుండేవనీ జీవనభృతి లభించేదనీ-నైజాం ప్రభుత్వంలో ఆ గతికి దుర్గతి పట్టించనీ భావం. చిగురాకులతో కొందరి నా వృక్షం సంతోష పెట్టేదటః చిగురాకులు తిని కొంగ్రొత్త గీతాలు పాడేవి కవి కోకిలలు. తెలుగు కవితకు ఆదరణలేదని దాని తాత్పర్యం. చాయ భద్రతకు ప్రతీక. భాషకు నిలువనీడ కూడా లేకుండ పోయిందని ధ్వని. వృక్ష వినాశాన్ని క్రమసుందరంగా వర్ణించటం భావ శిల్పం. ప్రతీకాత్మకంగా తెలుగుభాషకు-రాజభాష గౌరవం పోవటాన్ని. దానిద్వారా కవితా వ్యవసాయం కుంటుపడటాన్ని-చివరకు నిలువ నీడలేకుండా పోవటాన్ని కరుణరస స్ఫోరకంగా పంతులుగారు వర్ణించారు. వారి శైలి ఆబాల గోపాలానికి అర్థమయ్యే సారళ్యంతోనూ, ప్రసాదమధురమైన పాకంలోనూ ఉంటుంది. మంచి కవిత అల్లగలిగి యుండికూడా, కదనరంగంలాంటి ఆంధ్రోద్యమంలో దూకిం తరువాత, పద్యంకంటె వచనం ప్రజల సమస్యావగాహనకు బహుళంగా తోడ్పడుతుందని కావ్యరచనా వ్యాసంగాన్ని వదలుకున్నారు. పద్యగణాలకంటె ప్రజాగణాలకు ప్రాముఖ్యమిచ్చిన ప్రజాసేవకులు శ్రీ పంతులుగారుః

## 4

మాడపాటి హనుమంతరావుగారి వచనరచన్ని ప్రయోజన దృష్టితో మూడు వర్గాలుగా విభజింపవచ్చు. మొదటి వర్గం: అవగాహన కొఱకు వ్రాసిన గ్రంథాలు. రెండవ వర్గం : ఆలోచన రేకెత్తించేందుకు వ్రాసిన రచనలు. మూడవ వర్గం: అనురంజనం కోసం రచించిన కథలు. ఒక విధంగా

చూస్తే సారస్వతానికి పైన చెప్పిన మూడు ప్రయోజనాలూ ఉన్నాయి. వాటిని మూడు ప్రక్రియల ద్వారా ప్రజలకందించటం పంతులుగారి ప్రత్యేకత.

మొదటి వర్గం : 1. బంకించందు రచించిన 'ఆనందమఠ' కు ఆంధ్రానువాదం.
2. గ్యారీబాల్డి జీవిత చరిత్ర.
3. రోమకసామ్రాజ్య చరిత్రం.
4. క్షాత్రకాలపు హింద్వార్యులు.
5. మహాభారత సమీక్షణం

రెండవ వర్గం : 1. వలస పోయిన ఆంధ్రులు' వ్యాసఖండనము
2. నిజాం రాష్ట్రములో రాజ్యాంగ సంస్కరణలు.
3. వివిధాంశములపై పత్రికా వ్యాసములు.
4. పారసీ కవులపై వ్యాసములు.

మూడవ వర్గం : 1. 'మల్లికాగుచ్ఛము' కథల సంపుటి
2. మిగిలిన కథలు.

హనుమంతరావుగారు ఎంత సరళహృదయులో అంత స్వతంత్రులు. వారికి చర్వితచర్వణమన్న గిట్టదు. 'ఇంతవరకు తెలుగులో లేని పుస్తకములను వ్రాయవలయునే గాని ఉన్న పుస్తకములనే మరల వ్రాయుట శ్రీవారి యుద్దేశము కాదు. రామాయణమునకు నకలు రామాయణములు, భారతమునకు నకలు భారతములు, రుక్మిణీ కల్యాణమునకు నకలు రుక్మిణీ కల్యాణములు వ్రాయుట పుస్తకసంఖ్య పెరుగుటయేగాని వాఙ్మయమునకు పుష్టికాదని శ్రీవారి దృఢనమ్మకము'[6] పంతులుగారి యీ నిశ్చయం వారి గ్రంథాలు కొన్ని ప్రచురితం కాకపోవటానికి బలమైన కారణమై తారసిల్లింది. పంతులుగారి 'ఆనందమఠ' అనువాదం ప్రచురితం కాకపూర్వమే దొరసామయ్యగారి అనువాదం వెలువడటంతో వారాగ్రంథ ప్రచురణ కార్యక్రమాన్ని చేపట్టనే లేదు. అపారదేశాభిమానంతో ఇటలీదేశవిముక్తికై పోరాడిన ధీరుడు, దేశభక్తుడు గ్యారీబాల్డీ. ఆ మహాపురుషుని చరిత్రం పంతులుగారిని ఉత్తేజపరిచింది. దాన్ని ఎంతో అభిమానంతో అనువదించారు. బందరులోని ఆంధ్ర భాషాభివర్ధినీ

6. మా. హ. జీ. చరిత్రము. పుట 63

సంఘంవారు దాన్ని ప్రచురిస్తామని తీసికొని కొన్నాళ్లు తమవద్ద ఉంచుకొని, ఆ తరువాత కారణాంతరాలవల్ల దాని ప్రచురణ వీలుపడదని తిరిగి పంపి నారట. ఆ తరువాత కొన్నేళ్లకు శ్రీ కోలవెన్ను రామకోటీశ్వరరావుగారు 'గ్యారిబాల్డి' జీవితం మీద వ్రాసిన గ్రంథం ప్రచురితమైంది. అంతటితో పంతులుగారు తమ గ్రంథ ప్రచురణాన్ని మానుకొన్నారు. నడిచిన బాటలో నడవటం, తోచిన బాటగా పోవటం పంతులుగారి ప్రవృత్తికి పడని అంశాలు!

రోమక సామ్రాజ్య చరిత్రనుగూర్చి ఆదిరాజు వీరభద్రరావుగారిలా వ్రాసినారు: "ఇది చరిత్ర గ్రంథము. ఇది అసంపూర్ణ గ్రంథము. రచన ధారా శముగా నున్నది. ఆంధ్రభాషలో నింతవరకు రోమక సామ్రాజ్య చరిత్ర రచిత మయియుండలేదని తలంతును. కావున ఈ యుద్గ్రంథమును పూర్తిచేసి ఆ మహాసామ్రాజ్య చరిత్రజ్ఞానమును ఆంధ్రుల కలవడ జేయుదురు గాక! ఇది ముద్రితమయినచో ఆంధ్ర సరస్వతికొక నూత్నాభరణముగా ప్రకాశించగలదని మేము నమ్ముచున్నాము".

రావుబహద్దరు చింతామణిరావు వైద్యాగారు వ్రాసిన 'ఎపిక్ ఇండియా' (Epic India) అనే ఆంగ్ల గ్రంథంలోని అయిదువ్యాసాలకు అనుసరణం 'క్షాత్రకాలపు హిందార్యులు' అనే పంతులుగారి గ్రంథం'[7] ఆ గ్రంథ పీఠికలో పంతులుగారిలా వ్రాసికొన్నారు-" రావుబహద్దరు వైద్యాగారు మనదేశ చరిత్రములోని హిందూ మహాయుగమున నిపుణులు. వారి రచనా విధానమును అద్వితీయమని నా విశ్వాసము. చారిత్రక వాఙ్మయము చదువు వారందరికి ఎక్కువ యుత్సాహము గొలుపునది కాదు. అట్లయ్యు కీ. శే. కొమర్రాజు లక్ష్మణరావు ఎం. ఏ., గారి వలెనే శ్రీ వైద్యాగారును చరిత్రను మనోహర ముగా నొనర్చుటయందు సమర్థులు. వీరు ఆంగ్లమున రచించిన గ్రంథములలో ముఖ్యములు 'మహాభారత సమీక్షణము', (Mahabharata-a criticism), రామాయణ సమస్య (The Riddle of Ramayana) 'హిందూదేశ క్షాత్ర యుగము (Epic India), 'హిందూ మహాయుగము యొక్క మధ్యకాల చరిత్ర' (History of of Medeaval Hindu India) అనునవి. ఇవి

---

7. కృషి ప్రచారిణీ గ్రంథమాల ప్రచురణము. సంపాదకుడు: పువ్వాడ వెంకటప్పయ్య (1927)

యన్నియు విజ్ఞాన ప్రదములును, మనోహరములును, పరిశోధనా పూ
లును నగుగ్రంథములు. ఆంధ్ర సోదరులు వీనిని పఠించినచో అనేక
విషయముల నెఱుగగలరు. పైవానిలో 'మహాభారత సమీక్షణము' అన
మును నా వలన తెనిగింపఁబడినది. దీనిలోని కొన్ని అధ్యాయములు
భారతి' (మచిలీపట్నము), 'ఆంధ్రాభ్యుదయము' (హనుమకొండ), 'దే
(వడ్డెపల్లి) మాసపత్రికలలో ప్రకటితములైనవి. తక్కిన గ్రంథముల న
గున వ్రాయదలచితినిగాని, అవకాశము లభింపక పోయెను...రావు
వైద్యాగారి గ్రంథమున క్షాత్రయుగమునాటి ఆర్యులను గూర్చి తెల్పు
లింకను ఎన్నియో కలవు. అవియు తెనుగున ప్రకటింపబడినచో, పేద
ఆంధ్ర చారిత్రిక వాఙ్మయమునకు కొంత పుష్టి కలుగుననుట నిశ్చ
'గ్రంథాలయ సర్వస్వ' ప్రకటన మాగిపోవుటతో, నాకు నీ గ్రంథ విష
తెనిఁగించు నుత్సాహము అగిపోయెను. ఇందులకు నే నెంతయు
చున్నాను".

చరిత్ర అధ్యయనం గతంలోని గొప్పదనాన్ని, సత్యాస
తెలుసుకొని వర్తమాన చరిత్రను మహోజ్జ్వల భవిషత్తు వైపు నడిపిం
తోడుపడుతుంది. Miguel De Cervantes అందుకే ఇలా అ
"For historians aught to be precise, truthful and
unprejudiced, and neither interest nor fear, hatre
affection, should cause them to swerve from the
of truth, whose mother is history, the rival of
the depository of great actions, the witness of w
past, the example and instruction of the pr
the monitor of future". మాడపాటి హనుమంతరా
స్వయంగా తానొక సమకాలీన చరిత్రను సృష్టించే చైతన్యానికి నా
వారు. వారికి సత్యాన్వేషణ దృష్టిని, గతవైభవ ప్రశస్తిని, చారిత్రక
దృక్పథాన్ని కల్పించింది చారిత్రక రచనలమీద ఉన్న ఆసక్తి. వారు
గా తెలంగాణా ఆంధ్రోద్యమ చరిత్రకర్తలు. ఆ విషయాన్ని ముందు
టాము. చారిత్రక రచనలు వారు చేయటంలో గల ప్రధాన ప్రయోజనం
పఠనంవల్ల తెలుగు వారిలో వర్తమాన భవిష్యచ్చరిత్రలను నిర్మించుకొ

ద్దీపన శక్తి యేర్పరచటమే. ప్రపంచ నాగరికతల చరిత్ర పఠనం వర్తమాన జీవిత వర్తనానికి చుక్కాణి వంటిదని పంతులుగారి ఉద్దేశ్యము.

పంతులుగారి అనువాదరచన చదువుతున్నప్పుడది అనువాదమని అనిపించక పంతులుగారి స్వీయరచనగా పఠితలకు భాసిస్తుంది. ఒక భాషలోని భావాన్ని పలుకుబడిని స్వాయత్తం చేసుకొని తన భాషలో భావాభివ్యక్తి చేయగల సామర్థ్యం ఉత్తమానువాదకుని కుంటుంది. పంతులుగారికి బహుభాషలలో ఉన్న అధికారం, సాహిత్య రచనలో ఉన్న సామర్థ్యం, వారి అనువాదానికి దేశీయతను, స్పష్టతను, ప్రసన్నతను ప్రసాదించింది. ఉదాహరణకు కొన్ని వాక్యాలను ఉటంకిస్తాను-'ఆ కాలపు స్త్రీలు సైతము రెండు వస్త్రములనే ధరించుచుండిరని తోచుచున్నది. అయినను వీరి వస్త్రములు పురుషుల వస్త్రములకంటె నెక్కువ పొడుపుగా నుండెడివి. కట్టుకొనబడు వస్త్రము శరీరోర్ధ్వ భాగమును గూడ-అనగా భుజముల వఱకు-గప్పియుంచుచుండెను. చేతులను మాత్రము దానితో కప్పుకొనక విడిగా నుంచుచుండిరి. గుజరాతు, బంగాళము, మద్రాసు, దక్కనులలోని స్త్రీలు నేటికిని అట్లే తమ చీరెలఁ గట్టు కొనుచున్నారు. ఉత్తరీయము తలపైనఁ గప్పుకొనుచు సమయము వచ్చినప్పుడు దానిని ముసుగుగా వేసుకొనుచుండిరి. ఉత్తర హిందుస్థానమందిప్పటికిని స్త్రీలు ఉత్తరీయమును విధిగా ధరించుచుందురు. దక్షిణ హిందూదేశమందు ఇప్పుడు వాడుకలో నున్న చీరెలు పొడుపుగా నుండుటవలన వేరే యుత్తరీయము అనవసరమయినది. ఉత్తర హిందుస్థానమున ఇప్పటివలెనే పూర్వమునగూడ స్త్రీలు బయటకుఁ బోవునపుడు మాత్రమే యుత్తరీయమును ధరించుచుండిరి".[8]

పంతులుగారి 'క్షాత్రయుగమునాటి హింద్వార్యులు' అను గ్రంథంలో నాటి ఆర్యులు ధరించే ఉడుపులను గురించీ, వారి ఆహారవిహారాలను గురించీ, వివాహ పద్ధతుల గురించీ, సాధారణ రాజ్యాంగ స్థితిని గురించీ, భూగోళశాస్త్ర జ్ఞానాన్ని గురించీ క్రమంగా అయిదు వ్యాసాలున్నని. ఇవి ఒక విధంగా నాటి సాంఘిక చరిత్రాంశాలను సమీక్షించేవే. పంతులుగా రిట్టి వ్యాసాలను తెలుగులోనికి అనువదించటంవల్ల కీ.శే. సురవరం ప్రతాపరెడ్డిగారికి ఆంధ్రుల సాంఘిక చరిత్ర రచించాలన్న ప్రేరణ కలిగి ఉండవచ్చును. అందువల్ల ఆంధ్రుల సాం

8. క్షాత్రయుగమునాటి హింద్వార్యులు-పుట 5.

షిక చరిత్ర రచనా ప్రక్రియకు కూడా పంతులుగారి ప్రేరకులని ఊహించ వాస్తవదూరం కాదేమో!

పంతులుగారి రచనలోని రెండో వర్గానికి చెందినవి ప్రధానంగా వ్యాసా ఇవి ముఖ్యంగా సమకాలీన హైదరాబాదు రాష్ట్రి రాజకీయ పరిస్థితుల తెలుగువారి స్థితిగతులను, గ్రంథాలయోద్యమ వికాస విశేషాలను, స్త్రీ ః భ్యుదయాంశాలను, ఇతర సాంఘిక సాంస్కృతికాంశాలను సమీక్షించేః కనపడుతున్నవి. వారి వ్యాసరచననుగూర్చి ఆదిరాజు వీరభద్రరావుగ వెలిబుచ్చిన అభిప్రాయం అమూల్యమైంది. "శ్రీ హనుమంతరావుగారు ప్రా వ్యాసాల సంఖ్య గణనాతీతము. పత్రికా రచనయందు వారు సిద్ధహస్తులు. వ నిమ్మళముగ విషయమును ప్రతిపాదించి మెల్లగ సాగనిచ్చుచుందురు. ః విమర్శలు నిప్పులు గ్రక్కుచుండవు. శాంతస్థాయిలో నుండి కొంత వ్యం భావ సమన్వితములయి యుండును. కఠిన వాక్యము లుండనే యుండ అయినను ప్రతిపక్ష వాదమును నిర్మూలనము చేయుటలో, ప్రతిపక్షి నుడికిం టలో వీరి పదజాలము శక్తిమంతములయి యుండును". పంతులుగా రేయ మును తీసికొని రచించినా విషయప్రతిపాదనం సహేతుకంగా, ససాక్షికం ఉండేటట్లు చూచేవారు. వారి వకీలువృత్తిలోని అనుభవం వాదవిషయాన్ని ప్ర పాదించటంలోనూ, ప్రపంచించటంలోనూ చక్కగా తోడ్పడింది. సోపప మైన సమస్యా చర్చ ప్రజలకు విజ్ఞానాన్ని కల్పించటమే కాకుండా, వ్యాస తా ర్యంమీద ప్రమాణబుద్ధిని కల్పిస్తుంది. వారి వ్యాస రచనా విధానాన్ని తెలు కోవటాని కనువుగా ఈ క్రింది ఉదాహరణాన్ని పొందుపరుస్తున్నాన వ్యాసం; "నిజాం రాష్ట్రంలో యాంధ్రులు".

"బ్రిటీషు హిందూదేశీయులకు లేని చిక్కొకటి ఈ రాజ్యమువారి నె ర్కొనుచున్నది. అదేదన, అచ్చట ఇంగ్లీషు, దానితో దేశభాష ఈ రెండే క లసి యున్నవి. ఇచ్చట ఆ రెంటితోబాటు ఉర్దూకూడ వచ్చిననే కాని ః సాగదు. కనుక ఇచ్చటి విద్యార్థి మాతృభాష నేర్చుకొనుటయందు కొంత కా మును, ఉర్దూ నభ్యసించుటయందు కొంత కాలమును, ఇంగ్లీషుకొరకు వ కొంత కాలమును గడపవలసి యున్నాడు. అనగా, అచ్చటి విద్యార్థికి ఉన్న విద్యాభ్యసన విషయమునగల సౌకర్యము ఇచ్చటి విద్యార్థికి లేదు."

"ఇక వీరి మాతృభాషను గురించి విచారింతము. నిజాం రాజ్యమునందు తెలుగుభాష మాట్లాడువారి సంఖ్య 63, 67, 578. వీరిలో వెనుక జెప్పిన ప్రకారము, మరాట్వాడీ జిల్లాలలోని వారికి తెలుగు నేర్చుకొను అవకాశమే లేదు. తెలుగు జిల్లాలలోని వారి స్థితి వీరి స్థితికంటె కొంచెము నయముగానే యున్నను, మొత్తముమీద తృప్తికరముగ మాత్రము లేదు."

"ఆరంభవిద్య తెలుగున నేర్పు పాఠశాలలు చాల గ్రామములలో నున్నవి. కాని, అంత మాత్రమున జనులకు లభించు జ్ఞానము స్వల్పము. మధ్యమ పాఠశాలలో తెలుగు రెండవభాషగా జదువుకొనుటకు మాత్రము వీలున్నది. హైదరాబాద కళాశాలలలో తెలుగు బోధించు నేర్పాటులు గలవు గాని దానివలన గూడ లాభము లేదు. దానికి కారణములు రెండు గలవు మొదటిది: విశ్వవిద్యాలయం వారు విధించిన క్రొత్త నియమముల స్వభావము. రెండవది: ఆ రాజ్యమువారు ఉర్దూనో, పారసీనో రెండవభాషగా తీసికొనగోరుచుండుట. మధ్యమ విద్యా పరీక్షలో తెలుగు రెండవభాషగా తీసికొనువారి సంఖ్య దినదినము సన్నగిల్లు చున్నది. ప్రాత పద్ధతిని సంస్కృతమందును, ఆంధ్రమునందును కొంత పాండిత్యము గలవారు కొందరు అక్కడక్కడ, ముఖ్యముగా వరంగల్లు, కరీంనగరము, నల్లగొండ జిల్లాలలో నున్నారు, కాని, వారి కెట్టి ప్రోత్సాహమును లేక పోవుట చేతను, గ్రంథరచనచేత నిప్పటివారి నాకర్షించు యోగ్యత వారియందు లేనందువలనను, ఏ మూలనో కూర్చుండి, యక్షగానములనో, హరికథలనో, శతకములనో వ్రాసికొని బ్రతకవలసిన వారైనారు".

"ఇక ఇచ్చటి తెలుగువారు మాట్లాడు భాషను చూడుడు! ఈ సందర్భమున ఇంకొకమాట చెప్పవలసియున్నది. ఈ రాజ్యములోని తెలుగుభాషకు ఉత్తరమునను, కొంతవరకు పశ్చిమమునను మహారాష్ట్రభాషతోను, కొంత పశ్చిమమునను, దక్షిణమునను కన్నడభాషతోను సమ్మేళనము కలుగుచున్నది. తక్కిన యన్ని భాగములలోను, అందు ముఖ్యముగా పట్టణములందు ఉర్దూ భాషా సంపర్కము వీడజాలనిదియై యున్నది. ఈ కారణముల వలన పైన జెప్పిన ప్రాంతముల వారి యాచార వ్యవహారములందు వలెనే వారి భాషయందు గూడ ఎన్నియో మార్పులు వాటిల్లినవి. ఆదిలాబాద, నిజామాబాద ప్రాంతములందు నివసించువారు సంభాషించునపుడు మహారాష్ట్ర భాషలోని శబ్దములును, వాని యపభ్రంశ స్వరూపములును తరచుగా వచ్చుచుండును. 'ఇదేమ్రామాయ్,

రొండు, దివ్సలు, ఆయె, నిశెకుపోవు, ఇదేమి దైవము, ఏనుగు సొండెము, ఏదిరా? కాకకు మావుశీ భేటీ కాలేదు? ఈ వాక్యములు వారి భాష కుదాహరణములు. ఇక మహబూబు నగరులోను, అత్రాపుబల్దా జిల్లాయొక్క పశ్చిమ భాగములోను నివసించువారి భాష కర్ణాటకుల సంపర్కమువలన కన్నడ భాషా శబ్దములతో నిండియుండును. 'మాసణ్ణ పిల్లకు పెసరబేడలు పట్టవు. ఘొడ్డు పిల్ల బేకైనంత తింటది' ఇవి రెండవవారి భాషకు దృష్టాంతములు. ఇక ఉర్దూతో సంభవించిన కలయికచేత తెలుగుభాషకు కలిగిన దురవస్థ చూచి తీరవలసినది. కాని ఇట్టిదని చెప్పుట కష్టము".

'ఈ మొకద్దమాలో చలాయించిన కార్రవాయి అంతా జాలీది. సాహెబు జిలాజాయ మౌక్వాకు పోయి తనక్కీచేసి కైఫియ్యతు రాసినాడుగదా కె, ఫరీకు దావా బిల్కూలు నాజాయజు, అయిందా యీతౌర్న కార్రవాయి చేసిన సూరతులో మాఖూలుతదారుకు చేయటం కాగలదు. ఫఖ్తు మర్కూంచందు 16 పర్వర్థి సన్ తేరాసౌ బారా ఫసలి'.

"ఇది స్వల్పంగా వీరిభాష కుదాహరణము. ఇక తూర్పువైపున అదృష్టవశమున ఉత్తర సర్కారులవారి సంసర్గము భాషను కొంతవరకు బాగు చేసినది. ఈ స్థితులు గ్రామ్యభాషావాదులు గమనింపదగినవిగా నున్నవి."[9]

ఈ వ్యాసఖండోదాహరణంవల్ల పంతులుగారి రచనా విధానాన్ని గ్రహింపవచ్చు. సూటిగా, సోదాహరణంగా, సంగ్రహంగా, శక్తిమంతంగా విషయాన్ని ప్రతిపాదించటం, చక్కని అవగాహనతో కూడుకున్న విశ్లేషణం, ఒక అంశం నుండి మరో అంశాన్ని కమ్మచ్చు లాగినట్లు తీసి కదను తొక్కించటం, తేటగా చెప్పినా నిండుగా సంతరించటం వ్యాసరచనలో ప్రధానాంశాలుగా గోచరిస్తున్నవి. పంతులుగారు ఉపన్యసించినా, వ్యాసం వ్రాసినా ఒకే విధంగా ఉంటుంది. రచనలోని సరళగ్రాంథికం వారి ఉపన్యాసంలోకూడా ధారాళంగా ప్రసరిస్తుంది. వచనానికీ, వ్రాతకూ అభేద ప్రతిపత్తికలగటం వక్తలకుండే విశిష్ట లక్షణం. నిండుకుండలా ఉండే పంతులుగారి వ్యక్తిత్వంలో యీ గుణం దండిగా ఉన్నదని వారి అభిభాషణాలు విన్న సహృదయులు సరళంగా ఊహింపగలరు.

9. తెలంగాణం (18 వ్యాసాలు) రెండవభాగం—సంకలనం: శ్రీ వట్టికోట ఆళ్వారుస్వామి. పుటలు: 9–11.

పంతులుగారి వ్యాసాలన్నీ ఒక సంపుటంలో ప్రచురింపబడితే ఇరవైయో శతాబ్ది పూర్వార్ధంలోని తెలంగాణ చరిత్రను రచించటానికి అపార విషయ సంపత్తి లభిస్తుంది.

సుజాత పత్రికకు పంతులుగారు పారసీక కవులను గురించి వ్రాసిన వ్యాస పరంపర చాల విలువైనది. వీరేశలింగంపంతులుగారు తెలుగుకవుల చరిత్ర వెలయిస్తే హనుమంతరావు పంతులుగారు పారసీక కవుల చరిత్రను తెలుగులో ప్రసరింపజేశారు. ఈ విధంగా పారసీక కవులను సాహిత్యాన్ని తెలుగువారికి పరిచయం చేసిన మొదటివారు పంతులుగారనే చెప్పాలి.

పంతులుగారి రచనల్లో మూడవవర్గానికి చెందినవి వారి కథలు. వీరు 1910 నుండే కృష్ణాపత్రికలో కథలను వ్రాసి ప్రచురించటం మొదలుపెటారు. అందువల్ల ఆంధ్రకథానికా వాఙ్మయచరిత్రలో ఆ స్రవంతికి ఆది పురుషుల్లో ఒకరుగా వారు నిలిచారు.

తెలుగులో కథాప్రక్రియ 1910లో పుట్టిందని విమర్శకులు భావిస్తున్నారు. అంతకు పూర్వం వీరేశలింగం పంతులుగారు కథలు వ్రాసినా వాటికి ప్రక్రియా గౌరవాన్ని విమర్శకులివ్వటం లేదు. " పంతులుగారు చేసిన రచనలు చాలా వరకు ఉపదేశాత్మకమైనవి. మన సమాజంలో పాతుకొని ఉన్న దురాచారాల్ని, మూఢ విశ్వాసాల్ని వెల్లడి చేయటానికి ఆయన చేపట్టిన ప్రక్రియల్లో కథకూడా ఒకటి. అయితే దాన్ని ఒక ప్రత్యేక సాహిత్య ప్రక్రియగా స్పృహలో ఉంచుకొని పెంపొందించటం మాత్రం జరగలేదు. జొనాథన్ స్విఫ్ట్ రాసిన 'గలివర్స్ ట్రావెల్స్' ప్రేరణతో 'సత్యరాజాపూర్వ దేశ యాత్రలు' రాశారాయన. అందులో గుదిగుచ్చిన కథలు ఎందరినో ఆకర్షించాయి. 'ఈసప్స్ ఫేబుల్స్'ను 'ఈసపు నీతికథలు' అన్న పేరుతో అనువదించడంకూడా జరిగింది. ఈ విధంగా పంతులుగారు రాసిన కథలు ప్రయోజన పరంగా ప్రాముఖ్యం పొందాయే తప్ప ప్రక్రియా పరంగా ప్రాధాన్యం పొందలేక పోయాయి'[10]

10. కథానికా వాఙ్మయం - శ్రీ పోరంకి దక్షిణామూర్తి (ఆం. ప్ర. సా. అ. ప్రచురణ) పుట. 7-8.

తెలుగుకథా జగత్తులో వెలసిన కాశీ మజిలీ కథలూ, చా
కథలూ, తాతాచార్యుల కథలూ, పంచతంత్ర కథలూ. కథా సరి
కథలూ, రాజాస్థాన కథలూ ఈకోవకు చెందేవే. అయితే 1910లో
అప్పారావు పంతులుగారు కథానికా రచనకు పూనుకోవటంతో కథా
చరిత్రలో నూత్నాధ్యాయం ప్రారంభమైంది. అప్పారావుగారి కథలు ప్ర
శిల్పానికీ, ఆధునికతకూ పేరు పొందాయి. వారు వేసిన బాట తరువ
రచయితలకు మార్గదర్శకమైంది. వారి కథా రచనా వైశిష్ట్యాన్ని
శ్రీ కె. వి. రమణారెడ్డిగారిలా వ్రాశారు." ముందు మార్గదర్శకుడంటు
డెవ్వడూ లేకుండా, స్వయం ప్రభువులాగా అప్పారావు తెలుగు క
స్వకపోల కల్పితంగా సృష్టించాడు. పుక్కిటి పురాణాల, కల్పనా క
డొల్లలను తొలగించి తెలుగుకథకు తనదని చెప్పుకోదగిన మూర్తినీ,
ర్తినీ కల్పించాడు. ఆరడజను కంటె లోపుగా వున్న ఈ కథలు ఒకొ
ఒక్కొక్క దీపస్తంభంలా నిలిచి తరువాతి కథకులకు యావన్మ
మార్గాన్ని గమ్యాన్నీ కాంతిమయం చేసినట్లు తెలిసివస్తుంది. . . ఆ
కనిపించే సమస్యలు గూడా ఇరవయ్యో శతాబ్దానికి చెందడ మనేది మ
గమనింపదగిన విషయం. వాటికి అప్పారావు సూచించిన పరిష్కార
ఈనాటికీ సాహసోపేత మనిపించేంత కొత్తవి కావటం. . . కొత్తద
కాలపు ఇటీవలి తనమే కాదు; కొత్తదనమంటే నిజమైన తాత్పర్యం
త్వమే. . . తన కావ్య రచనలో కనిపించే సమకాలిత్వం కంటె క
కనిపించేది నిజంగా ఎక్కువ".[11] అప్పారావుగారి మొదటి కథ 'దిద్
1910 ఫిబ్రవరి 'ఆంధ్ర భారతి'లో ప్రచురింపబడింది.

ఈ పూర్వరంగంతో మాడపాటి హనుమంతరావు పంత
"హృదయశల్యం' కథ 1910లో కృష్ణాపత్రికలో ప్రకటితమైంది.
వాత పంతులుగారు మొత్తం పదమూడు కథలు రచించారు. ఆ
హృదయశల్యము, రాణీసారంధా, ముసలిదాని యుసురు, నేనే, అగ్నిగు
నాడు నీ పంతము నేడు నా పంతము, ఆత్మార్పణము అన్నకథలు
గుచ్ఛ' మనే పేరుతో కథా సంపుటిగా మచిలీపట్టణం సరస్వతీ

11. మహోదయం-పుటలు 256-257.

హైదరాబాదులో ఆణా గ్రంథమాలలో పన్నెండవ కుసుమంగా ప్రచురింపబడి నాయి. మిగిలిన నాలుగు కథలూ–'న్యాయమా?' 'ఎవరిది తప్పు' 'ఇక కావలసిన దేమి' 'నిజమేనా'- సుజాత, భారతి, శారద మాసపత్రిక సంపుటాలో నిలిచి యున్నాయి. ఈ కథలో 'హృదయశల్యము' 'నేనే' అనేవి పంతులుగారి స్వకపోల కల్పితాలు. మిగిలినవి ప్రఖ్యాత నవలా రచయిత 'ప్రేమ్‌చంద్' రచించిన ఉర్దూ కథలకు అనుసరణాలు.

కథానికా రచయితగా పంతులుగారి పాత్రను పరిశీలించేటప్పుడు ఈ క్రింది విషయాలను దృష్టిలో ఉంచుకోవలసి వస్తుంది,

1. గురజాడ అప్పారావుగారి లాగా హనుమంతరావు పంతులుగారు సమకాలీన సాంఘిక సమస్యలను చిత్రించే స్పృహతో కథారచనకు పూనుకోలేదు.

2. రచనా కౌశల్యంలోనూ, ఇతివృత్త నిర్మాణంలోనూ ఉత్తర హిందూస్థానంలో ప్రఖ్యాతి గాంచిన ప్రేమచంద్ కథలను తెలుగులోనికి తీసికొని రావడానికి ప్రయత్నం చేసిన వారిలో పంతులుగారు ప్రథములు. అందువల్ల వినోదానికి మాత్రమే కాక, ప్రక్రియా దృష్టితో పంతులుగారు కథలు వ్రాశారన్నది గమనింపదగిన అంశం.

3. పంతులుగారు సొంతంగా వ్రాసిన కథల్లో గార్హస్థ్య జీవితంలో భార్యాభర్తల మధ్య ఉండే ప్రణయాన్నే ప్రధాన వస్తువుగా స్వీకరించారు. అనుమాన పిశాచం భర్తకు పట్టి పీడిస్తుంటే భార్యపడే వేదనను, దాని సుఖ సమాప్తిని చిత్రించే కథ 'హృదయశల్యం'. పీనాసి భర్తలో ప్రణయ బీజాలను మొలకెత్తించి వితరణాన్ని మేల్కొల్పి, ప్రణయలేఖ వ్రాసిన ప్రియురాలిని నేనేనని నిరూపించే యిల్లాలి కథ 'నేనే'. కాబట్టి దాంపత్య జీవిత చిత్రణం పంతులుగారి సొంత కథలో ఉన్న విశేషం.

4. ప్రేమచందు కథలో చారిత్రక వాతావరణం ఉన్న కథల్ని పంతులుగారు సగానికి పైగా ఎన్నుకున్నారు. వారి 'హృదయశల్యం' కథగూడా కాకతిరుద్రమ కాలానికి సంబంధించిందే. దానికి కారణం వారికి చారిత్రక గాథలమీద ఉన్న ప్రీతియే ముఖ్యకారణం కావచ్చు.

5. ప్రేమచంద్ రచనలో సాంఘిక వస్తువులున్న కథలో మానవత్వానికీ, ఋజువర్తనానికీ, నీతికీ ప్రాధాన్యమున్న వానిని ఎన్నుకోవటంలో పంతులుగారి జీవిత దృక్పథం బలమైన పాత్రను నిర్వహించి ఉంటుంది.

6. పంతులుగారి కథలో ఏదో విధంగా స్త్రీలకు సంబంధించిన సమస్యలకు ప్రాధాన్యం కనపడుతుంది. స్త్రీ జనాభ్యుదయంలో వారికున్న శ్రద్ధ దానికి కారణం కావచ్చు.

పంతులుగారు సొంతంగా కల్పించిన కథలో చివరి వరకు ఉత్కంఠను పోషించే రచనాశిల్పం ప్రస్ఫుటంగా కనపడుతుంది. అది ఆయన స్వభావంలో కూడా ఉన్నదనిన్నీ, అదే వారి కథలో ప్రతిబింబించిందనీ ఊహించటానికి ఆదిరాజు వీరభద్రరావుగారి కథనం ఒకటి మనకు తోడ్పడుతుంది. అది హనుమంతరావుగారు అడ్వొకేటుగా ప్రాక్టీసు చేస్తున్న రోజులలో జరిగిన సంఘటన—

"ఒకానొక యభియోగములో హనుమంతరావుగారు ప్రతివాది పక్షమునను, మాదిరాజు రామకోటీశ్వరరావుగారు వాది పక్షమునను నిలుచుండిరి. రామకోటీశ్వరరావుగారు హనుమకొండనుండి వచ్చి హనుమంతరావుగారి యింట్లోనే బసచేసిరి. ఇద్దరు వకీళ్లును కలసి కోర్టుకు వెళ్ళిరి. కోర్టుకు వెళ్లుచు హనుమంతరావుగారు 'నీలగిరి' పత్రిక సంపుటమును వెంట దీసికొనిపోయిరి. త్రోవ పొడుగునను ఆ పత్రిక పుటలను త్రిప్పుచు ఏదో చదువుచున్నట్లు నటింప సాగిరి. 'బావా! కోర్టుకుకూడా నీలగిరి పత్రిక యెందుకయ్యా! ఇచ్చట గూడా దేశసేవ గొడవయేనా?' అని రామకోటీశ్వరరావుగారు ఉల్లసమాడిరి. హనుమంతరావుగారు చిరునవ్వు నవ్వి యూరకుండిరి. ఆనాటి వాయిదాకు ప్రతివాది సాక్షులు రాలేదు. అందుచే వాదిపక్షమున తీర్పు చెప్పవలసినదిగా రామకోటీశ్వరరావుగారు కోర్టు నెదుట బలముగా వాదించిరి. ఆ వాదమునకు ప్రత్యుత్తరముగా హనుమంతరావుగారు లేచి 'పెను తుఫానువీచి, చెరువులు తెగి, నదులు పొంగి యంతయు జలమయ మయియున్న సమయములో, పంచభూతము లాగ్రహించి బీభత్సము చేయుచున్న సమయములో, ఏ మానవునకయినా ప్రయాణావకాశము లుండగలవా?' యని ప్రశ్నించిరి. తన కక్షిదారుడును ఈ భయంకర పరిస్థితుల మూలకముగనే రాలేకపోయెననియు. తన కక్షిదారువాదము దుర్బల

నడిపిస్తూ హెచ్చరిస్తూ ఉండటం వారి కథలో కనిపించే మరో లక్షణం. ఇటు వంటిది చిలకమర్తి, వెంకట పార్వతీశ్వరకవులు మొదలైన వారి రచనలో కన బడుతుంది. ఆధునిక కథా శిల్పంలో అది ఉత్తమమైన శిల్పంగా విమర్శకులు భావింపరు. అయినా ఆంధ్ర కథా రచనం ప్రాథమిక దశల్లో ఉన్న చారిత్ర కాంశాన్ని అది సూచిస్తుంది.

గురజాడ లాగా హనుమంతరావుగారు సమకాలీన సాంఘిక సమస్య లను కథలో చిత్రించక పోవటంతో వాటికి నవ్యత్వం లేదని విమర్శకులు భావించవచ్చు. కాని, సార్వకాలీనమైన విలువల్ని పోషించే స్త్రీ పాత్రలు కేంద్రంగా కథలను సృష్టించి, ప్రయోజనంతో పాటు ప్రక్రియా గౌరవానికి పంతులుగారు కృషి చేశారన్న విషయంలో విప్రతిపత్తి ఉండబోదు.

# 5

1921 నవంబరు 12వ తేదీన జరిగిన ఆంధ్ర జనసంఘ స్థాపనం మాడపాటి హనుమంతరావు పంతులుగారి జీవితంలోనే కాక హైదరాబాదు రాష్ట్రాంధ్ర జన జీవితంలో కూడా ఒక పెద్ద మలుపు. హైదరాబాదులో వివిధ భాషలవారూ, వివిధ ప్రాంతాలవారూ నివసిస్తూ వివిధ సంస్కృతులకు కూడలి స్థానంగా రూపు దిద్దారు. అందులో తెలుగు వారిదే అగ్రతాంబూలం కాని, ఆ నాడు హిందూ సంస్కారసభలో తెలుగు వక్త మాట్లాడుతున్నప్పుడు ఇతర భాషలవారు గేలిచేయటం జరగటంతో తెలుగువారికి కనువిప్పయింది. అంద రితో కలిసి ఉన్నా తమ వ్యక్తిత్వాన్ని సంఘీభావాన్ని బలంగా నిర్మించుకో పోతే సాటి భాషీయులలో కూడా నవ్వులపాలు కావలసి వస్తుందని తెలుగు నాయకులు గుర్తించారు. ఆనాటి రాత్రే ఆంధ్ర జనసంఘ స్థాపనం జరిగింది. హనుమంతరావు పంతులుగారు ప్రధాన కార్యదర్శిగా ఆ సంఘ భారాన్ని భుజస్కంధాలపై ఎత్తుకున్నారు.

సంఘ స్థాపనంతో ఆంధ్రోద్యమానికి అంకురారోపణం జరిగింది. పంతులుగారి ప్రజ్ఞతో అది శాఖోపశాఖలుగా విస్తరిల్లి రాష్ట్రమంతా వ్యాపిం చింది. మూడు నాలుగేళ్లలోనే దాదాపు 50 ప్రాంతీయ సంఘాలు ఏర్పడినాయి. వాటిని సంఘటిత పరిచి కార్యక్రమాలను రూపొందించటానికి 1923లో హనుమకొండ సమావేశంలో 'నిజాం రాష్ట్రాంధ్ర జన కేంద్రసంఘం' రూపొం

దింపబడింది. తెలుగు తేజం సాంఘిక విద్యారంగాలలోనే కాక, రాజకీయ సాంస్కృతిక కార్యరంగాలలో కూడా ఆ సంఘంద్వారా ప్రసరించింది. 1924లో నల్లగొండ, 1925లో మధిర, 1928లో సూర్యాపేటలో కేంద్రసంఘం సమావేశాలు నిర్వహించింది. మధిర సమావేశం ప్రథమ గ్రంథాలయ సభగాను, సూర్యాపేట సమావేశం రెండవ గ్రంథాలయ సభగానూ కార్యక్రమాలను విస్తరింప చేసింది. సూర్యాపేటలో ఆంధ్ర యువకసభ, సంఘ సంస్కార సభ, ఆంధ్ర మహిళాసభ, వైశ్యయువజన సభలాంటి అనుబంధ సంస్థల నిర్మాణం సాగింది. తెలుగువారు సమైక్యంగా ఒక ఉద్యమంలో ప్రవేశించి రాజకీయంగానూ, సాంఘికంగానూ, వైజ్ఞానికంగానూ, తమ సొంత ప్రతిపత్తిని రాష్ట్రంలో నిలుపుకోవటానికి ప్రయత్నాలు ప్రతిరంగంలోనూ ప్రారంభమయ్యాయి. ప్రభుత్వంవారికి ఈ చైతన్యం కన్నెర్ర కల్పించింది. మహారాష్ట్ర సోదరులకు, కన్నడిగులకు ఆంధ్రుల ఉద్యమ శంఖారావం మన శక్తియుక్తులను అవగాహనం చేసుకోవటానికి తోడ్పడింది. ఈ మహా చైతన్య వికాసానికి మూలస్తంభం శ్రీ మాడపాటి హనుమంతరావు పంతులు గారు.

వివిధ సంఘాల విస్తృతితో కార్యరంగం విశాలమైపోయింది. వాటిని ఒక వేదికమీద సంఘటితం చేయవలసిన అవకాశము ఏర్పడింది. తత్ప్రయత్నమే నిజాం రాష్ట్రాంధ్ర మహాసభ స్థాపనంగా రూపొందింది. ఆంధ్ర జన సంఘం ద్వారా జరిగిన కృషి దానికి పూర్వరంగమై ప్రవర్తిల్లింది. ఉర్దూ భాషలో మాట్లాడటమే నాగరికతగా భావించిన విద్యాధికులు తెలుగులో ఉపన్యసించటం ప్రారంభించారు. విద్యావంతులు సామాన్య ప్రజలతో కలిసి తెలుగు భాషా వికాసానికీ, సాంఘిక చైతన్యానికీ కృషి చేస్తున్నారు. పలువురు తెలుగు పత్రికలను కొని చదవటం ప్రారంభించారు. రచయితలు, కవులు, పత్రికలకు రచనలు పంపి తమ మనోభావములను వ్యక్తం చేస్తున్నారు. గ్రంథాలయోద్యమ ఫలితాలు ప్రజలలో అనతి కాలంలోనే కనిపించాయి. ఈ పూర్వరంగ ప్రవర్తనానికి సూత్రధారుడుగా పంతులుగారు చేసిన కృషి గణనీయం.

పంతులుగారి ప్రజాజీవితంలో రెండవ ఘట్టం ఉద్యమదశ. ఉద్యమమంటే ఈ అధ్యాయంలో ఆంధ్రోద్యమమే అనాలి. 1930 మార్చి మూడవ

తేదీన ప్రారంభమైన ఆంధ్ర మహాసభ పదునేడు సంవత్సరాలలో 13 స
నిర్వహించింది.

| | | | | | | |
|---|---|---|---|---|---|---|
| 1. | మొదటి ఆంధ్ర మహాసభ | | - | జోగిపేట | - | 1 |
| 2. | రెండవ | ,, | - | దేవరకొండ | - | 1 |
| 3. | మూడవ | ,, | - | ఖమ్మముమెట్టు | - | 1 |
| 4. | నాల్గవ | ,, | - | సిరిసిల్ల | - | 1' |
| 5. | ఐదవ | ,, | - | షాదునగర్ | - | 1 |
| 6. | ఆరవ | ,, | - | నిజామాబాదు | - | 1! |
| 7. | ఏడవ | ,, | - | మల్కాపురము | - | 1! |
| 8. | ఎనిమిదవ | ,, | - | చిల్కూరు | - | 1{ |
| 9, | తొమ్మిదవ | ,, | - | ధర్మవరము | - | 1{ |
| 10. | పదవ | ,, | - | హైదరాబాదు | - | 1{ |
| 11. | పదకొండవ | ,, | - | భువనగిరి | - | 1{ |
| 12. | పన్నెండవ | ,, | - | మడికొండ | - | 1{ |
| 13. | పదమూడవ | ,, | - | కంది | - | 1{ |

ఆంధ్ర మహాసభ కార్యక్రమాలు నల్లేరుపై బండిలాగా సాగినవి కావు. అడుగ
గునా ప్రభుత్వంవారు కల్పించే అడ్డంకుల్ని అధిరోహిస్తూ అధికక్రమ
ఉద్యమదీక్షతో ముందుకు సాగింపబడినవే. మాడపాటి హనుమంతర
పంతులుగారు సభకూ, ప్రభుత్వానికీ మధ్య రాయబారాలు సలిపి, అను
నించే ప్రభుత్వానికి, సభకూ రాజకీయాలకూ సంబంధంలేదని నచ్చచెపి
ప్రభుత్వోన్నతాధికారుల్ని సభల కాహ్వానించటం ద్వారానూ, ప్రభుత్వ వ
సాయ, పశుచికిత్స, వైద్యసహకారశాఖల ప్రదర్శనలు, ఉపన్యాసాలూ, చి
ప్రదర్శనలు ఏర్పాటు చేయటం ద్వారానూ వారికి విశ్వాసం కల్పించి మ
సభలు జరుపుకోవడానికి ప్రభుత్వానుమతి సంపాదిస్తూ ఉండేవారు. రెం
మహాసభ జరిగిం తరువాత ప్రభుత్వం 'గస్తీనిషాన్ తర్పన్' ను గట్టి
అమలుజరిపి రెండుమూడేళ్లు సభాసమావేశం కాకుండా అడ్డుకున్నది. ఆ స
యంలో పంతులుగారు సామమార్గాన్ని అనుసరించి ప్రభుత్వంతో ఉత్తరప్రత
త్తరాలు సలిపి, పోలీసుశాఖకు మహజర్లు పెట్టి ఆందోళన సలిపి, ఎట్లో అనం
ప్రయత్నం తరువాత సభాసమావేశానికి అనుమతిని సాధింపగలిగినారు. ఆ

పంతులుగారి కార్యదీక్షకును, కార్యసాధనోపాయ కుశలతకును నిదర్శనం. ఆ సన్నివేశాన్ని శ్రీ తిరుమల యస్. కృష్ణ శర్మగారు గోలకొండ పత్రికలో ఇట్లభివర్ణించారు.

"అదొక విషపు గడియ. హైదరాబాదు రాజకీయరంగముమీద కారు చీకటి కప్పియుండినది. ప్రజాపక్ష ఆందోళనముపై ప్రభుత్వపు అంగారదృష్టి పడి యుండినది. మొదలే మొగలాయి జనులు, అందులో పిరికి. ఈ పిచ్చుకలపై 'తిర్పన్‌గస్తీ' బ్రహ్మాస్త్రము ప్రయోగింపబడియుండెను. అది చాలదని సుగ్రీవాజ్ఞ యొకటి వెలువడెను. సభచేయుటకు రూ 2000 లు జామీ నియ్యవలెను. సభ ప్రభుత్వపు మనసుకు రాకయున్న జామీను 'జప్తు'. దేశము గడగడ వడకినది. నాయకుల కంటికి పిడుగుపడెను. కమ్మిన చీకటి మూడేండ్లకుగాని తొలగలేదు. ప్రజాందోళన అక్కడక్కడ పోరాడి సోలి చల్లారినది. వెలుగు ఆశను తగ్గించు నిరాశ అది. హఠాత్తుగ పత్రికలలో జనులొక దినము చదివిరి, "ఆంధ్ర మహాసభకు అనుమతి, జామీ అక్కరలేదు" లోకుల వ్రేళ్లు ముక్కుపై కెక్కినవి. ఈ అమావాస్య చంద్రుని నమ్ముటయే కష్టమాయెను శ్రీ హనుమంతరాయలు పట్టిన పట్టుకే ఆ కీర్తి. వారి కార్యసాధనా దీక్షాఫలమే అది. నిరంతరధారా ప్రవాహమునకు బండరాతి చట్టులూ పొడి పొడి అగును. నిజాము దేశపు రాజకీయ ప్రళయములో రావుగారు ఆంధ్ర మహాసభా వ్యవహారమును తమకడకు తీసికొనియుండుట మొగలాయి జనులకు ఒకరీతి జీవదానము, పునస్సృష్టి"[13]

చతుర్థాంధ్ర మహాసభకు మాడపాటి వారధ్యక్షులుగ నుంచిరి. హైదరాబాదులోని వారి నివాస గృహమైన 'ఆంధ్ర కుటీరం' నుండి సిరిసిల్లవరకు కార్లలో జరిగిన యాత్ర చారిత్రాత్మకమైనది. అఖిలభారత కాంగ్రెస్ అధ్యక్షులకు కాంగ్రెస్ సమావేశాల సందర్భంలో జరిగే గౌరవం వంటిది పంతులుగారికి జరిగింది. ఆంధ్ర మహాసభకు వెన్నెముకవంటి వారైన వారిపై ప్రజలకు గల అవ్యాజభక్తి విశేషాలు వెల్లువగా పొంగటంలో ఆశ్చర్యం లేదు. ఆ సభలో విద్యా పునర్నిర్మాణం, నిర్బంధ ప్రారంభ విద్య, ఆంధ్ర బాలికలకు మాతృభాషామూలమున ఉన్నత విద్య గరపటం, జాగీరుప్రజల హక్కులు, గ్రామ

13. మా. హ. జీ. చరిత్ర. పుట. 55.

పునర్నిర్మాణం, బాల్యవివాహ నిరసనం, తెలంగాణా రైతులకు సౌకర్యాలు, బలోతాదారుల కష్టాలు, స్థానిక స్వపరిపాలనం, నిమ్న జాత్యుద్ధరణం మొదలైన అంశాలమీద విలువైన ఇరవై అరు తీర్మానాలు ఆమోదింపబడినాయి. అధ్యక్ష పీఠంనుండి మాడపాటి వారు మాట్లాడుతూ ప్రభుత్వం విద్యాధికులు పాల్గొనే ఆంధ్ర మహాసభ కార్యక్రమాలమీద అనుమాన దృష్టిని ప్రసరించటం మాను కోవాలని విజ్ఞప్తి చేశారు. "ఈ దేశమునందు నవీనభావములు వ్యాపించుచున్నవి. ఇది తప్పదు. దేశములోని విద్యాధికులలో ముఖ్యముగా యువజనులయందు దేశ సేవాసక్తియు, ఆత్మగౌరవభావమును ప్రబలుచున్నవి. ఇట్టి సమయమున మహో త్కృష్టమగు విజ్ఞాన వ్యాపక కార్యమున ముందడుగువేయ యత్నించుచున్నారు. ఇట్టివారి సేవాసక్తిని అనుమాన దృష్టితో చూడకూడదు. వీరి యుత్సాహము ను వెచ్చించి, వారితో పనికొనుట యుత్తమ రాజనీతి యగును. వీరియందు ద్రోహబుద్ధి లేదని నేను ఘంటాపథముగా జెప్పగలను. ఇట్టి విద్యాధికులను ప్రభుత్వమువారు నమ్మవలయును. 'నమ్మకము లేనివారికి సుఖము లే' దను సామెతగలదు. నా యీవిజ్ఞప్తి దూరాలోచనముతోను, సానుభూతితోను గైకొన బడుగాక".

ఆంధ్ర మహాసభకు నాయకులై ఉద్యమాన్ని సాగిస్తున్న మాడపాటి వారు ఆంధ్రులపాలిటి అపరగాంధీ అనిపించారు. మాడపాటి హనుమంతరావు గారి జీవితచరిత్రకు ఆంగ్ల పీఠికవ్రాస్తూ ఆచార్య ఖండవల్లి లక్ష్మీరంజనంగారు పంతులుగారి వ్యక్తిత్వంలోని విశిష్టతను విశ్లేషించి నిరూపించిన విధం పేర్కొన దగింది. ఆయన పంతులుగారిలో సూచిన ముఖ్యాంశాలు :—

1. "Madapati Hanumantha Rao Garu is a miniature Gandhi, in a circumscribed area. The same love of action for the upliftment of fellowmen, the same patience and forbearance, the same incorruptibility in matters of Public Finance, the same shrewdness are seen in these two leaders of men"

2. "He was a doctor who knew his patient well. His prescriptions were, to all intents, most harmless.

They are the least revolutionary viz. libraries, schools, free Reading rooms, guilds of merchants and farmers and finally conferences which mainly dealt with social reform".

3. "Hanumantha Rao is a wonderful type of leader. He was always on the side of conservatism. He would be the last voter on a mild resolution, praying for establishment of Responsible Government, under the Nizam. He was all moderation and patience... We were reminded of the description by the Telugu Poet Tikkana Somayaji of the eldest Pandava brother Yudhistira in Mahabharata. He says 'The son of Dharma is all self-control. He is a mild tiger'[14] Madapati Hanumantha Rao appropriately answers to this description. Haste, bitterness, losing grip on the situation were unknown to him. This contributed to his eminent success in life."

అప్పటి నిజాం ప్రభుత్వంలో హోం సెక్రటరీగా ఉన్న నవాబ్ ఆలీ యావర్ జంగ్‌గారు పంతులుగారితో ఆంధ్ర మహాసభ కార్యక్రమాలను సమీక్షిస్తూ 'ఆంధ్ర మహాసభ ఆంధ్ర – తెలంగాణాల ఏకీకరణానికి దోహదమౌతుందేమోనని ప్రభుత్వం వారి అనుమానం' అన్నారట! అప్పుడు పంతులుగారు దానిని వారిముందు అంగీకరింపక పోయినా–అది కాలక్రమంగా దాచరాని సత్యమై పోయింది. అంటే విశాలాంధ్రోద్యమ బీజాలు ఆంధ్రోద్యమంలోనే ఉన్నాయని తాత్పర్యం.

---

14. 'అనలము పుట్టె జూదమున యప్పుడ యెంతయు జిచ్చుపెట్టి కాల్చిన యది నీ యుపేక్షయ; వశీకృత చిత్తుడు ధర్మసూతి మెత్తని పులి; యెల్లవారలు నధర్మము నీపయిఁబెట్టు నంతకు న్వినడును; గానడుం; బిదప నీకును నాకు మర్వల్పవచ్చునే'–ఉద్యోగపర్వము.

ఆంధ్ర మహాసభలో ఆరవ, ఏడవ, తొమ్మిదవ సభలు ప్రాముఖ్యాన్ని వహించాయి. 1937లో నిజామాబాదులో జరిగిన ఏ మహాసభలో ఆ సంస్థ కులమత వర్గ భాషా విచక్షణలు మాని రాష్ట్రంలో నివసిస్తున్న అన్నిభాషలవారి యొక్క అభివృద్ధికి కృ సంకల్పింపబడటమే కాకుండా, బాధ్యతాయుతమైన ప్రభుత్వ ధ్యేయమని తీర్మానించడమైనది. మొదటి నిర్ణయం ఆంధ్ర భాష నిరాశ కల్పించింది. క్రమంగా అది 1943 నాటికి ఆంధ్ర సారస్వ స్థాపనకు దారి తీసింది. రెండవ నిర్ణయం నాటి స్టేటు కాంగ్రెస్ ఐ మైన ప్రభుత్వం కోసం చేస్తున్న సత్యాగ్రహానికి సన్నిహితమై మహాసభ సభ్యులైన రావి నారాయణరెడ్డి, మందుముల రా జమలాపురం కేశవరావుగార్లు సత్యాగ్రహంలో పాల్గొని జై పోయారు. 1940లో మల్కాపురంలో జరిగిన ఏడవ సభలో ప్రభుత్వం ప్రవేశ పెట్టిన రాజ్యాంగ సంస్కరణలను బహి తీర్మానాన్ని శ్రీ రావి నారాయణరెడ్డిగారు ప్రవేశపెట్టగా మితవాది పాటి హనుమంతరావు, మందుముల నరసింగరావుగార్లు దాన్ని ప్ర కాని, తీర్మానం నెగ్గింది. ఆంధ్ర మహాసభలో యువతరానిక హెచ్చింది. ఆ వర్గానికి రావి నారాయణరెడ్డిగారు నాయకులు. 19 ధర్మవర సభల్లో మితవాదులు, జాతీయవాదులొక పక్షంగాను, మరొక పక్షంగానూ ఏర్పడిటం జరిగింది.

"భువనగిరి మహాసభ తరువాత ఆంధ్రమహాసభ రెండు చీలిపోయింది. ఒకటి జాతీయాంధ్రమహాసభ, రెండవది శ్రీ రావి గారి ప్రాబల్యము కలిగిన ఆంధ్ర మహాసభ. భువనగిరి మహాసభ రించిన ఆంధ్రనాయకులు 1945వ సంవత్సరమున మడికొండల ముల నరసింగరావుగారి అధ్యక్షతన పండ్రెండవ మహాసభ కా మహాసభకు శ్రీ కొండా వెంకట రంగారెడ్డిగారు పెట్టని కోటలై ఆంధ్ర పితామహ మాడపాటి హనుమంతరావు పంతులుగారి ఆశీస లభించినవి. బూర్గుల రామకృష్ణరావుగారి ఆశీస్సులు ఆ సభకు కీ. శే. జమలాపురం కేశవరావుగారు కూడ ఈ సభనే బలపర్చి నారాయణరెడ్డి వర్గమువారు పన్నెండవ ఆంధ్రమహాసభను ఈ

ఖమ్మం పట్టణములో జరిపిరి. ఈ విధముగ ఆంధ్ర మహాసభ రెండుగా చీలి పోయింది. తరువాత 1946లో కీ శే. జమలాపురం కేశవరావుగారి అధ్యక్షతన పదమూడవ మహాసభ మెదకుజిల్లా యందలి కంది గ్రామమున జరిగినది. ఇదియే తుట్టతుది ఆంధ్ర మహాసభ. వైజ్ఞానికోద్యమముగా ప్రారంభమైన ఆంధ్రోద్యమము బాధ్యతాయుత ప్రభుత్వమే తన ఆదర్శముగా నిర్ణయించుకొన్న ఉద్యమముగా పర్యవసించినది. కంది మహాసభ తరువాత ఆంధ్ర మహాసభ స్టేటు కాంగ్రెసులో లీనమయి, స్టేటు కాంగ్రెస్ ఆంధ్ర ప్రాంత సంఘముగా రూపొందినది ఈ స్టేటు కాంగ్రెస్ ఆంధ్రప్రాంత సంఘముయొక్క మొదటి సమావేశము 1947లో జడ్చర్లలో జరిగినది .హైదరాబాదులో పోలీసుచర్య జరిగినతరువాత సేటు కాంగ్రెస్, హైద్రాబాదు ప్రదేశ్ కాంగ్రెస్‌గా రూపొంది ప్రత్యేకముగ హైదరాబాదులో ఆంధ్ర ప్రాంతమునకు కాంగ్రెస్ కమిటి అవకాశము లేకపోయినది."[15]

ఖమ్మంలో కమ్యూనిష్టు వర్గంవారు ఆంధ్ర మహాసభను వేరే జరుపుకున్న తరువాత హనుమంతరావు పంతులుగారు ఆసంస్థకు కొంత దూరంగా ఉన్నట్లు కనబడుతున్నది ఈ విభేదములవల్లను, వృద్ధాప్యము వల్లను హనుమంతరావుగారు ఆంధ్ర మహాసభ సంబంధమును త్రెంపుకొని విచారపూరిత హృదయముతో, బాష్పపూరిత నయనములతో నీ విషమ పరిస్థితులను విలోకించుచుండిరి. శ్రీవారి అభిప్రాయము జాతీయవాదుల పక్షమున మ్రొగ్గువలజూపుచున్నను, యువకుల యుత్సాహమునకు కార్యదీక్షకు లోలోన సంతసించుచుండిరి. అనుభవము మీద క్రమేదులు సౌమ్యవద్ధతికి రాగలరను ఆశతోనుండిరి. ఇట్టి మహత్తరమయిన కార్యజాతమును సమాచరించుటకు శ్రీవారు పూనిన ఆయుధము 'ఓర్పుగుణము'. ఈ ఓర్పు గుణమొకటి యున్నచో, సవ్యముగ ప్రచారము సాగినచో, కాలమే సర్వకార్యములను చక్కబఱచునని శ్రీవారి సిద్ధాంతము" [16]

హనుమంతరావుగారి ఆంధ్రోద్యమ నిర్వాహణం నిజాం రాష్ట్రంలో మహారాష్ట్ర, కర్ణాటకోద్యమాల పుట్టుకకు మార్గదర్శకమైందని మహారాష్ట్ర నాయకులైన కాశీనాథరావు వైద్యా, కర్ణాటక నాయకులైన జనార్ధనరావు దేశాయిగార్లు 1945లో హైదరాబాదులో పంతులుగారికి జరిగిన పౌరసన్మానంలో

15. తెలంగాణలో జాతీయోద్యమాలు. పుటలు 57-58.
16. మా. హ. జీ. చరిత్ర. పుట 41.

పేర్కొన్నారు. అది ఆంధ్రోద్యమ జయంతి సందర్భంగా జరిగిన సభ. నాడు తెలుగువక్తను అవహేళన చేసినందుకు ప్రతిఫలంగా ఆంధ్ర మహా పుట్టింది. ఆ సభ చివరకు నవ్వుల నాప చేనుగా పండింది. నవ్వులవా నాణెమైన బాట చూపింది. ఆ బాటను చూపిన మార్గదర్శి, మహర్షి శ్రీ వ పాటి హనుమంతరావు పంతులుగారు. 'Great men are the gui posts and landmarks in the State' అన్న ఎడ్మండ్ బర్క్ వ లకు మాడపాటివారు మంచి ఉదాహరణం!

ఆంధ్రోద్యమానికి కర్ణధారులై నడిపించటం ఎంత గొప్ప విషయమో దాని చరిత్ర వ్రాయటం కూడా అంత గొప్ప విషయమే. మాడపాటి హ మంతరావు పంతులుగారు తెలంగాణా ఆంధ్రోద్యమ చరిత్రను రెండు స టాల్లో రచించారు. సమకాలీన ఉద్యమ చరిత్రను కన్నులకు కట్టేటట్లు చిత్రి టమే కాకుండా స్వీయాభిరుచులకు తావీయకుండా నిష్పాక్షిక దృక్పథం నిర్మించిన చారిత్రక సమీక్షా గ్రంథం అది. ఆంధ్రోద్యమ చరిత్ర లేందే లాంధ్ర చరిత్ర సమగ్రం కాదు. అట్టి ఉద్యమ చరిత్ర రచనకు పంతులు కంటే అర్హులు మరొకరు ఉండబోరు. అది ఒక విధంగా వారి జీవితచరి అని చెప్పవచ్చు. కాని వారు రచించిన వైఖరిలో ఆత్మ ప్రత్యయం కానరా తానా చరిత్రలో ఒక ప్రధానపాత్ర నిర్వహించినా, దానికంటె అతీతంగా బడి సాక్షిగా సారించిన చూపు అందులో కనపడుతుంది. సత్య కథనమే లక్ష్యంగా ఉన్నట్లు తెలుస్తుంది. అట్టి దృష్టి చరిత్రకర్తకు అత్యవసరము.

"ఈ చరిత్ర గ్రంథమును పరిశీలించిన యెడల ఆంధ్ర సోదర వాంఛలు, దేశభక్తి, కార్యచతురత, ఉపొంగులు, ప్రోత్సాహ నిరుత్సాహమ మున్నగునవి ప్రస్ఫుట మగుచుండును. అంతియేకాదు. నిజాం ప్రభుత్వం కుటిల రాజనీతి, నిరంకుశ పరిపాలనా విధానము, మతపక్షపాతము, ప్రజో మముల యెడగల విముఖత్వము, ఇంతయేల గ్రంథకర్త నిగ్రహముపీడి చె నట్లుగా, వారి 'అయోగ్యత, ప్రజల వాక్స్వాతంత్ర్యము నెడ వారి విద్వే భావము' చక్కగా విశదము కాగలదు."

"మఱియు, ఆంధ్ర మహాసభానుబంధములుగ నుండిన పెక్కు ఉ మములు సభలు, ప్రచారములు ఇత్యాదులు పరిపూర్ణముగ నిందు వర్ణితవ

టచే, ఈ గ్రంథ సౌందర్యము, యోగ్యత, ప్రయోజనము విస్తరించినది. ఇట్టి ఉద్యమ చరిత్రలు తెలుగుభాషలో లేవు". అని సంపాదకులు రచించిన పీఠిక లోని మాటలు ప్రత్యక్షర సత్యములు.

ఉద్యమాలు ఒక్క చేతిమీద నడవవు. కాని, ఒక కాలంలో ఒక మహా చైతన్యాన్ని సమాజంలో సృజించిన మహనీయు లుంటారు. వారిలో చుక్కలో చంద్రుడులాగా రాణించే మహాత్ములుంటారు. వారి కార్యదీక్షా వ్రతంతోనే ఉద్యమం సత్ఫలితాలను సాధిస్తుంది. చరిత్ర పురోగమిస్తుంది. "Men make history and not the other way round. In periods where there is no leadership, society stands still. Progress occurs when courageous, skillful leaders seize the opportunity to change things for the better" అన్న హెన్రీ యస్. ట్రూమన్‌గారి మాటలిచ్చట స్మరణీయాలు.

హనుమంతరావు పంతులుగారు తెలంగాణంలో ఒక నాయకతరాన్ని సృష్టించారు. అందువల్ల కూడా వారు పితామహులైనారు. సురవరం ప్రతాపరెడ్డి, బూర్గుల రామకృష్ణరావు. పులిజాల వెంకట రంగారావు, కొండా వెంకట రంగారెడ్డి, మందుముల నరసింగరావు, మందుముల రామచంద్రరావు, రావి నారాయణరెడ్డి, మాదిరాజు రామకోటీశ్వరరావు, బద్దం ఎల్లారెడ్డి, గడ్డం రామకృష్ణారెడ్డి, జమలాపురం కేశవరావు, బూర్గుల రామకృష్ణారావు గారలవంటి తెలంగాణా నాయకులు వీరి సహచరులుగా మండి పరిణతి సాధించిన వారే. పంతులుగారికి రాజాబహద్దర్ వెంకట్రామారెడ్డిగారి వంటి పరిపాలనదక్షుల ఆదరాభిమానాలు ఉండేవి. రాజకీయనాయకులతో పాటు ఎందరో సాహితీ పరులు, సంస్థా వ్యవస్థాపకులు, సంఘసేవకులు వీరి శిక్షణలో వ్యక్తిత్వాలను సంతరించుకొన్నారు. పంతులుగారు తెలంగాణంలో ఆంధ్రోద్యమానికి నారు పోశారు, నీరు పోశారు. అది పంటకు రావటం చూశారు; ఆ పండ్లను చూచి ఆనందించారు. వారి అదృష్టాన్ని శ్రీ ఒద్దిరాజు రాఘవ రంగారావుగారిలా సంస్తుతించారు.

'పలుకగా నేరని పత్రిక బుడుతల
**'కతత' యని మాటలాడ నేర్పి,**

వాక్రువ్వ నేరని పండితలోకము
గొమ్మెక్కి 'కో' యని కూయ నేర్పి,
వ్రాయగా జంకెడి పడుచుల కలముల
గిలుకుల దెసలంట గలువనెట్టి,
మదిలోని భావాళి మాటాడి వెలిబుచ్చ
విన్నపోయెడు వారి వెన్ను జఱచి

ఆంధ్ర సారస్వతము నిజామాంధ్ర సంఘ
మిటుల నెన్నిటినో గూర్చు ఘటికులందు
నొక్కరుడవయి మించితే నుక్కు మిగుల
రమ్యగుణ సాంద్ర! హనుమంత రాయచంద్ర!'

'నీవు నాటిన మొలకలు నీవు చూచు
చుండ గిలవేయు జూచు భాగ్యోదయంబె
నీకుఁగిగ్గె నదృష్టంబు నీదకాదె
ప్రాజ్య గుణధుర్య! హనుమంతరాయవర్య!". (షష్టిపూ...

## 6

హనుమంతరావు పంతులుగారు ఆంధ్రోద్యమానికే కాక తె...
ఆంధ్ర మహిళోద్యమానికి గూడా ఆరంభకులు. ఇందులో వీరేశలిం... గారు వారికి ఆదర్శమూర్తులు. పురుషుడు నేర్చుకొన్న చదువు సం... పనికి వస్తుంది; స్త్రీ నేర్చుకున్న చదువు సంప్రదాయాన్ని సృష్టిస్తుం... గాణంలో విద్యావ్యాప్తి కావాలని కంకణం కట్టుకుని గ్రంథాలయో... నడిపిన పంతులుగారు సమస్యలోని ప్రాణాన్ని పట్టుకున్నారు. చదు... షుడు సంఘసేవకు పూనుకొని జాతి వికాసానికి తోడ్పడుతుంటే, ...నాంధకారంలో మునిగి ఉన్నప్పుడు అతని కృషిలోని గొప్పతనాని... లేక పోవచ్చు; ఒక్కొకసారి పురుషుడికి అవరోధం కావచ్చు. స్త్రీ... అయ్యిందంటే ఆమె తననూ, తన పురుషుణ్ణి, తన సంతానాన్ని, తనచు... సమాజాన్ని వికాసవంతం చేయగలదు. స్త్రీ విజ్ఞానాన్ని వాత్సల్యంతో... స్నేహంతోను వ్యాప్తిచేయగలదు. ఒక స్త్రీ చదువుకున్నదంటే ఒక...

చటువుకున్న దన్నమాట: ఈసత్యాన్ని గుర్తించిన పంతులుగారు మహిళాభ్యుద యంకూడా సాధించినప్పుడే దేశాభ్యుదయంసార్థకమౌతుందని భావించి, ఆంధ్రో ద్యమ భాగంగా ఆంధ్ర మహిళోద్యమాన్ని ప్రారంభించటమే కాకుండా హైదరా బాదులో బాలికల విద్యావ్యాప్తికి అంకితమయ్యే విద్యాలయాలను స్థాపించి కృషి చేశారు. ఆంధ్ర మహిళాసభ సమావేశాలు ఆంధ్ర మహాసభ సమావేశాలలోనే జరుగుతూండేవి. స్త్రీ జన సమస్యలనిందు ప్రత్యేకంగా చర్చించి, తగిన నిర్ణ యాలను తీసికొని వాటిని అమలులో పెట్టటానికి కార్యకర్తలు కృషి చేస్తుండే వారు. వారి కందరికీ గురుపీఠం మాడపాటి హనుమంతరావుగారు. స్త్రీల సమా వేశాల ప్రాముఖ్యం, స్త్రీ విద్యావశ్యకత, విద్యాసంస్థల స్థాపనావశ్యకత, నిర్బంధప్రారంభోచిత విద్యావసరం, స్త్రీలకు వైద్యవిద్య, రోగులకు ఉపచారాలు చేసే నేర్పు ఉండవలసిన అవసరం, ఆరోగ్యవారాలు, శిశువారాలు జరుపవలసిన ఆవశ్యకతను ఈ సభలో చర్చించి నిర్ణయాలను తీసికొనేవారు. స్త్రీలలో వెనుక బడిన ఆచారంగా ఉంటున్న పరదా పద్ధతి వల్ల కలిగే నష్టాలు చర్చించి దాన్ని మహిళాసభ ఖండించింది. కళావంతుల్లో వివాహపద్ధతిని ప్రవేశ పెట్టాలనీ, వితంతూద్వాహాలను ప్రోత్సాహించాలనీ మహిళాసభ ప్రచారం చేసింది. మహి ళోద్యమంలో పాల్గొని పంతులుగారి దర్శకత్వం క్రింద దేశసేవ కావించిన మహిళామణులో—శ్రీమతులు నడింపల్లి సుందరమ్మ, టి. వరలక్ష్మమ్మ, ఎల్లా ప్రగడ సీతాకుమారి, మాడపాటి మాణిక్యమ్మ, బూర్గుల అనంతలక్ష్మీదేవి, నందగిరి ఇందిరాదేవి, యోగ్యశీలాదేవి. రంగమ్మ ఓబులరెడ్డిగారలను పేర్కొన వచ్చు.

ఆంధ్ర మహిళాసభ సమకాలీన సమస్యలను దృష్టిలో ఉంచుకొని సంఘ సంస్కారానికి పనిచేస్తే పంతులుగారు స్థాపించిన విద్యాసంస్థలు తరతరాల స్త్రీ విద్యకు జీవస్రవంతులుగా వెలుగునూ, చైతన్యాన్ని ప్రసాదిస్తున్నాయి. పంతులు గారికి, పెంపుడు కూతురు లాంటిది పరోపకారిణీ పాఠశాల, కన్నకూతురు లాంటిది ఆంధ్ర బాలికల ఉన్నత పాఠశాల, మనుమరాలులాంటిది రాజా బహ ద్దర్ వెంకట రామారెడ్డి మహిళా కళాశాల. పరోపకారిణీ పాఠశాల ప్రాథమిక విద్యకూ, ఆంధ్ర బాలికోన్నతపాఠశాల మాధ్యమిక విద్యకూ, మహిళా కళా శాల ఉన్నతవిద్యకూ సోపానక్రమాన్ని సంతరిస్తున్నవి. పంతులుగారి నిర్యాణం తర్వాత బాలికోన్నత పాఠశాలవారి పేరుమీద వెలయటం ఎంతో సముచితం.

వారికా పాఠశాల పోషణ నిర్మాణంలో సహకరించిన వారిలో రాజా బహద్దర్ వెంకట రామారెడ్డిగారు ప్రముఖులు. సంస్థా నిర్వహణంలో వారికి వడ్లకొండ నరసింహారావుగారి సహకారం ఎంతో లభించింది. పంతులుగారి షష్టిపూర్త్యుత్స వాలలో వచ్చిన తులాభార ధనంతో ఏర్పడిన ఆంధ్ర సారస్వత నిక్షేపనిధుల సహాయంతో (రూ. 19వేలు)1954లో ప్రారంభమైంది మహిళాకళాశాల. పంతులుగారి మహిళోద్యమాన్ని గురించీ, వారి వ్యక్తిత్వాన్ని గురించీ శ్రీమతి ఎల్లా ప్రెగడ సీతాకుమారిగారు చేసిన ప్రశంస సంస్మరణీయమైంది.

"హనుమంతరావుగారికి సమాజాలే సంతానము. మహాసభ ఒక పుత్రుడు; మహిళాసభ ఒక పుత్రిక; సోదరీ సమాజము ఒక తోబుట్టువు; భాషానిలయము ఒక గారాబుబిడ్డ; అందరికన్న అనుంగుబిడ్డ ఆంధ్ర బాలికా పాఠశాల".

"ఒక్కమాటలో చెప్పాలంటే, వీరేశలింగంగారి తరువాత మన రాష్ట్రంలో స్త్రీ జనోద్ధరణానికి పాటుబడ్డ ప్రధానవ్యక్తి ఆంధ్ర పితామహుడే".

"హనుమంతరావుగారు ఒక మహావ్యక్తియే కాడు; ఒక మహాసంస్థ. సజీవమైన విజ్ఞాన సర్వస్వము. తెలంగాణము పండించిన ముత్యాల పంట".

"హనుమంతరావుగారి చరిత్రమే ఆంధ్రోద్యమ చరిత్ర, దాని జీవితమే పంతులుగారి జీవితము".

# 7

పంతులుగారి షష్టిపూర్త్యుత్సవం హైదరాబాదు నగరంలో 1947 ఫిబ్రవరి 9వ తేదీన రెడ్డి హాస్టలు వసతి గృహంలో వైభవోపేతంగా నిర్వహింపబడింది. ఆ తరువాత తెలంగాణా ప్రధాన నగరాల్లో కూడా ఆ ఉత్సవాన్ని ఉత్సాహంతో ప్రజలు పండుగ్గా జరుపుకున్నారు. షష్టిపూర్తి ఉత్సవంలో పంతులుగారు తులాభారం తూగటం ఒక విశేషం. ఆ తులాభార ద్రవ్యం రూ॥ 6400-00 రాగా దానినీ, సన్మానరూపంగా వచ్చిన మొత్తాన్ని కలిపి మొత్తం 8,420రూ॥ 15 అణాలను ఆంధ్రభాషలో పుస్తకప్రచురణార్థం 'ఆంధ్ర సారస్వత నిక్షేపనిధి'గా ఏర్పాటు చేయటం మరో విశేషం. స్వార్థాన్ని పరహితార్థంగా భావించే పంతులుగారి త్యాగబుద్ధికి ఆ నిక్షేపం ఒక నిదర్శనం.

దాని నుండి పుట్టిందే 'ఆంధ్ర చంద్రికా గ్రంథమాల'. ఆ గ్రంథమాలలో ఖండవల్లి బాలేందుశేఖరంగారి 'విస్మృత సామ్రాజ్యములు', 'ప్రాచీన జాతులు'; ఖండవల్లి లక్ష్మీరంజనంగారి 'ఆంధ్ర సాహిత్య చరిత్ర సంగ్రహము'; ఆదిరాజు వీరభద్రరావుగారి 'ప్రాచీనాంధ్ర నగరములు'; మాడపాటి హనుమంతరావు పంతులుగారి 'తెలంగాణ ఆంధ్రోద్యమము' (రెండు భాగాలు); మారేమంద రామారావుగారి 'రాజకీయ పరిజ్ఞానము', బి. వి. రమణారావుగారి 'వైజ్ఞానికుల జీవితములు' ప్రచురితములైనవి. వీని స్వరూప స్వభావాలను గమనిస్తే అవి ప్రధానంగా చారిత్రక, వైజ్ఞానిక, జీవితచరిత్ర రంగాల నాశ్రయించియున్నట్లు స్పష్టమౌతున్నది. ఈ దృక్పథం లక్ష్మణరావు పంతులుగారి విజ్ఞాన చంద్రికా గ్రంథమండలి ప్రభావంవల్ల నేర్పడిందే. ఆంధ్ర మహాసభ రోజుల్లోనే ఆంధ్ర పరిశోధక సంఘం స్థాపింపబడింది. అది క్రమంగా లక్ష్మణరాయ పరిశోధకమండలిగా రూపొంది స్వతంత్ర ప్రతిపత్తితో గ్రంథప్రచురణలను నిర్వహించటం ప్రారంభించింది. ఆంధ్రేతిహాస రహస్యాల నెన్నింటినో వెలికి తీసిన శాసనాలను ప్రచురించి ఈ సంస్థ చరిత్రకు, విజ్ఞానానికీ యెనలేని సేవ చేసింది. పరిశోధకమండలి పరిశోధనపై ఊనిక యిస్తే ఆంధ్ర చంద్రికా గ్రంథమాల ప్రజారంజకంగా చరిత్ర సాహిత్య విజ్ఞానాన్ని అందించటానికి ప్రయత్నం చేసింది. ఒకటి పరిశోధకులకూ, మరొకటి సహృదయులకూ సన్నిహితమై సాహిత్య సేవ చేశాయని చెప్పవచ్చు.

1954 నాటి ఆంధ్ర సారస్వత నిక్షేపంలో పందొమ్మిదివేల రూపాయలు నిలువ ఉంది. అప్పటికి ప్రచురణ కార్యక్రమం కంటె స్త్రీల కళాశాల పోషణం ముఖ్యమని తలచి పంతులుగారా ద్రవ్యాన్ని రాజాబహద్దర్ వెంకటరామారెడ్డి మహిళాకళాశాల నిధికి విరాళంగా ఇచ్చివేశారు. బహుశః పంతులుగారు బెంజిమిన్ ఫ్రాన్‌క్లిన్ లాగా "An investment in knowledge pays best interest" అని భావించి ఈ రెండు నిర్ణయాలూ తీసికొని ఉంటారు.

ప్రజలు స్వయంగా చదువుకొని సమకాలీన సమస్యల పరిజ్ఞానాన్ని తెలుసుకునే నిమిత్తం హనుమంతరావుగారు 'అణా గ్రంథమాల' అనే చిత్రమైన ప్రచురణ ప్రయోగాన్ని నిర్వహించారు. చౌకధరలో, పరిచయాత్మకమైన చిన్ని పుస్తకాల ద్వారా ప్రజాజీవితానికి కావలిసిన దాదాపు 25 అంశాలపై విజ్ఞాన

వ్యాప్తి చేశారీ గ్రంథమాల ద్వారా. నిజాం రాష్ట్రాంధ్రులు, వర్తక వ్యాపారం, వెట్టిచాకిరి, వ్యవసాయకులకు కొన్ని సూచనలు, మద్యపానము, గ్రంథాలయములు, మన వాక్స్వాతంత్ర్యము, ఋణబాధానివారణ, మన విద్యాసమస్యలు, గస్తీనిషాన్ 53 యొక్క వివరణ, జనపరిగణన వృత్తాంతములు, నిజాం రాష్ట్రాంధ్రుల అభివృద్ధి మార్గములు, మొహతర్మా న్యాయస్థానములు, దేశభాషలు-ఇలాంటి విషయాలపై ప్రచురణలు వచ్చాయి. అవి వేల సంఖ్యల్లో అమ్ముడుపోయేవి. ఈ గ్రంథమాల ప్రజాదరణాన్ని బహుళంగా చూరగొన్నది.

పంతులుగారు తాము నిర్వహించే దేశసేవ కార్యక్రమంలో యువకులు అధికసంఖ్యలో పాల్గొనాలని భావించేవారు. వారి నాకర్షించి ఉత్సాహపరిచే కార్యక్రమాలను రూపొందిస్తుండేవారు. ఆంధ్ర విద్యార్థులలో వక్తృత్వ పోటీలు పెట్టడం, ఉస్మానియా విశ్వవిద్యాలయంలో పట్టభద్రులైన తెలుగు వారికి సన్మానాలు, చిత్రకారులకు ఆర్థికసహాయం చెయ్యటం లాంటి ఎన్నో యువజనోత్సాహ పోషకాలైన కార్యక్రమాలను చేపట్టేవారు. వారు పెద్దల్లో పెద్దలుగా పిన్నల్లో తలలో నాలుకలా వర్తించేవారు.

సమర్థులైన యువకుల్ని కార్యరంగంలోకి లాగటానికి పంతులుగారుపయోగించే సమ్మోహనాస్త్రాలు 'లేఖలు'. పంతులుగారి లేఖల ప్రభావం ఎలాంటిదో వారి లేఖలచేత ప్రభావితులైన శ్రీ దేవులపల్లి రామానుజరావుగారి మాటల్లో వినండి:

"ఇప్పటికి ముప్పై ఆరు సంవత్సరాల క్రిందిమాట. 1939లో నిజాం కళాశాలనుండి డిగ్రీ తీసుకొన్న తరువాత ఒకటి రెండు సంవత్సరాలు తీరికగా ఇంటిలో ఉండటం తటస్థించింది. ఆ కాలంలో న్యాయవాద వృత్తి అవలంబించవలెనా లేక వ్యవసాయము మొదలైన ఇంటి వ్యవహారాలు చూచుకొనవలెనా అని ఆలోచించుకుంటున్న రోజులు. కాలక్షేపానికి కొంత కవితా వ్యాసంగము, రచనా వ్యాసంగము చేస్తుండేవాణ్ణి. ఆ సందర్భంలో గోలకొండ పత్రికలో కొన్ని వ్యాసాలు వ్రాసి ప్రచురించే అవకాశం కలిగింది".

"నా మొట్ట మొదటి వ్యాసము పత్రికలో ప్రకటితమైంది. ఎంతో సంతోషం కలిగింది. రెండు రోజుల తర్వాత సన్నని దస్తూరితో 'మిత్రవరా!' అని సంబోధిస్తూ వ్రాసిన కార్డు ఒకటి అందింది. ఆ కార్డు హైదరాబాదు రాష్ట్రాం

లోని సమస్త ప్రజాహిత జీవనానికి, సాంస్కృతిక కార్యకలాపాలకు అన్నింటికీ మార్గదర్శకులైన మూలవిరాట్టు ఆంధ్రపితామహ మాడపాటి హనుమంతరావు పంతులుగారు వ్రాసింది. వారి ప్రశంస నన్ను పరమానంద భరితుణ్ణి చేసి, సాహిత్యరంగంలో కృషిచేయవలె ననే సంకల్పము రేకెత్తించింది. నా వ్యాసానికి హర్షిస్తూ హైద్రాబాదు వచ్చినప్పుడు తమను తప్పక కలుసుకోవలసిందిగా పంతులుగారు నన్ను ఆకార్డులో కోరినారు. అంతటి మహావ్యక్తి కోరికను అదేశంగా భావించి, తరువాత కొన్ని వారాలకు హైదరాబాదు వచ్చి, సందర్శించినాను. ఆనాడు వారు నాపట్ల చూపిన ఆదరము, నాకు ఇచ్చిన ప్రోత్సాహము నా జీవితంలో ఎన్నడూ మరువజాలను. ఆనాటి వారి ప్రోత్సాహమే తరువాత నాకాలాన్ని పూర్తిగా సాంస్కృతిక కార్యకలాపాలకు వినియోగించటానికి కారణభూతమైనది. విద్యాధిక యువకులను ప్రజాసేవ వైపు ఆకర్షించడం పంతులుగారి ఆశయాలలో ఒకటి."

"1942లో 'తెలంగాణ' దినపత్రికగా హైదరాబాదునుండి వెలువడింది. ఆ పత్రిక సంపాదక వర్గంలో చేరవలసిందని హనుమంతరావు పంతులుగారు స్వదస్తూరితో మరొక జాబు వ్రాసినారు. కాని, నేను నాగపూరు న్యాయ కళాశాలలో చేరినందువలన ఆ అవకాశాన్ని వినియోగించుకోలేదు. అయితే హైదరాబాదుకు వచ్చిన ప్రతి సందర్భంలోనూ పంతులుగారిని సందర్శించి, వారితో కొంతకాలము గడిపి, ఉత్తేజితుణ్ణి అయ్యేవాడిని. వారి సలహాలను ఆశీర్వచనాలను పొందేవాడిని. వారు నాపట్ల చూపిన ఆదరాభిమానాలు నా ప్రజాహిత జీవనానికి మార్గదర్శకాలైనవి".

"క్రమశిక్షణ, సమయపాలన, విశేషించి సంస్థలడబ్బు వినియోగించడంలో కఠినమైన నియమాల పాటింపు[17] ప్రజాసంస్థలకు సుస్థిరమైన పునాదులను నిర్మించవలెననే దీక్షా నేను పంతులుగారి నుండి నేర్చుకున్న పాఠాలు. ఆ

17. "ప్రతి చిన్న విషయములోను కట్టుబాటు; అందు ఆవంత పొరపాటును గూడ గుమ్మడికాయంతగా జూతురు. సహింపనే సహింపరు. తమ యింటి లెక్కయెట్లో ప్రజానిధి లెక్కయునట్లే. దమ్మిడీ దమ్మిడీ లెక్క పెట్టవలె. ఆలెక్క సరిగా కుదరవలె. పదిస్నీ వ్యర్థము పోరాదు. "అనెగొంది లెక్కలు వారికి సరిపడనే సరిపడవు" -శ్రీ సురవరం ప్రతాపరెడ్డిగారు-గోలకొండ పత్రిక.

పాఠాలను సరిగా అభ్యసించి, అందుకు అనుగుణంగా వ్యవహరించి నందువల్లనే నేను నాకొద్దో గొప్పో భాషసేవ, దేశసేవ చేయగలిగాను. నాజీవితంలో ఈ మలుపుకు కారణభూతులు హనుమంతరావు పంతులుగారే!"

"ఆయన మరెందరికో మార్గదర్శకులైనారు. నాటి తెలంగాణా పరిస్థితులు తెలిసిన వారందరికీ యీ సత్యము విదితమే కదా!"[18]

పంతులుగారి దేశసేవ చరిత్రను సృష్టింపగల సంస్థలను స్థాపించటంలో ఎంత కనబడుతుందో సంస్థలను స్థాపించి సంఘచైతన్యాన్ని పోషించే యువకులను ప్రోత్సహించటంలో అంత కనపడుతుందని శ్రీ రామానుజరావుగారు చెప్పిన యుదంతం సాక్ష్యం. పంతులుగారికి ప్రజాసంస్థలు స్థిర కీర్తిపతాకలు; దేశసేవకులైన వారి అనుయాయులు జంగమ కీర్తిపతాకలు.

# 8

పంతులుగారి షష్టిపూర్త్యనంతర జీవితం వారి ప్రజాసేవలో మూడవ ఘట్టం. హైదరాబాదు నగర మేయరుగా నాలుగేళ్లు (1951–54), ఆంధ్ర ప్రదేశ శాసనమండలి అధ్యక్షులుగా ఆరేండ్లు(1958–64) పంతులుగారు ప్రజాసేవ నిర్వహించారు. పరిపాలనలో, సభామర్యాదలలో ఉత్తమ ప్రమాణాలను సృష్టించారు. కేంద్రప్రభుత్వంవారు వారి ప్రజాసేవను గుర్తించి 1955లో 'పద్మభూషణ' బిరుదాన్ని ప్రసాదించారు[19]. ఉస్మానియా విశ్వవిద్యాలయం వారు 1956లో గౌరవ డాక్టరేట్ పట్టాన్నిచ్చి గౌరవించారు. ఈ బిరుదులు తాత కోటుకు మనుమ లలంకరించిన ప్రశంసా పతకాల్లా మెరుస్తున్నాయి.

ఆంధ్ర పితామహులు కన్నకలలు ఆంధ్రప్రదేశ్ రాష్ట్రరూపంగా ఫలించాయి. తెలుగు వారంతా ఏకమై నివసిస్తున్న వెలుగు గడియల్ని కళ్లారా చూచి సంతోషించారు. తన కార్యక్షేత్రమైన హైదరాబాదు నగరానికి మేయరు కావటం, ఆంధ్ర ప్రజలందరి శాసనమండలికి అధ్యక్షులు కావటం తెలుగువారు వారి పట్ల చూపిన భక్తి ప్రపత్తులకు పరమ నిదర్శనాలు.

---

18. నందిని–యువభారతి సాహితీ సాంస్కృతిక సంస్థ మాసపత్రిక-1975, మే. సం. 1. సంచి. 5

19. ఈ బిరుదాన్ని పొందిన మొదటి తెలుగువారు వీరే.

ఈ రోజెవరైనా హైదరాబాదు నగరాన్ని దర్శిస్తే హనుమంతరావు పంతులుగారీ నగరానికిచ్చిన తెలుగుదనం ప్రస్ఫుటంగా ప్రత్యక్షమౌతుంది. వారి నివాసం 'ఆంధ్ర కుటీరం' ఆంధ్రోద్యమ చైతన్యానికి కేంద్రబిందువు. మాడపాటి హనుమంతరావు పంతులు బాలికోన్నత పాఠశాల, రా. బ. వేం. రా. రెడ్డి మహిళా కళాశాల పంతులుగారి ఆంధ్ర స్త్రీ విద్యా వికాససేవకు శాశ్వత పతాకలు. ఉస్మానియా విశ్వవిద్యాలయం మాతృభాషాభ్యసనాభివృద్ధికి పోరాడిన వారి కార్యరంగం. ఆంధ్ర యువతీమండలి వారి ఆంధ్ర మహిళాసభ సాధించిన ప్రగతికి ప్రత్యక్ష దృష్టాంతం. శ్రీ కృష్ణదేవరాయాంధ్ర భాషా నిలయం వారి గ్రంథాలయోద్యమానికి కీర్తిధ్వజం. ఆంధ్ర సారస్వత పరిషత్తు, వారి ఆదర్శాలను నమ్మి భాషా సాహిత్య సేవలు చేస్తున్న తెలుగువారి ప్రౌఢ సాహిత్య సంస్థ: రెడ్డి విద్యార్థి వసతి గృహం వారితో రాజాబహద్దుదు వారికున్న చెలిమికి చిహ్నం. వారి పేర వెలసియున్న వీథి ప్రజలకు వారు చూపిన మేలిబాటకు మిగిలియున్న గుర్తు. ఆంధ్ర ప్రదేశ రాజధానిలో తెలుగువారి సంస్థ ఎక్కడ ఉన్నా దానికీ పంతులుగారికీ ఏదో సంబంధం ఉండి ఉంటుంది. ఆ సూత్రధారు డాడించిన జాతిజీవిత నాటకంలో పాత్రలు నిర్వహించిన భూమికలు ఆ సంస్థలు: జాతికి వారిచ్చిన నిర్మాణాత్మకమైన ఉద్యమస్ఫూర్తి, జీవితంలో వారు చేసిన త్యాగ విస్ఫూర్తీ, తెలుగు జీవితంలో కలకాలం వెలుగు రేకల్ని వెదజల్లుతూనే ఉంటాయి.

పంతులుగారి దేశసేవను సింహావలోకనం చేస్తే నాటి తెలంగాణ పత్రిక మాటలే నేటికీ మననోట వెలువడతాయి–

"నేటికినీ భారతీయ దేశీయ సంస్థానములలో ప్రజాస్వామ్యోద్యమములు వృద్ధి నందుటకు అనుకూలములు బొత్తిగా లేవన్నచో 1920వ సంవత్సరమున హైదరాబాదు నందలి పరిస్థితి సులభముగా నూహింపవచ్చును. అట్టి పరిస్థితిలో కామధేనువు వంటి న్యాయవాది వృత్తిగల్గియు, సౌఖ్యజీవనము గడుపుటకు అన్ని వీల్లు కల్గియు వాటి నన్నిటిని త్యాగముచేసి, ప్రభుత్వ వ్యతిరేకతను, ప్రజల యుదాసీనతను ఎదుర్కొనుచు ప్రజాసేవా కార్యమున దుమికిన శ్రీ హనుమంతరావు పంతులుగారికి ఎంత యున్నత స్థానమిచ్చినను తక్కువే."

---